సంతోష తరంగితమయ్యెను. పడవ యొడ్డునకు రాఁగానే యామె యుత్సాహముతో నెక్కఁబోయెను. పడవ వాఁడు "ఇందు నీకు చోటు లేద"నెను. ఆమె పడవవాని నెంతో బ్రతిమాలుకొనెను. కాళ్ళ వేళ్ళఁబడెను. వస్త్రము ముట్టుకొనెను. కాని యాతఁడు చోటు లేదని మాత్రమే చెప్పెను. పడవ తిరిగి బయలుదేరెను. ఆమె యెలుఁగెత్తి యేడ్చుచు గోలపెట్టెను. రాత్రి యంతయు నిర్జనమగు నదీతీరమున నేమగునని గుండెలు బద్దలగుచుండ నదిలో నడిచి పడవను పట్టుకొనఁబోయెను. ఇంతలో నెవ్వఁడో "ఆఁగు మాఁగుమా. ఇంకా నది మునిఁగి పోయెదవు. అపకర నీరోధ్యం గాదు. ఇదిగో, నేను వచ్చుచున్నాను. నా పడవ యెక్కుము. ఆవలి యొడ్డునకు చేర్చెదను." అని ధ్వని వినఁబడెను. ఆమె భీత భీతయై యెచటి నుండి శబ్దము వచ్చెనా యని నల్దిక్కుల కలయఁజూచెను. కొంచెమాగిన తరువాత నొక చిన్నడింగీ వచ్చుట కనిపించెను. ఆపడవకు తెడ్లు లేవు. తెరచాప లేదు. చుక్కాను లేదు. అక్కడక్కడ నది తూట్లు పడియుండెను. ప్రక్క చెక్కలు విఱిగి యుండెను. లోన నీరు తట్టాడుచుండెను. ఒకఁడా నీరు తోడి పారఁబోయుచుండెను. ఆమె యాతనిని "ఇది చిల్లిపడవ గదా యెట్లావలి యొడ్డునకు చేరఁగల"దని ప్రశ్నించెను. "నీకొఱకిదే పంపఁబడినది. వచ్చి యెక్కు"మని పడవవాఁడనెను. ఆమె యొక క్షణము నిల్చుండెక్కుటయేనా యని యాలోచించెను. చివర కెక్కుటకే నిశ్చయించెను. "ఒంటరిగ నిచట నిర్జన ప్రదేశమున నేను పడియుండుటకన్న చిల్లిపడవ మాత్రము

మేలుకాదా" యనుకొనెను. ఏభయంకర జంతువు వాతనో పడుటకంటె నదిలో మునిఁగి ప్రాణములు విడుచుట మంచిది కదా- పడవ యొడ్డుచేర్చునేమో యెవరికెఱుక? ఆమె గుండె గుప్పిట విడుకొని పడవ యెక్కెను. పడవ కొంతసేపటి వఱకు నూగుచు నల్లలాడుచు పోవుచుండెను. అంతకంతకు నీరులోన నెక్కువగుచుండెను. ఆమెకూడ పడవ వానితోపాటు నీరుతోడి పారఁబోయసాగెను. కాని యిద్దరికిని వశముతప్పెను. చివరకు పడవ గిరిగింతలుకొట్టసాగెను. ఇదిగోమునిఁగె నదిగోమునిఁగె నను స్థితివచ్చెను. ఇరువురును చేతులెత్తి యుజ్జ్ఞాతశక్తిని సాయమునకై ప్రార్థించిరి. పడవ కాళ్ళకిందనుండి తొలఁగెను. ఆమెగుండె గుభేలుమనెను. బిగ్గరగానఱచెను. అరుచుటతో పాటు కన్నులు తెరచెను. ఎదుటనిలిచి భుజముపైతట్టి తల్లి తన్ను మేల్కొల్పుచుండెను.

---

## ద్వితీయప్రకరణము

---

అనంతరామయ్యగారి యిల్లు బజారుదగ్గఱనుండెను. వసారాలో స్వర్ణకారుని సుత్తినడచుచుండెను. గదిలో దర్జీవాని గుట్టుయంత్రము రొదచేయుచుండెను. ఇంటిమెదుట వేపచెట్టు క్రింద వడ్రంగి మంచపుకాలు చేయుచుండెను. పెంకుటింటి వసారాలో పిండివంటలు తయారుచేయుటకు గాడిపొయ్యి

త్రవ్వఁబడియుండెను. అతిథులకు వేఱొకయిల్లేర్పాటు చేయఁబడెను. అతిథుల కొక్కొక్కరి కొక్కొక్కమంచము, ఒకకుర్చీ, ఒకబల్ల, అమర్పనుద్దేశించిరి. ముగ్గురతిథుల కొక్కొక్క పనివాని నంపఁదలఁచిరి. పెండ్లివారు మఱొక్కనెలకు వచ్చెదరు. కాని యిప్పటినుండియే పెండ్లిపనులు పూర్తియగుచుండెను. పెండ్లివారు పెడవిడిచుటకు వీలులేకుండ మర్యాదలు జరుగవలెను. ఫలానావారింటికి పెండ్లికిపోయితిమని వారందరికి నేనాటికైన గుర్తుండవలెను. ఒకయిల్లంతయు వంటపాత్రలతో నిండియుండెను—పానపాత్రలు, పళ్లెములు, గ్లాసులు, గంగాళములు. నిత్యము మంచములపైఁబడి దొర్లువారు కార్యతత్పరులై యొడలువంచి పనిచేయుచుండిరి. తనయుపయోగితను ప్రదర్శించుట కింతకంటె మంచియదను దొరకదు. ఒకఁడు వెళ్ళి చేయదగుపని కేవురుపరుగెత్తుచుండిరి. "అనుపని తక్కువ, ఆర్భాటమెక్కువ" గానుండెను. ఎల్ల చిన్నవిషయములకును గంటలతరబడి చర్చజరుగుచుండెను. తానుగా యజమాని వచ్చినగాని చర్చతెగకుండెను. ఈనెయ్యి మంచిదికాదని యొకడనును. ఇంతకన్న మంచిది బజారునలభించుచో నీ కాలిక్రింద దూరిపోవుదునని మఱియొకఁడనును. నీముక్కు మురిగినదని యింకొకఁడనును. నెయ్యియన నీకేమి తెలియును. వీరింటికి వచ్చినపిమ్మటఁగదా చేతికిజిడ్డైనదని వేఱొక్కఁడనును. అంతతో సంఘర్షణపెరుగును. అవంత రామయ్యవచ్చి జగడము తీర్పవలెను.

రాత్రితో మిన్నుదిగంటలయ్యెను. అనంతరామయ్య లోపల కూర్చుండి పెండ్లి ఖర్చులయంచనా వేయుచుండెను. ఆయంచనా ప్రతిదినము వేయుచునే యుండెను. కాని యేనాటి కానాడే కొన్ని మార్పులు మఱికొన్ని చేర్పులు తప్పకుండెను. ఎదుట ననంతలక్ష్మమ్మ కనుబొమలు ముడిచికొని నిలిచియుండెను. చాలసేపటికి తలయెత్తి యనంతరామయ్య-పదివేలకు తక్కువ కాదు. అప్పైమాట-అనెను. "పదిరోజులలో నైదువేలు పది వేలైనవి. నెలరోజుల కొకలక్షయైన కాకుండునా" యని యనంతలక్ష్మమ్మ యాయాసపడించుకొనెను.

అనంత :—ఏమిచేయుదును? ఏదైనలోటు జరిగిన లోకులే మందురు? వారు రాగిదమ్మిడి కట్నమైన తీసికొన నప్పుడు మర్యాదలైన సరిగ జరుగవలదా?

లక్ష్మమ్మ :—సృష్ట్యాదినుండి నేటివఱకు పెండ్లి వారిని మెప్పించినవారు పృథ్విలో లేరు. వారికి నెరసులెన్న నవకాశము లేకుండ చేయుట యసంభవము. పొట్ట కూటికి గతిలేనివాడును పెండ్లివారితో వచ్చి రాచ పోకడలు పోవును. నూనె సువాసనగా లేదు. సబ్బు నేగాసికి కొనవలెనన్నది. పనివారు చెప్పిన మాట వినరు. దీపములు పొగపట్టి వెలుగనే వెలుగవు. కుర్చీలనిండ నల్లులే. మంచములన్ని కుక్కులే. విడిది యింట గాలియేరాదు. ఇట్లు వేనవేలు లోపములెన్నెదరు. వారినెంత వఱకు తృప్తిపఱుపఁ గలము. ఈ లోపముల నెన్నుచు నవకాశము లేనపుడు సహజోపకరీతి విమర్శింతురు.

మేము సాదా నూనె వాడుకొనువారమే గాని ఈ భోగము నూనెలు పనికిరావనెడు వారము, ఏమి నబ్బి పంపెనురా! తన హోదానంత నిందే చూపెనే! ఎంత యున్నవారికైన నింత తగదు మీరు సేవకులు గారు, యమదూతలు ఏమి కావలె నేమి కావలె నని నెత్తిపై కూర్చుందురు. ఇవి లైట్లు కావు వెలుగు సూదులను కనులలో గ్రుచ్చు యంత్రములు ఇట్లే యీ వెలుగున నాలుగు దినములున్న కన్నులు పోవును. విడిది యూరు బయట లేక, గాలి తాకుటకు తావు లే మందురు. అందువలన పెండ్లివారి మర్యాదల విష యము మీరు యోచించనే కూడదని నా యభి ప్రాయము.

అనంత :—ఇంతకు నన్నేమి చేయుమందువు?

లక్ష్మమ్మ :—నేను చేయునది లేమి? అయిదు వేలకు మించి ఖర్చు చేయకూడదని నిశ్చయించుకొన్నాను. చేత నర కాసైన లేదుకదా! జీవితమంతయు తీర్చలేని యప్పులు చేసి పెంచ్చించిన మిగిలిన పిల్ల లేమగుదురు? వారికి మాత్రము వలదా?

అనంత :—అయిన నీ కిదియే పాటయా?

లక్ష్మమ్మ :—ఇందేమి దోషము కలదు. ఏనాడో అందఱము పోవలసినవారమే. ఎల్లకాల ముట్టిగట్టికొని యూరేగు వారు లేరు. కన్నులు మూసికొన్నంత మాత్రమున కాగలపని కాకమానదు. తండ్రిపోయిన వెనుక దరి

ద్రుత్తై యిల్లిల్లు తిరుగువారి నెందఱిని చూడలేదు. మూరెడుపోయి బారెడు ప్రకుంగనేల?

అనంతరామయ్య కోడలు మండెను. "అయిన నామరణ మాసన్నమైనదా? ఇది నిజ్యోతిషము కాంబోలును. ముత్తైదువులకు మంగళసూత్రము బరువగుటింతకు మునుదెఱుంగను. అవును వైధవ్యమునందు మాత్రము సుఖము లేదా!" యనెను.

లక్ష్మమ్మ:—లోకముతీరు చెప్పినను మీరు నిప్పులు గ్రక్కెదరు. నాకెక్కడను వెరవు లేదనిగదా ఈ యీసడింపు, మీ మీద తిండికాధారపడితి ననియేకదా? రవంత మాట కగ్గియగుదురు. నేనీయింటి దాసిని. త్రొక్కలు విఱుగ చాకిరి చేయుదునేమో నాలుగు మెతుకులు తినుచుంటిని. నాకు కూడు-గుడ్డ సంబంధమేకదా. అణగిన కొలఁది నణఁచెదరు. ఇంటఁబడి యొకరింత తిన్నను నోరు మెదల్పరాదు. విందులకు మందులకు వేలు ఖర్చైనను అదేమని యనరాదు. ఇదంతయు నాపిల్లల సొమ్మేకాదా?

అనంత:—ఆఁడువారి యడుపాజ్ఞలకు లొంగు పురుషులు వేఱు. నేనాజాతివాఁడను గాను.

లక్ష్మమ్మ:—మగవారి చెప్పుదెబ్బలు సహించు స్త్రీలు వేఱు. నేనా జాతిదానను గాను.

అనంత:—నేను సంపాదించినది నా యిష్టము వచ్చినట్లు ఖర్చించుకొందును.

లక్ష్మమ్మ :—అయిన మీయిల్లు మీరే చక్క దిద్దుకొనుఁడు. నాయూసులేని ఈ యింటికొక దండము. ఇంట మీ కెంతగలదో నాకు నంత యధికారమున్నది. మీకు మీరు రాజగుచో నాకు నేవరాణిని. మీధర్మమా యని నాకింత కూడు దొరకకపోదు. మీబిడ్డలు-చంపు కొన్నను సరే, బతికించు కొన్నను సరే కంటితో చూడకున్న నాకా బాధ లేదు. కన్నులు పోయిన కథయే మాయును.

అనంత :—నీవు లేకున్న నాయిల్లు గడవదనియా నీ తలంపు? నేనిట్టివి పదిండ్లు చక్క పెట్టఁగలను.

లక్ష్మమ్మ :—మీరా! నెల తిరుగునప్పటి కిల్లు వల్లకాడు గాకున్నచో నన్ను పేరున పిలువవలదు.

అనంతలక్ష్మమ్మ మొగమొత్తుకొనెను. ఒక్కయంగలో నామె గదినుండి యావలికిపోయెను. ప్లీడరుగారు వ్యాజ్యముల విచారణ నెఱుంగుదురేగాని స్త్రీ స్వభావాభిజ్ఞులుగారు. ఎంత వయను వచ్చియు పురుషుఁడు నేర్వలేని విద్యయిదొక్కటే. ఇప్పటికైనను పిలిచి లాలించుచో లక్ష్మమ్మ మేరమీరదు. కాని యాయనకిది చేతకాలేదు. పైఁగా పుట్టినింటిగర్వము కాఁబోలునని మొత్తిపాడిచెను. లక్ష్మమ్మ ద్వారమునొద్దనాగి కోపదృక్కులతో భర్తనువీక్షించి "నాకర్మమునకు పుట్టినింటి వారేమిచేయుదురు? నారిమొత్తుకు కాళించిపోవునంత నీచు రాలనుగా"నని పలికెను.

అనంత :—అయిన నిప్పటి కేగెదవు?

లక్ష్మమ్మ:—అసలు కారణమును నీకెవరు? ఈశ్వరసృష్టియందెన్ని కోట్లజీవులకు వెరవు లేదు. నాకొక్కతెకే కొరవ యగునా?

ఇట్లని లక్ష్మమ్మ బయటికి వెడలిపోయెను. ఆకసమున నున్న నక్షత్రములవంకఁ జూచెను. తానా యింటినుండి యెంత నిర్దయముగా వెడలఁగొట్టఁబడుచున్నదో తారాగణము సాక్షి భూతమై పరికించుచున్నదని యామెతలంచె. గృహము నిశ్శబ్ద ముగనుండెను. ఇద్దరుకుమారుల శయ్యయు తనగది యందవ మర్చఁబడుచుండెడిది సూర్యుడు నిద్రించుచుండెను. కడసారి వాఁడు చంద్రుఁడు ప్రక్కమీఁద లేచి కూర్చుండెను. తల్లిని చూడఁగనే "యెక్కడికేగితివే, అమ్మా!" యనెను. ఎక్క డికిని లేదునాయనా! మీనాన్నగారియొద్ద కేగితినని లక్ష్మమ్మ యనెను.

చంద్రుడు:—నీవు నన్ను వదలివెళ్ళిపోతివి. నాకొక్కనికి భయము వేయును నన్ను వదలి యెందుకు పోతివి? చెప్పు

చంద్రుఁడు రెండుచేతులుచూచి యొడిలోనికి రానిచ్చ గించెను. లక్ష్మమ్మ యిఁక నాగఁజాలకపోయెను. మాతృ ప్రేమ యమృతప్రవాహమువలె నామె సంతప్తహృదయమును పరిప్లావితమొనరించెను. క్రోధతాపమున వాడినహృదయపల్ల వము స్నేహార్ద్రతచే నవనవోన్మేషమందెను. ఆమెనేత్రములు సజలములయ్యెను. పిల్లవానిని రొమ్మునకద్దుకొని "భయము వేసిన నన్నేలపిలువకుంటివి నాయనా"? యని ముద్దుపెట్టు కొనెను.

చంద్రుడు :—మరి నేనుపిలిచినను పలుకవైతివి. ఇకముందెన్నడును విడిచి వెళ్ళవుకదా ?

లక్ష్మమ్మ :— లేదునాయనా? ఎన్నడును విడిచి వెళ్ళను.

లక్ష్మమ్మ చంద్రుని పెట్టుకొని మంచముమీద పడుకొనెను. తల్లినికౌఁగిలించుకొని పిల్లఁడు నిశ్శంకమైనిద్రపోయెను. లక్ష్మమ్మ మనమున సంకల్ప వికల్పములు జనింపసాగెను. భర్త మాటలు స్మరణకువచ్చి "ఈయింటికి తిలాంజలినిత్తునా" యని తలంచును. పిల్లలమోముఁజూచి వాత్సల్యమున గద్గద కంఠియగును వీరినెవరు సాకెదరు ? ఎవరన్నముపెట్టి నీళ్ళు పోయుదురు ? ఎవరు పక్కపైని పండుకొనఁబెట్టెదరు. తాను లేకున్న పాపము "చెట్టునకొకరు పుట్టకునొకరు" రయ్యెదరు. అమ్మో! తాను వారిని వీడిపోఁజాలను. వారికై తానన్నియు సహింపఁగలదు. తిట్లు, తిమ్ములు, విదలింపులు, ఈసడింపులు, చివాట్లు, చెంపదెబ్బలు తానన్నియు నోర్చుకొనఁగలదు.

లక్ష్మమ్మ పిల్లవానితోకూడ నిద్రించెను. అనంత రామయ్యకు నిద్రపట్టలేదు. ఆయనమాట తేలికగామఱచు వాఁడు కాఁడు. ఎంతనిర్లక్ష్యము ! తానేయామెకు భార్య యైనట్లు గద్దించెనే ! నోటమాటయనుతడవు. నేను వీరికిట బానిసనై యుండవలెనుకాఁబోలు. తనకు గాసివారందఱును గృహమువీడిపోవలసినదే? ఎందుకంతమంట ఎట్లైన నితఁడు చచ్చిన పోయిగ్రబతికెదమని కాఁబోలు. ఎంతదాచినను లోని మాట నోటబయట పడకమానదు. ఇన్నాళ్ళనుంచి చూతును గదా; ఎప్పటికప్పుడే విదలించుకొనుట నేడందఱును బంధు

వులే. ఇల్లువట్టినప్పుడుగాని వారికిగింజలధర గుర్తురాదు. ఈ యిల్లంతయు తానేనడపుచుంటినని యేమియహంభావము ! నాల్గువాళ్ళపాటు కట్టికైనపోయిన తెలిసివచ్చును. అన్నియహంభావములణగారును. ఒకవరి వైధవ్యము రుచిచూపించినఁగాని తిక్కకుదురదు నన్నింతతిట్లుతిట్టుటకీమెకీ సాహసమేమో బోధపడదు. ఈమెకు ప్రేమ యనునది తెలియునే తెలియునా ? ఎంత కసరికొట్టినను ఏమనసహించినదే యింకను మనసేత్తురా ? అంతియేకానోపును. కాక ప్రపంచమును పట్టుకొని ప్రాకులాడు ప్రాణికాదిది. ఈసంసారసాగరమున నరకముసేలు ఇల్లా వల్లకాడా యిది. వైటనుండి యలసి సొలసివచ్చిన నింట రవంత విశ్రాంతి లభించును. ఇచ్చట విశ్రాంతి లేకపోఁగా విసుగు విరామము లేని తిట్లు. నాచావునకై ప్రతీక్షము పట్టునుందురు. పాతిక సంవత్సరములు గార్హస్థ్య జీవితము సేటికోసం. ఇంక దీని తిక్క కుదిరినగాని యింటికి రాను. ఎంతకావలెను నాలుగైదురోజులలో పెడతప్పిన బుద్ధి కుదుటపడును. నేనెవఁడనో నాఁడుగాని తెలిసిరాదు

ఈ తలంపులతో ననంతరామయ్య లేచి పట్టుశాలువ పైని వేసికొనెను. కొన్నిరూపాయలు, తన చిరునామా కార్డులు చొక్కాజేబున నుంచుకొనెను. చేతికఱ్ఱ ధరించి గుట్టు చప్పుడు కాకుండ బయటపడెను. అలికిడికి కుక్క లేచి యాతని వెంట పోసాగెను.

ఇది యంతయును విధివిరచితమగు లీలయని యెవ్వ రెఱుంగుదురు? జీవితరంగమున నిర్దయుఁడగు సూత్రధారు

డెచటనో యగమ్య స్థానమునకు కూర్చుండి ఈ ఘోరనాటకము నాడించుచుండెను. ఈ నాటకము వాస్తవికమగు ననియును, అభినయము సత్యరూపము దాల్చుననియు నెవరికి తెలియును?

అంధకారము చంద్రుని జయించి నల్దిక్కుల నలము కొనెను. దాని పైశాచిక సేన ప్రకృతిని నిస్తబ్ధమొనరించెను. సద్వృత్తులు మోముచంచి యొకమూల నొదిగి యుండెను. దుర్వృత్తులు వీరవిహారమొనర్ప సాగెను. అడవులయందు క్రూరజంతువులు సంచరించునట్లు పట్టణములందు నరపిశాచములు ప్రవిమ్మర సాగెను.

అనంతరామయ్య గోదావరి వైపునకు సాగిపోవుచుండెను. చౌక్ నొద్దున వదలి యాయున నాలుగైదు రోజులపాటు ప్రదాక్షారామము పోదలంచెను. చౌక్ చూచిన జనుల కాయన యురిశించెనని యూహింతురు. జేబులో చిరునామా తెల్పు కాగితమున్నదిగదా; నిముసములో పట్టణమంతయు గగ్గోలగును. ఎనిమిది గంటలు కొట్టకముందే ఇంటి ముందు జనము మూగెదరు. అప్పుడు తెలియు నమ్మగారివని!

అనంతరామయ్య నందు వెంటబడి మనమున నాలోచించుకొనుచు పోవుచుండెను. వెనుక నెవ్వరో వెంబడించుచున్న యలికిడి తోచెను. ఎవరో యనుకొని యాతఁడు ముందుకు సాగెను. తా నేసందు తిరిగిన నాతఁడా సందునకే తిరుగును. ఈతఁడు తన్నే వెంబడించు చుండెనని అనంతరామయ్య నిశ్చయించుకొనెను. ఏదో దురుద్దేశము

తోనే వెన్నంటుచున్నట్లు గోచరించెను. వెంటనే జేబుదివ్వె వెలిగించి యామనుష్యుని పరికించెను. ఒకబలిష్ఠుఁడు భుజమున నొక బడితెనుంచుకొని వచ్చుచుండెను. అతనిని చూచినతోడనే యనంతరామయ్య ప్రాణములు పైకెగిరిపోయెను. వాఁడు పట్టణమున పేరుపడ్డపోకిరి. మూఁడేండ్లక్రిందట నతనిపై దొంగతన మారోపింపఁబడినపుడు తాను సర్కారుతరఫున వాదించియుండెను. నేరమును నిరూపించి తానాతనికి మూఁడు సంవత్సరములు శిక్ష వేయించియుండెను. నాఁటినుండి యాతఁడనంతరామయ్య ప్రాణములతీయ సంకల్పించియుండెను. అతఁడు నిన్ననే విడుదలయై వచ్చియుండెను. దైవవశమున నొంటరిగ నాతఁడు కన్పించఁగనే యాతఁడు సదవకాశములభించినదని సంతసించెను. ఇట్టివీలిక ముందు చిక్కునో చిక్కదో. వెంటఁబడి యాతనిచంప నుంకించియుండెను. ఇంతలో ననంతరామయ్య దివ్వెవెలిగించెను. పోకిరి యుట్టేసర్దుకొని నిలఁబడి "ఏమిబాబూ! నన్ను గుర్తించితిరిగదా. నేను భీమన్న" ననెను. బాబుగారు గద్దించి యయిన నావెంటవత్తువేలయని ప్రశ్నించెను. "త్రోవ మీయబ్బసొమ్మా? మేము దారివెంట నడవరాదా" యని భీమన్న యనెను.

బాబుగారు చిన్నతనమునందు కుస్తీలుపట్టి కసరత్తు చేసిన వస్తాదు. పిఱికివాఁడుకూడా కాఁడు. కఱ్ఱనవరించుకొని "అయిన నింకను మనసుతీరలేదు కాఁబోలు ఈసారి యేడేండ్లు బోయెదవు జాగ్రత్త" యనెను.

భీమన్న :—నేనేడేండ్లుపోయినను, పదునాలుగేండ్లుపోయినను

నిన్ను మాత్రము బ్రతుకనీయను. నా కాళ్ళమీఁదపడి యింకెవ్వరికిని శిక్ష వేయింపవని వేఁడుకొన్నచో విడుతును. ఇష్టమేనా ? చెప్పు.

అనంత :—నీ చావుకాలము సమీపించినది.

భీమన్న :—చావు నాకుఁగాదు. నీకువచ్చినది. చెప్పుము, కాళ్ళపైపడెదవా, లేదా ?—ఒకటి ...

అనంత :—నీవు తొలఁగెదవా, రక్షక భటుని పిలువనా ?

భీమన్న :—రెండు.

అనంత :—ఛీ శుంఠా – తొలగుము.

భీమన్న :—మూఁడు.

మూఁడన్న మాటతోఁగూడ ననంతరామయ్యగారి తలపైబలమైన కఱ్ఱ వేటుపడెను. ఆయన మూర్ఛిల్లి నేలకొరిగెను. "చంపితివిరా" యనిమాత్రము నోటనుండిమాటవచ్చెను. భీమన్నదగ్గర కేగిచూచెను. తల బ్రద్దలై నెత్తురువరదలుగ పాఱుచుండెను. నాడిదొరకలేదు. పనిముగిసినదని తెలిసికొనెను. జేబునుండి బంగారుగడియారము, బంగారుబొత్తాములు వ్రేలి యుంగరము తీసికొని మాతఁడేమియు జరుగనట్లు తనదారిని పోయెను. దయతో శవమునుమాత్రము త్రోవలోనుండి యావలికిలాగెను. పాపమాయన యేమనుకొని యిల్లువెడలెను. ఏమయ్యెను ? జీవితమా ! ప్రపంచమునందు నీకన్న క్షణభంగుర మగునదింకొక్కటికలదా ? గాలితాకుడున టువ్వ నారిపోవు దీపమువలెనేగదా ! నీటిబుడగ మాయమగుటకుకూడ కొంత తడవుపట్టును జీవితమున కాపాటికూడ నవసరములేదు. ఊపిరి

యెప్పుడాగునో ! ఈనశ్వరత్వముతోనే కోరికల గాలిమేడల నిర్మించుచుందుము. విడిచినయూపిరి తిరిగి పీల్చుకొనఁగలమో లేదో తెలియదు. కాని యుగములవలె భవిష్యత్తు నాలోచించు చుందుము.

---

## తృతీయ ప్రకరణము

బిడ్డలగోడును వితంతువిలాపమును వర్ణించి పాఠకులను విసిగింపఁదలఁచుకొనలేదు. తప్పక వచ్చినపుడేడ్వక యెుత్తు కొనక చేయునదేమికలదు? ఇది క్రొత్తవిషయముగనుకనా ? కాని తనభర్త ప్రాణములుతీసినది తానేగదాయని లక్ష్మమ్మ పడుమానసికబాధ యూహాతీతమైయుండెను. నోరుజారి భర్త నన్నమాటలామెను హృదయశల్యములై బాధించుచుండెను. ఆయన జరావ్యాధిపీడితుఁడై సేవలఁజేయించుకొని తనచేతుల మీఁదుగా వెళ్ళిపోయియుండినచో నామెకు తనకర్తవ్యము నిర్వహించితినను తృప్తియుండెడిది. శోకతప్తహృదయముల కింతకన్న మఱొండాశ్వాసనములేదు. ఆమరణము తనభర్త మన సార తన్నుప్రేమించుచుండెననియును, ప్రసన్నతతో కాల వశమున విధిలేక మృత్యువువాతఁబడెననియు ననుకొనుటకన్న వేఱేమి తృప్తికావలెను? ఆమెకాతృప్తిలేకుండెను. ఆమె పాతిక సంవత్సరముల గృహస్థజీవితము వ్యర్థమైపోయెను. చిట్టచివర

ఆమె భర్తప్రేమవంచితయై పోవలసివచ్చెను. అంత దుష్టమాటలాడనిచో నతఁడా రాత్రి నిశీథసమయమున నిల్లు కదలియుండఁడు. ఏమనుకొని యెంత బాధఁ జెందెనో యేమో తలపోసినకొలఁది నామెదోషము బృహదాకృతి దాల్చుచుండెను. తలఁచుకొని తలఁచుకొని లోలోన కుళ్ళిపోవుట యామె నిత్యకృత్యమయ్యెను. ప్రాణసమానులగు బిడ్డలన్న సేవగింపు జనించెను. వీరే నాశత్రువులు. వీరికొఱకే భర్తతో జగడమాడవలసివచ్చెను. కలకలలాడు గృహమెడారియైనది. ఇంటిలోని జనమెవరిదారిని వారుపోయిరి. పెట్టువారు లేనిచోట తినువారేలయుందురు? అవసరమైనచో ప్రాణములనైన నిత్తుమని బింకములు పలుకు బంధువులందఱును నెల తిరుగకయే నెమ్మదిగ జారిపోయిరి. ప్రపంచము తిరుమాఱినది. మున్ను బిడ్డలను జూచిన ముద్దువచ్చుచుండెను. ఇపుడు వారిమొగమున ఈఁగలు ముసురుచుండెను. వారిమొగములు కళదప్పినవి.

శోకాతురత తగ్గగనే లక్ష్మమ్మకు కుమార్తె వివాహపు చింతపట్టెను. కొంతమంది యీ సంవత్సరమున కాపుమని సలహానిచ్చిరి. ఇన్ని యేర్పాట్లు చేసికొనినతరువాత నిప్పుడే చేయకున్న మఱు సంవత్సరము చేయుశక్తియే యుండదు. వివాహముచేసివేయుటయే యుక్తము. కట్నములు కానుకలు లేవుగదా పెండ్లివారిమర్యాదలకు తగినయేర్పాట్లన్నియు జరుగనే జరిగినవి. ఆలసించిన కొలఁది హానియే యగును. అందుచే రామకృష్ణయ్యగారికి దుఃఖవార్తతోపాటు పెండ్లివిషయము కూడ కబురంపఁబడెను. లక్ష్మమ్మ స్వయముగ నొకజాబు

వ్రాసెను.— "ఈ యనాథను రక్షించుభారము మీదింది. ఈ యాటపడుచు నాదరించుటకు మీరే సమర్థులు. నారేమేమో చేయుదలంచిరి. ఈశ్వరేచ్ఛ వేఱుగానుండెను. పిల్లమీది మాగౌరవాగౌరవములు మీ చేతనున్నవి పెండ్లివారికి తగు రీతి మర్యాదచేయుట నా మహాభాగ్యమని తలంతును. కాని యేవేళలోనైన జరిగినచో నాయనాథస్థితిని గుర్తించి మన్నింపుడు. ఈ నిస్సహాయను లోకనిందవలన కాపాడెదరని విశ్వసించుచున్నాను"...

లక్ష్మన్నజాబు తపాలాద్వారా పంపలేదు. పురోహితుని పిలిపించి, వినయముగ నాజాబు స్వయముగ రామకృష్ణయ్యగారికిచ్చి పెండ్లికి వీలైనంత తక్కువమంది రావలయునని తనప్రార్థనగా తెల్పుడనెను. ఎంతో మందివచ్చిన నిచట తగు రీతి మర్యాదలు చేయువారేరి? కొండిభొట్లు సందేశముతో మూడవ నాటికి విజయవాడ చేరెను.

సాయంసమయము. రామకృష్ణయ్య ముందు వసారాలో పడక కుర్చీపై సంగవస్త్రము ధరించి ధరింపక కిళ్లీ నమలుచు చుట్ట కాల్చుకొను చుండెను. దీర్ఘకాయుడు, నల్లని స్థూలదేహము యముధర్మరాజును జ్ఞప్తికి దెచ్చుచుండెను. ఆపాదమస్తక మొక్కటే రంగు-నలుపు. పై మొగ మెక్కడి వఱకో శిరోభాగ మెక్కడనుండి ప్రారంభమో తెలియనంత నల్లని మొగము. ఆయనను కదలుచున్న రాక్షసిబొగ్గు ముద్ద యనవచ్చును. ఆయనకు సూర్యాతప బాధ మెండు ఘర్మబిందువులు కాలువలై పాఱుచుండెను. ఇద్దరు సేవకులు దరి

కొంక ప్రక్కను నిలిచి విసరుచునే యుండిరి. ఆయన యాబ్కారీ శాఖయందొక యున్నతోద్యోగి. నెల కైదువందల రూప్యముల వేతనము. కల్లు పాటగాండ్రయొద్ద గట్టిగ లంచ మూలు గుంజుచుండెను. నాకు కల్లువేర నీళ్ళిమ్మనను సరియే. ఇరువది నాలుగుగంటలు దుకాణములు తెరచియుంచినను సరే. తన ముడుపు చెల్లించినచో నాయన కేయభ్యంతరము లేదు. చట్టమంతయు నాయన చిత్తమునబట్టి యుండును. వెన్నెల రాత్రి యాతని జూచువారు భయముతో గంపించిపోవుదురు. స్త్రీలు, పిల్లలేకాదు. పురుషులైన నంతియే. వెన్నెల రాత్రి యనుటకు కారణము చీకటిరాత్రి యాతండు కన్పింపకుండు టయే. నలుపు నలుపులో కలసి పోవుచుండెను. పిప్పిగల తురుష్కుడైదుసార్లు నమాజుచేసి నట్లాతండు రోజు కైదుసార్లు సారాయమును సేవించును. ఉచితముగ దొరకునపుడెన్ని సార్లు త్రాగిననేమి! తానే పైయుద్యోగికూడ, ఆదేశించు వారు లేరు దాహమువేసి నప్పుడెల్ల త్రాగుచునేయుండును. అందుచే మొగము కందగడ్డపలె నెఱ్ఱవారి యుండును. కొన్నిరంగుల సమ్మేళనము ముచ్చటగా నుండునట్లు మఱికొన్ని రంగుల కలయిక భయంకరముగ నుండును. ఎఱుపుతో గూడిన నలుపు మఱియు మిక్కిలి భయంకరము.

పురోహితుని చూచుటయే తడవుగ రామకృష్ణయ్య కుర్చీనుండి లేచెను. ఒహో! తమరా! దయచేయుడు. దయ చేయుడు. అరే, ఎవరురా! అక్కడ. యొవ్వడును లేడే మిరా! రాముడూ, భీముడూ వీరయ్యా. వెంకయ్యా...

అందఱును చచ్చిపోయి నారేమిటిరా! ఒకే రాముడూ, భీముడూ.........వీరయ్యా.........వెంకయ్యా...... ఎవడును పలుకడు. అందఱును చచ్చిరి. లెక్కకుపదియుంది నౌకర్లు. అవసరమునకొక్కడుకూడ నగుపడడు. ఎక్కడకు పోయెదరో; ఏమో? వీరికి వచ్చినుక్కి వేయుడు.

రామకృష్ణయ్యపేర్లనన్నింటిని నొక్కసారే ఏకరువుపెట్టినగాని తనకువినరు వారినిమాత్రమువోయి కుర్చీతెమ్మని చెప్పిన పాపమునపో లేదు. నాలుగైదునిమిషములకొకడు దగ్గుకొనుచు వచ్చి "అయ్యా! ఈనౌకరి నేనుచేయలేను. ఎన్నాళ్ళని యప్పుతెచ్చుకొనితినగలను ఎన్నాళ్ళని, యొవరిత్తు" రనెను.

రామకృష్ణయ్య:—వాగక పోయి కుర్చీతెమ్మ పని చెప్పుటయే తడవుగ నేప్పులు, మొత్తుకోళ్ళు ప్రారంభింతురు.

అయ్యా! శాస్త్రిలుగారూ! అచ్చుటనదరు కుశలమా!

కొండిభొట్లు:—ఏమికుశలము బాబూ! ఇల్లువల్లకాడైపోయి నది. ఇంకేమికుశలము

ఇంతలోనౌకరు విఱిగినజాజికాయ చెక్కలపెట్టెతెచ్చి బాబూ! కుర్చీలు బల్లలు నేను మోయలేనని యెదుటపెట్టి పోయెను. అది విఱుగదుగదాయని భయమందుచు కొండిభొట్లు పెట్టెపై నాసీనుఁడై లక్ష్మమ్మజాబు నాయన కందిచ్చెను

రామ:—ఇప్పుడింకేమి కాఁగలదు? ఇంతకంటె చెడునదే ముండును? అనంతరామయ్యగారు నాపూర్వస్నేహి, తుఁడు. మానవుఁడు కాఁడు. దేవత. ఏమిహృదయము? ఏమియౌదార్యము! (కన్నులొత్తుకొనుచు) నాకుడి

చేయి విడిచినట్లైనది నమ్ముడు సమస్తకుంటుంబము. నాకు జగముశూన్యమైపోయినట్లున్నది. ఈకబురు విననప్పటి నుండి మనసు లోనికిపోదు. అయినమానవమే కంటి యెదుట ప్రత్యక్షమగును ఎంగిలిపడిమాత్రము లేచు చున్నాను. ఏపనికిని మనస్సుపాల్పడదు. సోదరమర ణముకూడ నింతదుఃఖదాయకము కాదు. నిజముగా నాయనయొక్క యనర్ఘరత్నము.

గోండి:—బాబూ! కట్నమునకు ఘనుడు మహానీ పెద్దమనుష్యుడే లేకుండపోయెను.

రామ:—నేనంతయు నెఱుగుదును. అట్టిమనుష్యులు లక్ష కొక్కరుండురనుగదే. నేనెంతగినంతగా నాయన నోరు తెఱుంగను. రెండుమూఁడుసార్లు చూచుటఁదక్క నే మాయనభక్తుడనై తిరిగి ఇటు నాజన్మమంత యిట్లే యుండఁగలను నాహృదయము క్షోభించుచున్నదని ఆ గారితో చెప్పెను.

గోండి:—మాకును తమనుండి యుదేశాశింపిరి. తమను బోలు సజ్జనులఁజూడఁబోము. లేకున్న నీరోజులలో కట్నము లేక పెండ్లి చేసికొను వారెవరు?

రామ:—అయ్యా! యిట్టి పెద్దమనుష్యులతో కట్నములు మాట్లాడుదుమా! వారితో సంబంధమే లక్షరూప్యములపాటిది. నాకదే వెయ్యివేలు. ఆహా యెంత యుదారహృదయము! ఎన్నఁడైన డబ్బును లక్ష్య

పెట్టుచూ! ఈకట్నములదురాచారము వారి సగరి
కము. నామాటరయే సాగుచో కట్నములనిచ్చువారిని
పుచ్చుకొనువారిని బ్రేల్చివేయుదును. నా కఠినశిక్ష
మైననుసరియే. ఇది పెండ్లియా, పిల్లనమ్ముకొను
టయా? పిల్లనిసి పెండ్లికి చేయువిడిచి ఖర్చుపెట్టుకోర్కె
యున్న స్త్రీయాధనము వెచ్చించుకొనుటకు. ఏకనాత్య
దాతనో పీడించుటేమిప్రశ్న? ఇంతకన్న బుద్ధిహీనత
వేఱు లేదు.

కొండి:—ధన్యాత్ములు బాబూ! భగవదనుగ్రహముపలన
మీకు సద్బుద్ధిలభించినది. ఇదిఒక సదాచారఫలితము.
వివాహముహూర్తము మాత్రమిదే యుంచుమనిరి.
మిగిలిన విషయములన్నియు జాగునందు విచరింపబడి
నవి. ఇక మీ దయయున్న యుద్ధరించబడుట.
పెండ్లికివచ్చు పెద్దలను గౌరవించుట మావిధి. కాని
ప్లీడరుగారు లేరు. పరిస్థితులన్నియు తారుమారైనవి.
చనిపోయిన మిత్రుని ప్రతిష్ఠకు భంగము రాకుండ
కాపాడుభారము మీయది.

రామ:—కన్నులుమూసికొని యోచనము సేపాలోచించెను.
ఇంతకు నాలక్ష్మి మాయింటికివచ్చుగీత లేదు. ఈశ్వ
రేచ్ఛ యన్యథాగానున్న నింతటిపని యగునా? ఆశ
లన్నియు వమ్మైపోయినవి. శుభముహూర్తము సమీ
పించుచున్నకొలది నుప్పొంగుచుంటిని. ఇంత దుర
దృష్టపుదినములు సంప్రాప్తించునని భావించియుండ

మున్నంత ప్రేమ నాకు లేదు. కాని భగవదిచ్ఛకు వ్యతిరిక్తముగ నెట్లు సంచరింపఁగలను? నావశమా- ఈ యకాల మరణము విధి సూచితమగు నశుభశకునము. ఆగామి కష్టపరంపరలను దెలుపు నశరీరవాణి వివాహము శుభ పదము కాఁజాలదని విధి స్పష్టముగ చెప్పివైచెను. కార్య ప్రారంభమే యిట్లుండ కార్యము శుభాంతమగు ననుకొనుటయెట్లు? తెలిసి తెలిసి గుండమున నుఱుకుదుమా? నాకీయాజ్ఞానుసరణమునకు నేను సిద్ధమేగాని పరిణామము శుభంకరము కాఁజాలదని యక్కగారికి నచ్చచెప్పుఁడు స్వార్థవశుఁడన్న నాపవాదము మిత్రుని కింత ద్రోహమాచరింపఁజాలను.

ఈ తర్కము పురోహితుని నిరుత్తరుని జేసెను. ఈ బాణమున కెదురు బాణమాతని యొద్ద లేకుండెను. తనచేతితో తననే కొట్టించినట్లయ్యెను. ఆలోచించుకొని సమాధానమీయఁబోవు నంతలోనే యాయన మరణించిన కర్తలను పేరు పేరున పిలువ సాగెను. రాముఁడూ.....భీముఁడూ...... వీరయ్యా..... పేరయ్యా.....ఎవరును పలుకరు, అందఱును చచ్చిపోయిరి. శాస్త్రులుగారికి పళ్ళే కావలెనో పాలే కావలెనో చూచు వారొక్కరును లేరు. ఎవరికెంతని చెప్పఁగలను. మట్టిబుఱ్ఱలు పొరుగూరి పెద్దమనుష్యుఁ డెంతదూరము నుండి యలసిసొలసి వచ్చెనో యెవరికిని పట్టదు. పళ్ళు తీసికొని రారా! బాబూ! మీకు పానకము చేయింతునా? ఫలహారము తెప్పింతునా? మిఠాయి తెమ్మందునా?

కొండిభట్లుగారికి మిఠాయియున్న ప్రాణసమమే

తద్విషయమున నాయన యంటుసొంటన్న నంతగాపాటింపఁడు. ఘృతపక్వములన్నియు పవిత్రములని వారిసిద్ధాంతము. పానకము వారికెట్టు రుచింపదు. కాని పాయసము, జిలేబి, లడ్డులన్న తగని ప్రీతి. సిటికో పొట్టనింపుకొనుట వారికి నియమవిరుద్ధము సందేహించుచు "పానకము నాకలవాటులేదు. మిఠాయి తిందు" ననెను.

రాము:—మీరు ఫలాహారులుగదా?

కొండి:—నాకంతగ పట్టింపులేదు.

రాము:—అవునంతియే. అంటుసొంటు లాడంబరములు మాత్రమే. నేనన్నియును పాటింపను. అరే, ఎవఁడును రాలేదే! ఓరీ రాముఁడూ..... భీముఁడూ...... ఎవఁడును లేఁడా?

ఇట్లనుచుండగ నాముసలివాఁడే వచ్చెను. అయ్యా నాలెక్క తేల్చివేయుఁడు. ఈనౌకరీ నేనుచేయలేను. ఎంతని పరుగెత్తగలను నాకాళ్ళు పగులుచున్నవి.

రాము:—పని చేసినను లేకున్నను లెక్కమాత్రము కావలెను. రోజంతయు దగ్గుచు ముక్కుచునుందువు. లెక్కమాత్ర మెప్పటికప్పుడే చూచుచుండవలెను. బజారుకుపోయి యొక అణా మిఠాయి తెమ్ము. పరుగెత్తుకొనిరమ్ము.

నౌకరు నాజ్ఞాపించి లోనికేగి రామకృష్ణయ్య భార్యతో పురోహితబ్రాహ్మణుఁడు వచ్చెను. ఇదిగో కమ్మ చదువుకొమ్మనెను.

శబ్దమును కరుణరసార్ద్రమైయుండెను. ప్రత్యుత్తరమునుండియు దైన్యము ప్రవహించుచుండెను. రాధమ్మ కాఠిన్యము పాషాణకాఠిన్యము కాదు. లాక్షాకర్కశత్వము మాత్రమే మొదటివేడికే కరగిపోయినది. లక్ష్మమ్మ కరుణగాధ యామెహృదయమును ద్రవింపఁజేసెను. గద్గదస్వరముతో "ఇంకను నా బ్రాహ్మణుఁడున్నాఁడు గదా" యనెను.

రామకృష్ణయ్య భార్య కన్నెరుచూచి సిగ్గుపడుచుండెను. ఈమెకీజాబు నేలయిచ్చితినాయని పరిపరివిధములఁ గుందుచుండెను. చూపవలసిన యవసరము మాత్రమేమి కలదు? ఇంత పెద్దతప్పిదమేకఁడెవ్వఁడు నాచరించియుండలేదు. సందర్భముగా — ఆ! ఉండియేయుండును. నేనుమాత్రమేమి వెళ్ళుమనరేమో చెప్పితినఁటెను. రాధమ్మ కిటికీనుండి తొంగిచూచెను. కొందఱుభోట్లు కొంగజపముచేయుచు బజారువంక నిర్దేకధ్యానముగఁ జూచుచుండెను. ఉపాయమేమాయని యోచించుకొనుచుండెను. అనామితాయి వారి యాశలకింతకుమున్నే నీళ్ళు తోడెను. దానికితోడు పైటలుంగి తడపువేసియుండుట దుస్సహమయ్యెను. వానిజూచి రాధమ్మ ఆ! ఆ! ఉన్నారు. పోయి పిల్లను చేసికొందురని చెప్పుడు పాపమాయిల్లాలు నట్టేటనున్నది.

రామ :— శివప్పుడప్పుడు పిల్లలకన్న హీనముగా మాట్లాడుచుందువు. ఇప్పుడేకదా వారితో సంబంధము వలదని చెప్పివచ్చితిని. ఎంతో పీకి నల్లవలెవచ్చెను. ఇప్పుడీమాట చెప్పిన నేమనునో సుంత యోచింపుము. ఇది

వివాహ విషయము కాని కూరగాయల బేరము కాదు. ఇప్పుడొకమాట చెప్పి యింక కొంతసేపటికి మఱొక మాట యనిన పరిహాసనము గును గాని పెద్దమనుష్యుని తరహా కాదు.

రాధమ్మ :—సరే. మీరు మీనోటనుండి చెప్పలేకున్న బ్రాహ్మణుని నాయొద్దకుఁ బంపుఁడు. మీ మాట పోకుండునట్లును నామాట జెల్లునట్లును జెప్పెదను. ఇట్లయిన మీ కే యభ్యంతరము లేదుగదా.

రామ :—నీవుతప్ప లోకమంతయు వెఱ్ఱిదని యనుకొందువు. నీవు చెప్పినను నేను చెప్పినను మాట యొక్కటే అయిన నిర్ణయమే మోయయినది. దానికి తిరుగుండ రాదు. నేనాపిల్లను జేసికొనకని నివేకదా మాటిమాటి కనుచుంటివి. నీవలననే నేనుమాట పోఁగొట్టుకొనవలసి వచ్చెను. నీవిప్పుడు క్రొత్తపాఠము వల్లింప మొదలిడి తివి. ఇది నన్నడకత్తెరలో నొక్కుట సుమా! నాకు మాత్రము గౌరవప్రతిష్ఠలు లేవనుకొంటివా?

రాధ :—పాపమామె స్థితి యింతదుర్భరముగ నుండెనని నా కేమి తెలియును? భర్త యాస్తి నంతను దాచిపెట్టి కపటనాటక మాడుచున్నదని మీరేగదా చెప్పితిరి. అంతగడుసు మానిసి యామె మాత్రమేయని గదా యంటిరి. నేనంతయు నిజమనుకొంటిని. అయినను మేలు చేసి కీడుచేయ జంకవలయును గాని కీడుచేసి మేలుచేయఁ దలపెట్టుట బాధాకరము కాదుగదా. మీ రానన్న

దానికి నేను కాదనవలసివచ్చినచో చిక్కుగా నుండెడిది. మొదట కాదని యిప్పుడౌననుటలో మనకే గౌరవము లభించును.

రామ:— నీకు గౌరవముగనున్న దేమో. అయినను అప్పుడు నమ్మినదాన విప్పుడేల నామాట అసత్యమని భావించితివి? ఈజాబు చూచితేనా? సీవెంతవిచ్చిదానవో లోకమంతయు నంతియే యనుకొందువు.

రాధ:— ఈజాబుమాత్రము నటనకాదు. నటనయే యగుచో మనస్సునాటను. కృత్రిమతదాగునా?

రామ:— అసలుమాటకన్న నబద్ధమే యెక్కువుగ మనస్సున నాటును. ఈకథలు నవలలు చదివి చదివి యెద్దుచుందువుగదా. వీరందఱు నిజములే వ్రాయుచుందు రనుకొంటివా? అంతయు నబద్ధమే. ఇదొకచాతుర్యము

రాధమ్మ:— ఓహో! మీతోగూడ లౌక్యమేనా? అమ్మపుట్టినిల్లు మేనమామకెఱుకడనా? మీమాటలో నొక్కొన్న నిముషములో మథ్యపుచితినని తృప్తినందెదరుగాబోలు. నాకు మీప్రత్యణువును తెలియును. ఈ నేంము నానాత్రినిరుద్ధి తప్పుకొనజూచుచుండిరిపాపము. కపటము విడిచి నిజముపలుకుడు. ప్లీడరుగారు బ్రతికియున్నపుడు కట్నమడుగకయే వదివదునైదువేలు లభించునని యౌదార్యము జూపితిరి. నేడాయాశలు వృథాయైనవి. కాగా కల్లబొల్లిమాటలతో తప్పుకొన

జూచుచుంటిరి. నిజమా ? కాదా ? ఇదియేనా పెద్ద మనుష్యనిరతి ? ఇంతకన్న కొంచెపుబుద్ధి మరేముండును? ఈనేరమంతయు మీాదే. నేనావివాహము జోలికిరాను. మీాయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు. కపటనాటకమన్న నాకు తగనిమంట. మంచిగాని చెడుగాని చేయఁదలపెట్టినపు బహిరంగముగఁ జేయవలెను. చెప్పునదొకటి చేయునదొకటియైన క్షుద్రతను దెలుపును: ఆపిల్లను చేసికొందమా వలదా యిప్పుడైన తేల్చి చెప్పుఁడు.

రామ:—నేను కపటిని. క్షుద్రుఁడను. విశ్వాసఘాతుకుఁడనైనప్పుడు నాతో సంప్రదింపనేల? అహా! యేమిసీవరేంగితజ్ఞానము! నీ తెలివినిజెప్పి మఱొకరిది చెప్పవలె !

రాధమ్మ:—ఈమాటలకేమి ? ఇప్పటికైన లోనిభావము స్పష్టముగఁ జెప్పుము. నేను మీా యాంతర్యమును వెల్లడించితినా లేదా !

రామ:—అబ్బో! పురుషులయాంతర్యమెఱుంగు స్త్రీలు లేరని నేననుగాని వారు వేఱు. ఇంతవఱకును స్త్రీలుసూక్ష్మగ్రాహులనుకొనుచుంటిని. నేటికాభ్రమతొలంగినది. స్త్రీబుద్ధినిగూర్చి శాస్త్రకారులు వచించినమాట విశ్వసింపక తప్పదయ్యెను.

రాధ:—ఒక్కరవ్వపోయి యద్దమున మొగమును జూచికొని రారాదా ! సిగ్గుచే నెంతచిన్నవోయినదో.

రామ:—ఏమి అంతగా చిన్నవోయినదా ?

రాధమ్మ:—దొంగతనము బైటపడిన పిమ్మట పెద్దమనుష్యుడు చిన్నవాడాయెనంత.

రామ:—సరే. నేను చిన్నపోతినేయనుకొనుము. ఆసంబాధము చేసికొనుట మాత్రము వట్టిది.

రాధ:—మీయిష్టము వచ్చినచోట చేసికొనుడు. నాదేమి పోవును? ఒకసారి చలపతి నడిగి చూడరాదా?

రామ:—సరే వానియిష్టము ప్రకారము చేయుదను.

రాధ:—ముందుగా మాట నందీయకుడు.

రామ:—అబ్బే, వానివంకనైన చూడను.

సరిగా సమయమునకు చలపతి వచ్చెను. అంత యందమగు పుష్టిగల యువకులు సాధారణముగ విద్యాలయములందు కానరారు. అచ్చముగా తల్లిపోలిక. అదేవచ్చని రంగు. అదే కనుముక్కు తీరు. ఎఱ్ఱని గులాబులవంటి పెదవులు విశాలమైన నుదురు, పెద్దకన్నులు, ఒడ్డుపొడుగు లందాతడు తండ్రిని పోలి యుండెను. కోటు, దొరటోపీ బూట్లు అతనికి శోభకరముగ నుండెను. చేతిలో హాకీ కఱ్ఱయుండెను నడకలో యౌవన గర్వ ముట్టిపడుచుండె. కన్నుల నాత్మగౌరవము తేజరిల్లుచుండెను.

రాధమ్మ:—నేడు చాల నాలస్యమైనదే- చూచితివా. మీయత్తవారి యింటినుండి జాబు వచ్చినది. ఇదుగో! మీయత్తగారు వ్రాసినది. ఆపిల్లను చేసికొందువో లేదో స్పష్టముగ చెప్పివేయుము

చలపతి.—పెండ్లి అయితే చేసికొనవలెను. కాని నేను చేసికొనను.

రాధ :—ఎందుకని?

చలపతి :—పుష్కలముగ ధనము లభించు పెండ్లి యెట్లైన జూచి చేయరాదా? కోసినమొక లక్ష రూప్యములైన గిట్టకున్న నేమి ప్రయోజనము? ఇప్పుడక్కడ నేమున్నది? ప్లీడరుగారు లేనేలేరు. ఆముసలమ్మయొద్ద నేముండును?

రాధ—నీకిట్లు మాటలాడుటకు సిగ్గువేయదా!

చలపతి :—సిగ్గుపడుట కిందేమి దోషము కలదు? రూపాయ లెవరికిచేదు? లక్షరూపాయలు నేను లక్షజన్మలకైనసంపాదింపగలనా? ఈసంవత్సరము భగవదనుగ్రహామునను త్తీర్ణుడనైనచో నింక నైదువత్సరములకుగాని చిల్లిగవ్వ కన్పింపదుకదా. అప్పుడైనను నెలకే యేబదియో వందో సంపాదింతునేమో. రెండుమూడువందలు సంపాదింపగలుగునప్పటికి ముప్పాతిక జీవితము ముగిసి పోవును. డబ్బుకూడ పెట్టునవకాశమేడ? ఆనందానుభవము లేక జన్మించిన ప్రయోజనమేమి! డబ్బులేక యానందములేదుగదా. ఏధనికుని కుమార్తెనో చేసికొన్న కష్టములు తీరిపోవును. నాకెంతో యక్కఱ లేదు. ఒక్కలక్షరూపాయలు మాత్రము చాలును. లేక యీమాత్రమాస్తిగల వితంతువు కూతురైనను సరే. ఆమె యేకైకపుత్రికయై యుండవలెను జుమా!

రాధమ్మ :—పిల్ల యెట్టిదైనను సరియేనా?

చలపతి :—ఆడబ్బన్నిలోపములను తీర్చివేయును. ఆమె నన్ను తిట్టికొసినను సరే. పాడి గొడ్డుతన్నులెవరు లెక్క

చేసెదరు ? తండ్రి సంతోషపూర్వకముగా "మాకు వారన్న సానుభూతి లేకపోలేదు. భగవంతుడు వారిని పవిత్రముగ జేసినందులకు మేమెంతయో విచారమందెదము. కాని కార్యనిర్ణయసమయమున కేవలము హృదయమునకేగాక బుద్ధికుసైతము పని చెప్పవలెను. మనమెంత బీదవారమైనను ఇంకొకచోట్ల సచో వైభవముగ బెండ్లిజరుగును. అచట తినదిండికి గతిలేదు. ఆ! లోకులు నవ్వెదరు ! నవ్వినవేమాయె అనుభవించునది వారా మనమా ?

రాధమ్మ:—తండ్రికొమరులిరువురు నొక్కతానులోని గుడ్డలే. ఆ యనాధగొంతుకోయుట కిరువురును పెద్దమనుష్యులే.

చలపతి :—లేనివారు లేనివారితోనే సంబంధము చేసికొన వలెను తమహోదాకిమించి మనతో...

రాధమ్మ:—నోరు మూయుము వాగక ఆహా ! ఎంత హోదా గలవాడవు ? లక్షాధికార్లనుమించి డంబములు పలుకు చుంటివే. మూడవవి సరి వేయుటకు మూలమూలల చూచెదరు. నా యెదుటనా డంబములు ? నీయింట నెన్నడైన గుక్కెడు మంచితీర్థమెవ్వడైన పుచ్చు కొనునా ?

రాధమ్మ చిరాలున వంటయింటిలోనికి వెడలిపోయెను. చలపతి నవ్వుచు తనగదిలోనికేగెను. రామకృష్ణయ్య మీసములు దువ్వుకొనుచు ముంగిటిలోనికరిగి పురోహితుని కంతయు

నిర్ణయము చెప్పివేయుదలంచుకొనెను. పోయి చూచు వరకాతఁడక్కడ లేఁడు.

కొండిభొట్లు కొంతతడవు నౌకరురాకకై వేచి యుండెను చివరకు విసిగికూర్చుండ లేకపోయెను ప్రయత్నము చేయునిదే ఫలితము లేదని తలంచెను. అదృష్టముపై నాధారపడి కూర్చున్న వానికి ప్రాణము పోవునని భావించెను. ఇచట తన పప్పులుడుకవని యాతఁడు గ్రహించెను. గుట్టుచప్పుడు కాకుండ లేచి చేతికఱ్ఱతీసికొని నౌకరుపోయిన దిక్కునకు పయనమయ్యెను బజారు కొంచెముదూరముననేయుండెను. పోయి చూచెనుగదా నౌకరు మిఠాయికొట్టుకాణముమీఁదకూర్చుండి చుట్టకాల్చుచుండెను. చూడగనే మర్యాదగా ఏమబ్బీ! ఇంకను తయారుకాలేదా! మీయజమాని "ఏఁడుపని మీఁదఁబోయెనా త్రాగి తందనాలాడుచుండెనా" యని చిందులుత్రొక్కుచున్నాఁడనెను. వచ్చుచునేయుందును. వచ్చుచునేయుందును. ముసలివాఁడు గదాయని నేనంటిని. ఈయనగారితో నెట్లు నిర్వహించుచుంటివో యేమోగాని మఱొకడైనచో......

నౌకరు :—వీరియొద్ద నేనుతప్ప మఱొకరు నిలువలేరు. నిలువబోరు. సంవత్సరమైనది జీతమిచ్చి. ఎవ్వరికిని జీతమియ్యరు. అడిగినగద్దించి కసరికొట్టెదరు. నౌకర్లుభయపడి పారిపోయెదరు. అవిసరుచున్న యిరువురును సర్కారువారి జవానులు, జీతముపుచ్చుకొనుచున్నవారు విధిలేక పడియుందురు బాబూ! నారోజులు

గడచిపోయినవి. మఱిరెండుమూఁడేండ్లలో నాఘటము వెళ్ళిపోవును.

కొండి:—అయిన నీవొక్కఁడవేనా నేవకుఁడవు ? అన్నిపేర్లు పెట్టిపిలిచనే ?

నౌకరు:—వారందఱు నీరెండుమూఁడు నెలలలోవచ్చి వెళ్ళిపోయినవారు. తనుదర్జాచూపించుకొనుటకు వారి పేర్లన్నింటిని వల్లించుచుండురు. బాబూ! ఎక్కడనైన నౌకరీచూపింపుఁడు. మీపేరుచెప్పుకొని హాయిగ జీవింతును.

కొండి:—ఓ. చేసికొనువానికి నౌకరీకొదువ లేదు. వెవకి గాలించినను నౌకర్లుదొరకుటలేదీ రోజులలో పైఁగా నీవు పూర్వపువాఁడవు. అనుభవశాలివి. నీకేమి కొదువ ? ఏమిసెట్టిగారూ, శ్రోత్రపదార్థములేమైన నున్నవా ? అన్నమువండుకొందురా, కూరలువండు కొందురాయని నను చు వారు బలవంతపెట్టిరి. అయ్యో! ఈరాత్రిపూట అవూనలివాని నేమిచంపుదును. పోయి మిఠాయినే తినివత్తునని చెప్పివచ్చితిని ! అయినసరే. నౌకరు నీకు దుకాణమునొద్దనే దొరకునని చెప్పి పంపిరి. ఏమిసెట్టిగారూ ! తాజాసరకేనా ? లడ్లిప్పుడే కట్టుచుంటిరనుకొందును. ఏదీ ఒక యాకుపీసెఁడుతూచి యుండు. దుకాణముపైకివత్తునా ?

అనుచునే కొండిభొట్లు దుకాణముపైకెక్కెను. ఇష్టమువచ్చినదెల్ల మెక్కుచుండెను. మూఁడరవీసెలసరకు

మాయమయ్యెను. ఆహా సెట్టిగారూ ! మీదుకాణమునుగూర్చి విన్నదంతయు అక్షరమైన పొల్లుపోకదే నిజమైనదని పొగడుచునేయుండె. పొగడుచున్నకొలది సెట్టి యిదితినిచూడుఁ డిది తినిచూడుఁడని తూచియిచ్చుచుండెను. ఆహా! బందరుమిఠాయి కంటె వసంతుగానున్నది. జిలేబినుంచిపాకమున వడినది. హైదరాబాదునకూడ నిట్టిహల్వా తినలేదని కొండిభొట్లు లొట్టలు వేయుచుండెను. ఇంతకు నరకునవేమున్నది. చేతిలోవిద్య యుండవలయునుగాని.

సెట్టి:— మఱికొంతపుచ్చుకొనుఁడు బాబూ ! నరకుశ్రేష్ఠమైనది. మఱొకసవాసేరు తూచియిత్తునా ?

కడుపునిట్టినంతతిని యిష్టమువచ్చినట్లు తిరిగి తొమ్మిది గంటలకు కొండిభొట్లు చేరెను. ఇల్లునిశ్శబ్దముగనుండెను. ఒక లాంతరువెలుఁగుచుండెను. అరుగుపై నాతఁడు ప్రక్కవేసికొని పండుకొనెను. ఉదయమున తనయలవాటు ప్రకార మెనిమిది గంటలకు లేచి చూచునరికి రామకృష్ణయ్య పచారు చేయుచుండెను. ఈయన లేచుట చూచి నమస్కరించి బాబూ రాత్రి యెక్కడికి పోయితిరని రామకృష్ణయ్య యడిగెను. ఎంత తడవో మీకొరకై వేచియుంటిమి వంటసామానంతయు సిద్ధముగ నుంచితిమి వేచియుండి యుండి చివరకింట నుంచితిమి. ఇంతకు రాత్రి యేమైన భుజించితిరా?

కొండి :— మిఠాయి దుకాణమునసే కొంచెము తినివచ్చితిని.

రామ :— ఆఁ అన్నము తిన్న తృప్తి యన్యమున లభించునా? ఒకటి రెండురూపాయలు ఖర్చుపెట్టినను పొట్ట నిండదు.

మీరేగా మా రక్షకులు. తిండికైన సొమ్ము మా నుండి పుచ్చుకొని తీరవలెను.

కొండి :—అదుగో! యామూలనున్న దుకాణము నొద్దనే పుచ్చుకొంటిని.

రామ :—ఎంత సొమ్మయ్యెను?

కొండి :—ఎంతయైన నంతయు మీపద్దులోనే వ్రాయించితిని.

రామ :—ఏమేమి పుచ్చుకొంటిరో నాకు చెప్పుడు. మఱొక దానికి కాదు గాని వాడు వచ్చిదొంగ తినినవి తిననివి కలిపి తడిపి మోసము చేయును అంతయు మోసమే.

కొండి :—అరవీసెడు లడ్లు కాగితాలును తీసికొంటిని. శేరు చక్కెర జిలేబి, శేరు హల్వా, శేరు పాలపేణీ...

ఒక యపూర్వ చిత్రము కనినట్లు కన్నులు చించుకొని రామకృష్ణయ్య కొండిభొట్లు వంక చూచెను. నెలమొత్తము మీఁదఁగూడ మూఁడు నాలుగు శేర్ల మిఠాయి తినముగదా. ఈయన యొక్కఁడే నాలుగైదు రూపాయల సరకు నూది పార వేసెనే! ఇంక నొకటి రెండు దినము లీతఁడిచట నుండుచో కొంప గుండమై పోవును. కదువా! కళ్ళేపల్లి చెఱువా! గాబరా పడి లోనికేగి భార్యతో—ఈ బ్రాహ్మణుఁడు రాత్రి యైదు శేర్ల మిఠాయి పొట్టపెట్టుకొనినాఁడు. ఖరాగా నైదు శేర్లనెను. రాధమ్మ విస్మయముతో ఆఁ వట్టిది. ఐదు శేర్లే! మనుష్యుఁడా దున్నపోతా!

రామ :—ఇదు శ్లోకముని తన నోటితో తానే చెప్పుచున్నాడు.
కనీస మాత్రము శ్రోత్రియను తిసియుండకపోడు.

రాధమ్మ :—కడుపులో దయ్యము లేదుగదా!

రామ :— ఇంకను నేనున్నచో పదిశ్లోకములకు తక్కువ గ్రహింపడు.

రాధమ్మ :—అసలు నేడేలయుండవలెను? ఈయవలసిన సమాధానమిచ్చి వెంటనే పంపివేయరాదా? ఒకవేళనుండవలసియేవచ్చుచో మాకు మిఠాయిలు తేరగా రావని చెప్పివేయుము. వంట వండుకొనినా సరేసరి, లేకున్న వచ్చినదారి నడవుమనుము. ఈ తిండిపోతులను మేపుట మాకుచేతగాదు. తేరగాం పోసికొని కూర్చున్నవారెవరైన నున్న వారియొద్ద కేగుమనుము.

కొండిభొట్లు తానే పోదలంచియుండెను. రామకృష్ణయ్య తనలౌక్యము చూపునవసరము లేకపోయెను.

రామ :—శాస్త్రులుగారూ—ఏమి ప్రయాణనన్నాహమే?

కొండి :—అవును బాబూ. ఇంకపోయెదను. తొమ్మిదిగంటల బండి యుండునుకదా!

రామ :—ఆమాత్రము నేటికుండరాదా?

అనుచునే కొంపతీసి యీబ్రాహ్మణుడుండి పోడుగదాయని భయపడి నగముమాటలోనే 'అవును పాపము మీకొఱకక్కడ నెదురుచూచుచుందుర'ని పూర్తిచేసెను.

కొండిబొట్లు :—రెండుమూడు దినములలో నంతయునిగిపోవ పనులేమి కలవులెండు. పైగా నిచట మనసార కృష్ణాస్నానముసైతమాచరింపనెంచియే వచ్చితిని. కాని

నేనంటినని యనుకొనకుఁడు మీకు బ్రాహ్మణులపై శ్రద్ధాభక్తులులేవు. మాయజమానులన్న వారిపేరు చెప్పుకొనిగాని మఱొకరిని తలఁపరాదు. బ్రాహ్మణుని నోటనుండి యెప్పుడేమివచ్చునా, యేమిచేయుదుమా యని యెదురుచూచుచుందురు. ఇంటికేగిననే తమ మహాభాగ్యమని తలంచి యింటివారందరు బాలగోపాలము సేవాశుశ్రూషలు చేయుదురు. మర్యాదలేనిచోట క్షణమాఁగరాదు. బ్రాహ్మణగౌరవము లేనిచోట పాడుబీడైపోవును.

కామ:—మావలన నేయపరాధమును జరిగియుండలేదుకదా!

కొండి:—అపరాధము జరుగలేదా? అపరాధమని యింక దేనినందురు? ఇప్పుడేకదా తమరింటిలోనికరిగి బ్రాహ్మణుఁడు పొట్టవిరుగునట్లు తినెనని వాపోయితిరి. ఖరాగా నైదుశేర్లుతినెనని గోలపెట్టితిరే, తిండివిషయము మీకేమి తెలియును? ఒకసారితినిపించిన గుడ్లువెళ్ళుకొని వచ్చును. ఒక్కొక్కమహానుభావుఁడు బ్రేవుమని త్రేఁపకుండ నలువదిఅరిసెల ఫలహారము చేయును. పందెమువైచి మిఠాయితినుటకై మమ్ము బతిమాలుకొందురు. పదులు పాతికలునిచ్చి సత్కరింతురు. మేము ముష్టిచెంబుపుచ్చుకొని మీగడపత్రొక్కిన చచ్చుబ్రాహ్మణులముకాము. మీఘనమైనపేరు వినివచ్చితినేకాని యిక్కడతిండికే వాచియుండిరని యెఱుంగను. పోనిండు ఎవరి పాపపుణ్యములు వారివి.

రామకృష్ణయ్యకు నోటమాట రాలేదు. మొగము ముడుచుకొని నిలఁబడెను. బ్రతికి బట్టగట్టినది మొదలాతఁడింత తిట్టు పడియెఱుఁగఁడు. ఎన్నో అబద్ధములాడి తప్పించుకొనఁ జూచెను. అయ్యా! మీ విషయము గాదు ఏ విషయమో వచ్చి మాట్లాడుకొనుచుంటినని యేమేమో అనెను. బ్రాహ్మణుని కోపము చల్లారలేదు. ఆతఁడన్నియు సహింపఁగలుగును గాని తన కుక్షినిందను భరింపలేఁడు. స్త్రీలు తమరూపనిందను సహింపఁజాలనట్లు పురుషులు తమయుదరనింద నోర్వఁజాలరు. రామకృష్ణయ్య బ్రతిమాలుకొనుచుండనే కాని కర్మము చాలక యుండి పోఁడుకదా అని భయపడుచునే యుండెను. వాని పిసినారితనము బట్టబయలై పోయెను. ఎంతో దాచివేయ ప్రయత్నించియు విఫలుఁడయ్యెను. ఇంటిలోని కరిగి యెలుగెత్తి యేమి మాట్లాడితినా అని పశ్చాత్తాపపడఁజొచ్చెను. ఈగుమ్మఁడు చెవులనిక్క పొడిచికొని వినెను. ఇపుడు చింతించి ప్రయోజనమేమి? ప్రొద్దున నెవరి మొగము చూచెనో మాపాతకము నెత్తిపడినది. ఈతఁడు కోపములో నింటనుండియేగినా నాగుట్టునంతను బజారునఁబెట్టును. నాలౌక్యమంతయు బట్టబయలగును. ఎట్లైన నీని నోరుకట్టి పంపవలయును.

రామకృష్ణయ్యలోనికేగి రాధమ్మతో ఈగుమ్మఁడు మన మాటలన్నియు వినెను అలిగి వెళ్లుచున్నాఁడు ఇంక మన ప్రతిష మట్టిపాలుగావించుఁ ననెను.

రాధ:—ఆతఁడు ద్వారమునొద్దనుండఁగ నీ వెలిసియు బిగ్గరగ నేల యఱచితిరి?

# చతుర్థ ప్రకరణము



అనంతలక్ష్మమ్మకు కుమార్తెవివాహము విషమసమస్య అయ్యెను. భర్తగతించినపిమ్మట తెలిసివచ్చిన తొలిసంకట మిది. దరిద్రురాలగు వితంతువునకు పెరిగిన పెద్దపిల్ల నెత్తి నుండుటకన్న వేఱువిపత్తు సంభవింపగలదు? పిల్లలువట్టికాళ్ళతో నడచి బడికిపోవుదురు. ఇంటిలోని చాకిరీఅంత తనుతానే చేసి కొనవచ్చును. కలియో గంజియో త్రాగి రోజులు గడపవచ్చును. ఏగుడిసెలోనో కాపురము చేయవచ్చును. కాని యీడువచ్చిన పిల్లకుపెండ్లి చేయుకొనుటెట్లు? ఆమెకు స్వయముగాపోయి రామ కృష్ణయ్యను నడుగవలసిన నాలుగుమాటలు మొగమువీఁద నడిగివత్తమన్నంతకోపమువచ్చెను. మాటతప్పినచో నీవునీఅబ్బ కడుపున పుట్టినవాఁడవుకావందు ననుకొనెను. కొండిభొట్లు ద్వారా యామె వారివిషయములన్నియు వివరముగాఁ దెలిసి కొనియుండెను.

ఈకోపములో ననంతలక్ష్మమ్మ మండిపడుచున్నంతలో విమల పరుగెత్తికొనివచ్చి "అమ్మా! పెండ్లివారెవ్వరువత్తురే! బ్రాహ్మణుఁడువచ్చెనుకాదటే" అనెను.

లక్ష్మమ్మ:—అవును. పెండ్లివారుసిద్ధముగ కూర్చున్నారు.

విమల:—అదే, సూరీడు రెండుమూఁడు రోజులలో వత్తు రన్నాఁడే. నిజమేనా!

లక్ష్మి:—నీకుఁగాదూ చెప్పుట. పెండ్లివారును రారు. గొండ్లి వారును రారు.

విమ:—అందఱియిండ్లకువచ్చు పెండ్లివారు మనయింటికేల రారు ?

లక్ష్మి:—నీయింటికి వచ్చు పెండ్లి వారి యిల్లు కూలిపోయినది.

విమ:—నిజమేనా అమ్మా ! అయిన ఇల్లంతయు తగులఁబడి యుండును. ఎక్కడనుండెదరో పాపము ! అక్క వెళ్లి యెచటనుండును ?

లక్ష్మి:—ఓసి పిచ్చిగొడ్డి ! యిల్లు తగులఁబడలేదే. వారికిపిల్ల యిష్టములేదు.

విమ:—ఎందుచేత ? మొదట చేసికొందుమనిరే ?

లక్ష్మి:—వేలు లక్షలు కావలెనఁట నాయొద్ద పోగుపోసికొని కూర్చుంటినా ?

విమల :—అంత పీనాసివాళ్ళటే ?

లక్ష్మి :—పీనాసివాళ్ళు కాక మఱేమి ? కటికు కసాయివారు. దగాకోరులు.

వి :—అట్టివారియింట అక్క పెండ్లి కాకుండుటే మేలైనది. అక్క యెట్లుండఁగలిగెడిది ? అయిననిది సంతోషింపఁ దగిన విషయమేగదా, నీవు దుఃఖంతువేల ?

లక్ష్మమ్మ కుమార్తెవంక జాలిగాఁ జూచెను ఆమె తెలియని మాటలలో నెంత నిగూఢ సత్యముండెను ? నిజముగ నట్టి యపాత్రుల యింట పెండ్లి జరుగకుండుటయే వాంఛనీయము. అందుకు విచారింపవలసిన యగత్యమావంతయు లేదు

కొన్నివేల రూపాయల యలంకారములున్నవి. కాని యిద్దరు మగపిల్లలెదుగుచున్నారు. వారికి చదువుసంధ్యలు చెప్పించి పెద్దవారినిఁ జేయవలెను. నాలుగైదేండ్లలో రెండవపిల్ల సైతము పెండ్లి యీడునకు వచ్చును. అందుచే నామె కట్నమీయఁ జాలదు. మగపిల్లలేమై పోయెదరు! మాతండ్రియును వాఁడొక డుండెనని వారను కొనవలదా!

కొండిభొట్లు విజయవాడనుండి తిరిగివచ్చి యిప్పటి కప్పుడే పదునైదుదినములయ్యెను. తిరిగివచ్చిన మరునాటిదినము నుండి వరాన్వేషణ చేయుచునేయుండెను. ప్రశస్తమున మీరే కాదు. మీవంటివారు వేలు లక్షలున్నారని విజయవాడ వారికి చూపింతునని యాతఁడు పలికిపోయెను. లక్ష్మమ్మ రోజులు లెక్కపెట్టుచుండెను. నేఁడు వారికి జాబు వ్రాయవలెనని కలము కాగితములను దీసికొని వచ్చునంతలో నాయన యేతెంచెను.

లక్ష్మమ్మ :— శాస్త్రులుగారూ! దయచేయుఁడు. ఇప్పుడే మీకు జాబు వ్రాయఁబోవుచుంటిని. ఎప్పుడువచ్చితిరి?

కొండిభొట్లు :— వచ్చుటకుదయముననే వచ్చితిని. కాని యొక సెట్టికబురంపఁగా నింతవఱకక్కడ నుండిపోవలసివచ్చెను. మృష్టాన్నము లభించి యెన్నో యోగములై నట్లుండి పోనిమ్ము పట్టు చూడవచ్చునని యేగితిని. అక్కడ నుండి సరాసరి యిటువచ్చితిని. ఐదువందల బ్రాహ్మణ్యమునకు సంతర్పణ జరిగినది.

లక్ష్మమ్మ :— ఏమైనపని నెరవేరినదా! కాళ్ళ త్రిప్పుటయే యయ్యెనా!

కొండి :— పని నెఱవేరదా? ఎక్కడిమాట! ఐదు సంబంధములు చూచివచ్చితిని. అయిదుగురి ఛాయాచిత్రములు తెచ్చితిని. మీకు నచ్చినవాని నెన్నుకొనుఁడు. ఇదుగో! యీ పిల్లవాని తండ్రికి తపాలాశాఖలో నెలకు వంద రూపాయల వేతనము. పిల్లవాడింకను కాలేజిలో చదువుచున్నాఁడు. కాని యుద్యోగమే యాధారము. ఆస్తిపాస్తులులేవు. పిల్లవాఁడు చుఱుకైనవాఁడు. వంశముకూడ మంచిదే. రెండువేలకు సిద్ధపడిన ఖాయము చేసికొనవచ్చును. అడుగుటకు వారు మూఁడువేలడిగిరి.

లక్ష్మ:—పిల్లవాని కన్నదమ్ములున్నారా?

కొండి:— లేరు. ముగ్గురుచెల్లెండ్రుకలరు. ముగ్గురును పెండ్లికానివారే. తల్లిబ్రతికియున్నది. ఇఁక రెండవవానిఁ జూడుఁడు. ఇతనికి రైల్వేశాఖయందు నెలకేఁబదిరూపాయల వేతనము. తల్లిదండ్రులులేరు. మంచి రూపవంతుఁడు, బలశాలి, గుణవంతుఁడు. కాని వంశము మాత్రమంత శ్రేష్ఠమైనదికాదు. తల్లి ముంగలిదని కొంద ఱనిరి. కాదు గొల్లదని కొందఱనిరి. తండ్రియేదో జమీందారీలో నుద్యోగముచేసెను. కొంచమాస్తి కలదు గాని దానిపై వెయ్యిరూపాయల అప్పు కలదు. అక్కడ నిచ్చిపుచ్చుకొను మాటలేదు. వయసున్నను మూరిరువది సంవత్సరములు.

లక్ష్మి:—వంశమున మచ్చలేకున్న భాగుగా నుండవలెను. చూచుచు చూచుచు సంకరున కియ్యలేను.

గొండి:—మూడవవానిఁ జూడుఁడు. ఇతఁడొక భూస్వామి కుమారుఁడు. సంవత్సరమునకు సుమారు వెయ్యిరూపాయలువచ్చును. సొంతసేద్యము. పిల్లవాఁడంత విద్యావంతుఁడు కాఁడు. కాని వ్యవహర్త. రెండవపెండ్లి. భార్యపోయి రెండుసంవత్సరములైనది. సంతానము లేదు. కాని కుటుంబము మోటు. అంట్లు, చెంబులు, దంపుళ్ళున్నియు నింటనే.

లక్ష్మి:—కట్నము కావలెనా ?

గొండి:—ఆమాటఅడుగకుఁడు. నాలుగువేలపాట. సరే, ఈ నాల్గవవానిఁజూడుఁడు. ఇతఁడువకీలు వయసు సుమారు ముప్పదియైదు సంవత్సరములు. రాబడినెలకు నాలుగైదు వందలు. ప్రథమభార్య గతించినది. ముగ్గురు మగపిల్లలు. స్వగృహముకలదు. ఆస్తిపాస్తులుకూడకలవు. కట్నముప్రసక్తి యిచట లేదు.

లక్ష్మి:—వంశమెట్టిది ?

గొండి:—మిక్కిలి యుత్తమమైనది ఈనాందారులు. సరే యైదవవాని జూఁడుఁడు. తండ్రికి ముద్రణశాలయున్నది. పిల్లవాఁడు బి. యే. వఱకు చదివినను ముద్రణశాలయందే పనిచేయుచున్నాఁడు. వయస్సు పదునెన్మిది వత్సరములు. వ్యాపారమేగాని యాస్తిలేదు. అప్పులు మాత్రము లేవు వంశమంత మంచిదియుకాదు. చెడ్డది

యునుగాదు. పిల్లవాఁడుమాత్ర మందగాఁడు. గుణవంతుఁడు. వెయ్యిరూపాయలకు తక్కువలో రాఁడు. అనుగుటకై వారు మూఁడు వేలడుగుచున్నారు. సరే యిఁక మీ యభిప్రాయము తెలుపుఁడు.

లక్ష్మి:—అందఱిలోను మీకెవరు నచ్చిరి?

కొండి:—నాకిద్దఱిపై చూపుచున్నది. రైల్వేలో పనిచేయు వాఁడును, ముద్రణశాలవాఁడును.

లక్ష్మి:—మొదటివాని వంశము మంచిది కాదంటిరిగదా?

కొండి:—అవును ఆదోషమున్నది పోనీ ముద్రణశాల వానినే చూఁడుము.

లక్ష్మి:—వెయ్యిరూపాయల కిట్లు మొక్కడ తోడితే గలము? ఇంకను అధికము కోరుదురేమో? మీరు మాగతి చూచుచుంటిరిగదా! తిండి జరుగుట కష్టమగుచున్నది. భూస్వామికి నాలుగువేలు కావలెను. తపాలా శాఖ వానికి రెండువేలు. వారిని విడిచిపుచ్చుఁడు. ఇక ప్లీడరుగారు కలరు. ముప్పదియైదు వత్సరము లేమంత మించిన వయస్సు? వీరినే యేల స్థిరపఱుచు కొనరాదు?

కొండి:—మీరు బాగుగ యోచించికొనుఁడు. నేను మీ యిష్టప్రకారము చేయువాఁడను. మీకు నచ్చినచోట పోయి స్థిరపఱిచెదను. వెయ్యిరూపాయలకు లోభింపకుఁడు. ఈముద్రణశాలవాఁడు రత్నమువంటి వాఁడు. పిల్ల సుఖపడును. ఈమె యెంత అందగత్తెయో, గుణవంతురాలో యాతఁడు అంతియే.

లక్ష్మి:—నాకుమాత్ర మది యిష్టములేదా? రూపాయ లెట్లు వచ్చును? ఇచ్చుదాత కలఁడేని చూపింపుఁడు. ఇంట బడి తినినవారు కాలికి బుద్ధిచెప్పిరి. ఇప్పుడు మొగమైన చూపరు. మే మేమో వెడలఁ గొట్టితిమని పైఁగా విరుచుకొని పడెదరు. వశముగాని దానికిఁ దూగి ప్రయోజన మేమి? కన్నకడు పెవరికి ప్రీతి కాదు. పిల్లలు సుఖపడ వలెనని యెవ రనుకొనరు? చేతగాని దానికేమి చేయుదుము? దయయుంచి ప్లీడరు సంబంధము నే స్థిరపఱుపుఁడు. వయసు కొంచమధికమే. కాని చావుబ్రతుకులు దైవాధీనములు. ముప్పదియైదేండ్లవాఁడు ముసలివాఁడు కాఁడు. దానికి సుఖమే వ్రాసిపెట్టియుండిన నెచటికేగిన నచటనే సుఖపడును. దుఃఖపడవలసివచ్చుచో మనము తప్పింపలేము. మా శ్యామలకు పిల్లలన్నప్రేమ. ఆయనపిల్లలను తన పిల్లలనుకొనును. ముహూర్తము పెట్టింపుఁడు.

---

## పంచమ ప్రకరణము

శ్యామల వివాహమై యత్తింటికివచ్చెను. భర్తపేరు శివరావు. గుండ్రని చామనచాయ మొగము. వయసు నలువదికి మించదు, కాని ప్లీడరువృత్తితో తలవెండ్రుకలు నెరసినవి.

ఆయనకు వ్యాయామము చేయు నవకాశము లేకుండెను. బయటికి షికారుపోవు వీలుకూడ లేకుండుటచే కొలదిగ బొజ్జ యేర్పడెను. నిగ్రహము నిండుగనున్నను ప్రతిదినమేదో యస్వస్థతయే. మందాగ్ని యిల్లుకట్టుకొని కాపురముచేయుచుండెను. అక్కడికిని తూచితూచి తినుచుండెడివాడు. ఆయనకు ముగ్గురు కుమారులు. పెద్దవాడు భార్గవునకు పదునాలేండ్లు. రెండవవాడగు కేశవునకు పండ్రెండు. కడగొట్టు మాధవునకేడేండ్లు ముగ్గురును నింగ్లీషు చదువుచుండిరి. ఇంటియందు ప్లీడరుగారి వితంతుసోదరి తప్ప వేఱెవ్వరును లేరు. ఆమెయే గృహయజమానురాలు. పేరు వియ్యమ్మ. వయస్సు యేబదియేండ్లు. అత్తింటివారెవరును లేరు. శాశ్వతముగ నిచటనే యుండును.

శివరావు దాంపత్యవిజ్ఞానమున కుశలుడు. శ్యామలను సంతోషపెట్టుటకై స్వభావసిద్ధములగు తనలోపములను వస్తువాహనములతో తీర్చుకొనజూచెడివాడు. తానుమితవ్యయి యయ్యు శ్యామలకు ప్రతిదినమేదో కానుక గొనిపోవువాడు. సమయమువచ్చినప్పుడు డబ్బును లక్ష్యపెట్టడు. పిల్లలకుకొంచెము పాలే తెప్పించినను శ్యామలకు పండ్లు పాయసములకు కొదువలేదు నిజమైన కేవస్తువు నామెకు లేకపోలేదు. తనజీవితమునందెన్నడు నాతడు వినోదములకేగకున్నను శ్యామలకై యిప్పుడు సినిమాలు, సర్కసులు, నాటకములు చూడబోవుచుండెను. బహుమూల్యమగు తనసమయమున కొంతభాగ మామెతో గలిసి గ్రామఫోను పెట్టుటయందు వెచ్చించుచుండెను.

శ్యామలకు శివరావు పక్క కూర్చుండుటకును, నవ్వుచు మసలుచుండుటకు నేలకో సంకోచము. ఇంతవఱకెట్టివాఁడో కదామెకు తండ్రిదిక్కైయుండుట కారణమైయుండవచ్చును. తండ్రియొద్ద నామె శిరమువంచి శరీరము కుంచించుకొని తిరుగుచుండెడిది. నేఁడ దేవయున్న వాఁడామెకు భర్తఅయ్యెను ఆభర్త తనకు కారవాన్సుఁడయ్యెనే గాని ప్రేమాస్పదుఁడుగా లేదు. ఆయనను౦చి తప్పించుకొని తిరిగెడిది. చూడఁగనే యుల్లాసమంతయు చల్లఁబడెడిది.

ప్లీడరుగారికి తన దాంపత్యవిజ్ఞానము యువతులయెదుట ప్రేమసంభాషణము జరుపవలెననియు మనస్సువిప్పి మాట్లాడవలెననియు బోధించెను ఇదే వశీకరణ మంత్రమని యాతని యూహ. ఆయన తన ప్రేమ ప్రదర్శనమున నేలోపమును రానీయలేదు. కాని శ్యామలకవి యున్న రోఁత జనించెను. ఏయువకుని నోటనో వినినచో తన్ను ప్రేమోన్మత్తను చేయు మాటలాతని నోట ములుకులవలె హృదయమున గ్రుచ్చుకొనుచుండెను. వానిలో రసము లేదు. ఉల్లాసము లేదు ఉన్మాదము లేదు. హృదయము లేదు కేవలము కృత్రిమములు, శుష్కములు, నీరసములు అంతయు శబ్దాడంబరమే. ఆమెకు సుగంధతైలములు నచ్చకపోలేదు. వాహ్యాళులు, వినోదములు, వేషభూషలు నచ్చక పోలేదు. నచ్చనిది శివరావు పక్కను కూర్చుండుట మాత్రమే. ఆమె తన రూపయౌవనముల నాతనికిఁ జూపనిచ్చగింపకుండెను. ఏలయన నాతనికా కన్నులు లేవు. ఆయన తద్రసాస్వాదన యోగ్యుఁడు కాదని

యామెతలంపు: ప్రాభాత సమీరస్పర్శవలనఁగాని ముకుళము వికసింపదు. శ్యామలకా ప్రభాత సమీరమిచట లేదు.

నెల గడువకయే శివరావు శ్యామలను కోశాధికారిణిఁ జేసెను. కచేరినుండి వచ్చి నాఁటి సంపాదనంతను నామెకిచ్చుచుండెను. ఆధనముఁజూచి యామె యుప్పొంగునని యాతని యూహ. శ్యామల యుత్సాహముగ పద్దులు వ్రాయుచుండెను. పైస పైసకును లెక్క చెప్పుచుండెను. ఏనాఁడైన తక్కువ రూప్యములు లభించిన నేఁడేల తగ్గినవని ప్రశ్నించును. కుటుంబ వ్యవహారమంతయు నాతనితో ముచ్చటించెడిది. ఈమాటలకే యాతఁడు తగునని యామె భావన. ఆతనినోటినుండి యే నరసమో వెల్వడిన నామెముఖము చిన్నఁబోవుచుండెను.

శ్యామల యలంకరించుకొని దర్పణమున తన రూపము దర్శించుకొనినప్పుడు హృదయము తీరనికోర్కెలతో నిండి పోయెడిది. హృదయమున నొకజ్వాల ప్రజ్వరిల్లెడిది. ఆయింట నిప్పుపెట్టవలెనని యామెకుఁ దోఁచుచుండెను. తల్లిపై నంతులేని కోపము వచ్చుచుండెను. అన్నిటికన్నమించి పాపము శివరావుపై మంటపుట్టుచుండెను. ఆతని మాటఁ దలఁచిన నామెకు చిరచిర. ఆరితేరిన యాశ్వికునకు తట్టుగుఱ్ఱము దరికి పోవునా? లేనినాఁడు కాలినడకనైన నిచ్ఛగించును. ఆమెస్థితి యీ యాశ్వికునిఁ బోలియుండెను. ఆమె యాకసమున నెగుర దలఁచును. విద్యుద్గమనమున నుల్లాసముగ విహరింప నిశ్చయించును. ముసలిగుఱ్ఱము సకిలింపు లామె సహింపలేదు. పిల్లవాండ్రతో కాలక్షేపము చేయుచో కొంత మానసికశాంతి

లభించియుండెనేదేమో కాని వియ్యమ్మ పిల్లల నామెదరికిఁ బోనీయదు. దయ్యమో భూతమో యున్నట్లు దూర దూరమున నుంచును. ఆమె స్వభావము కడు విచిత్రమైనది. ఆమెకే పని వలన నెప్పుడెట్టి సంతసము కలుగునో యెప్పుడెట్టి కోపము వచ్చునో బ్రహ్మకుకూడ తెలియదు. శ్యామల గదిలోనున్న "నేమి ఘోషా! సంగనాచి మనసిచ్చి మాటాడదనును" ఒకింత పైకివచ్చి మసలిన తొమ్ములుబాదుకొని "సిగ్గు లజ్జయులేవు పరువు మర్యాదలు విడిచిన"దని గోలపెట్టును. ఇఁక నేమి కొన్ని దినములలో నడువీధిని నాట్యము చేయుననును. భర్తయామె చేతికి సొమ్మీయ మొదలిడినదాది వియ్యమ్మచేయు విమర్శల కంతు లేకుండెను. ఇఁక ప్రళయము వచ్చుట కెడము లేదని యామె భావించెను. పిల్లలకు మాటి మాటికి డబ్బు కావలసి యుండెను. తనచేత నున్నంతవఱకు వారిని బుజ్జగించెడిది. ఇప్పుడు సూటిగ శ్యామలయొద్దకు పంప మొదలిడెను. పిల్లలకు ధనాశ కల్పించుట శ్యామలకు గిట్టదు. అప్పుడప్పుడీయనని కోపపడెడిది. వియ్యమ్మ కదేయుదను. వాగ్బాణముల సంధించి యామెను వేధించెడిది. "అవును, నీవు యజమానురాలవైతివి. పిల్లలేల బ్రతికెదరు! తల్లిలేని పిల్లలకు దిక్కెవ్వరు! ఉన్ననాఁడు రూపాయలకొలఁది మిఠాయితిసిరి. ఇపుడు చిల్లిగవ్వకు గతిలేదు." ఏనాఁడైన నడుగఁగనే శ్యామల డబ్బిచ్చునో నామె విమర్శ మఱొక మార్గము పట్టును. "పిల్లలు బ్రతికిననేమి, చచ్చిననేమి! నీదేమి పోయినది. తల్లిలేని పిల్లలకు చిరుతిండ్లు తినఁగూడదని బోధించువారెవరు! కాఁగా పోఁగా నేనొక్కతెను. ఇంతకు

నాకంతమునను కురి వచ్చినది.'' ఇంతమాత్రముతో నాగిన శ్యామల సహింపఁగల్గును. కాని వియ్యమ్మ గూఢచారిణియై యామె వెన్నంటుచుండెను. ఆమె వాకిట నిలచుచో నెవరి పైననో కన్నువైచినదనును. పనిదానితో మాట్లాడిన తన్ను నిందించినదనియే. బజారునుండి యేమైన తెప్పించినది తప్పక విలాసవస్తువనియే యామె నిశ్చయము. నిరంతర మామె జాబులను చదువ యత్నించును. దాగిదాగి మాటల విన నిచ్ఛగించును. ఆమె కత్తికి రెండువైపుల పదును శ్యామల కామె యన్న భయమేర్పడినది. చివరికామె భర్తతో "వదిన నన్ను వెంటాడి వేధించుచున్నది. రవంత నచ్చఁజెప్పుఁ''డని చెప్పెను శివరావు ఆవేశముతో "నిన్నేమైన నన్నదా!'' యని ప్రశ్నించెను.

"ప్రతిదినము నన్నాడి పోసికొనును. నోటినుండి మాట వచ్చుట తడవు. సామ్ము వాడుచుంటినని యామెకు కష్టమైన నామెనే వాడనిమ్ము. నాకే యాజమాన్యము వలదు. నన్ను తిట్టి దెప్పకున్న నాకు చాలును.''

శ్యామలకు కన్నుల నీరుతిరిగెను. శివరావునకు తన ప్రేమను చూపింప మంచి యదనుదొరికెను. "ఆమెకు నేఁడే చెప్పివేయుదును. ఈ యాగడము లిక్కడ పనికిరావు. ఉండిన నోరుమూసికొని యుండవలెను. లేదా బయటికి నడవవలయును. ఇంటియజమానురాలు నీవు. ఆమెయెవ్వరు? నీకు సాయము చేయవలసినదేగాని నీ నెత్తినెక్కుటకుఁగాదు. అధికారము చెలాయింపనెంచిన నా యాటలుసాగవు. పోనిమ్ము తల చెడి

నదిగదా. దిక్కులేనిది. ఇంకెతిని యింటపడియుండునని తలంచి తిని. ఎందఱు నౌకర్లు చాకర్లు తినుటలేదు? తోడఁబుట్టినది. పిల్లల నంబాళించుట కెట్లును నౌకరైతే యవసరమేయని యింటనుంచుకొన్నందులకు నిన్నే రాపిడిపెట్టసాగినదా?"

శ్యామల మఱలనిట్లనెను—"పిల్లలకు పోయియమ్మను డబ్బుదుగుఁడనియు, అదియునిదియు కోరుడనియు బోధించును. పిల్లలువచ్చి నాప్రాణములుతీయుదురు. క్షణము తెఱపిగా కూర్చుండనీరు. కోపపడిన నామె కన్నులెఱ్ఱచేసికొనివచ్చి పైఁబడును. నాకు పిల్లలన్నవిరోధమని యామెతలంచును. పిల్లలను నేనెంత ప్రేమింతునో భగవంతునికెఱుక. అయినను వారు నా వారుకాదా. వారన్న నాకేల మంటయుండును?"

శివరావు కోపమునఁ గంపించిపోయెను. "నిన్ను వేధించిన పిల్లవానినిఁ జంపివేయుము. నేనును చూచుచుంటినిగదా. వీరు నానాటికి మొండివారై పోవుచున్నారు. భార్గవుని ఛాత్రాలయమునందుఁ జేర్పివైతును. మిగిలినయిద్దరకు నేఁడే రోగము కుదిర్చెదను."

శివరావు కచేరీకివెళ్ళుచుండెను. సోదరిని మందలించు సమయము లేకుండెను. రాఁగానే విద్యమ్మయొద్దకేగి "అయితే యమ్మాయీ! నీవింటనుండఁదలఁచితివా, లేదా? ఉండదలఁచిన శాంతముగ పడియుండుము. మాఱొకరుంచుట యనంభవమొవరింతు విదియేమి?"

మఱఁదలు పుల్లలెక్కించినదని విద్యమ్మ గ్రహించుకొనెను. అంతమాత్రమున కామె యాఁగికూర్చుండు దేవి

కాదు. వయస్సునకుఁ బెద్ద. పైఁగా నాయింటి చాకిరీయుండే జీవిత మంతయుఁ గడపినది. ఆమె యాజమాన్యము నెవరు కాఁదన గలరు? సోదరుని యీత్సుద్రత కామె కాశ్చర్యము కలిగెను. అయిన దాసినై పడియుండ మనెదవా? ఎవ్వరో కొంపకునిప్పం టించుచున్నఁ జూచి యూరకొనుమందువా. ఎవరైన కుమార్గ మున నంచరించుచున్న కనులప్పగించి మట్టిబొమ్మవలె చూచు చుండు మందువా? ఎవరి యిష్టము వచ్చినట్లు వారు చేయు చుండ చేతులు ముడిచికొని కూర్చుండుమందువా? నాచేతఁ గాని పనులివి. నీవింతకోపగించు కొనుటకేమైన దిపుడు? నీబుద్ధి యెంతలో మాయమై పోయినది. నిన్న కన్నులు తెఱచినది నీపిలకవట్టుకొని యాడించుచున్నదా? కొంచె మడుఁగుటయు, పెట్టుటయు లేదు కాఁబోలును. ఆమె మాట నొక్కినది. నీవు బొమ్మ సిపాయివలె తుపాకి గురిపెట్టుచుంటివి"

శివరావు:—నీవు మాటికి మాటికి నేరము లెన్నదవఁటకదా. క్షణక్షణము దెప్పిపొడువు లేనా? ఏమైనఁ జెప్పి నేర్పవలె నన్న ప్రేమతో నచ్చఁజెప్పవలెను. ఎత్తిపొడుపులచే మంచి యలవడుటకుఁ బదులు లొడలు మండసాగును

నియ్యమ్మ:—అయిన నేవిషయమునను నేను కల్పించుకొనఁ గూడదనియేనా నీయభిప్రాయము? సరే అట్లుకానిమ్ము నీవింటనుండియే చూచుచు నేల నలవా? నీయవైతివని యనవుగదా? నామాటలు విషమై తోఁచునప్పుడు నాకేటు పోవుకాలము దాపురించినది నోరెత్తుటకు!

చెప్పనే చెప్పిరి. తరుణుల కాపురము కాటియాకుల
మంట యని, నేనును చూచెద నేమగునో?

ఇంతలో కేశవుఁడు, మాధవుఁడు బడినుండి వచ్చిరి. రాఁగానే మేనత్తయొద్దకేగి తినుటకేమైనఁ బెట్టుమని వేధింప సాగిరి. పోయి మీ సవతితల్లి నడుగరాదా. ఇంటనా పెత్తన మేమి కలదని యామె విసుగుకొనెను.

శివరావు:—మీరాయింటఁ గాలిడినచో కాళ్ళు విఱుఁగఁ
గొట్టెదను. నానాటికి రెచ్చిపోవుచున్న దాగడము!

కేశవుఁడు గడుసువాఁడు. 'మీరును మమ్మే యందురు. ఆమె నేమియు ననరు. మాకామె యెన్నఁడును కాని దబ్బైన నీయద' నెను.

మాధవుఁడును అన్నమాట ననుమోదించి 'నన్ను వేధించిన చెవులు కోయుదు ననుచుందును కాదటరా కేశవా!' యని పలికెను.

శ్యామల గదిలోనుండి 'చెవులు కోసెదనని నేనెప్పుడంటినిరా? ఇప్పటినుండియు అబద్ధములా' యనెను.

అంతలో శివరావు కేశవుని రెండుచెవులు పట్టుకొని పైకెత్తెను. పిల్లవాఁడు గొల్లున నేడ్వసాగెను.

వియ్యమ్మ పరుగెత్తికొనిపోయి సోదరునిచేతినుండి పిల్లవానిని లాగికొనెను. చాలును రాప్రజ్ఞ. పిల్లవానిని చంపివేయుదువా యేమి? అయ్యో చెవులు నెత్తురు చిమ్మినవి క్రొత్త భార్యవచ్చిన గ్రుడ్డివగుదురని యూరక చెప్పలేదు. ఇప్పటి కప్పుడే యిట్లైన ముందీయింటిగతి యింక భగవంతునికెఱుక.

శ్యామల తనవిజయమునకు లోలోన సంతసించు చుండెను. కాని పిల్లవాని చెవులెత్తుబడుటచూచి సహింపఁజాలక పోయెను. వెంటనే విడిపింపవరునెత్తెను. ముందుగనే విద్యమ్మ పిల్లవానినిఁ జేరుకొనెను. విద్యమ్మ అవును నిప్పుపెట్టి నీళ్ళు వేయుటన నిట్లుండవలెను. నీబిడ్డలైననాఁడుగాని నీకు తెలిసి రాదు. వేఱొకతె కన్నబిడ్డలు ఏమయి పోయిననేమాయె !

శ్యామల :—చూచుచుంటిగదా. నేనేమినిప్పువెట్టితినో యను గరేమి ? పిల్లలు మాటిమాటికి డబ్బుకై నన్ను వేధించుచున్నారనియేనా యింక నేమైనయుంటినా ? ఇంతకన్న నింకొకమాట నానోటవచ్చినచో నాకన్నులు పోవును.

శివరావు :—నేనుమాత్ర మీవెధవల యాగడము చూచుట లేదా ? గ్రుడ్డివాఁడనుగాను. ముగ్గురును ముగ్గురే. మొండివారు. పెద్దవానిని నేఁడే హాస్టలుకు పంపి వేయుదును.

విద్యమ్మ :—ఈనాఁటివఱకు నీకు ధవదని యల్లరి నేఁడేల హఠాత్తుగ తెలిసివచ్చినది ?

శివరావు :—నీవలననే వీరికిఁ గన్నులు నెత్తికివచ్చినవి.

విద్యమ్మ :—అవును. నేనేపాపకములోని పుడకను. నావల ననే నీయిల్లు పాడై పోవుచున్నది. ఇదుగో! నేను వెళ్లు చున్నాను. వీరు నీపిల్లలు. కొట్టుకొనుము. చంపు కొనుము. నీ యిష్టము.

అని యామె వెళ్ళిపోయెను. పిల్లవాఁడేడ్చుటఁజూచి శ్యామల హృదయము క్షోభించెను. ఆమె యాతనినిఁ గ్రుచ్చి యెత్తి గదిలోనికిఁ దీసికొనిపోయి ముద్దాడసాగెను. పిల్లవాఁ డంతకంతకు వెక్కి వెక్కి యేడువసాగెను. అతనికా ముద్దులలో బుజ్జగింపులలో దైవము తననుండి లాగికొనిన మాతృస్నేహ మనుభూతము కాలేదు. అది వాత్సల్యము కాదు. కేవలము దయ, జాలిమాత్రమే. అతని కధికారము లేనివస్తు వాతనికి భిక్షమువలె పెట్టఁబడినట్లుండెను. తల్లి బ్రతికియున్నప్పుడు కూడ తండ్రి తన్నొకటి రెండుసార్లు కొట్టెను. కాని తల్లి యాతని కౌగిలించికొని యేడ్వలేదు. ఆమె కోపగించుకొని కొంత సేపాతనితో పలుకుట మానివేసెడిది. అంతలో నాతఁడే కొంతసేపటికంతయు మఱచి తల్లియొద్ద కేగెడివాఁడు. గోలచేసి దెబ్బలు తినుట యాతఁడెఱుఁగును. కాని దెబ్బలు తినిన తరువాత ముద్దుపెట్టుకొనఁ బడుట యేమో యెఱుఁగఁడు. మాతృప్రేమయందు కాఠిన్యముండెను. కాని అది మార్దవముతో కలిసి యుండెను. ఈ ప్రేమయందు జాలియుండెను. ఆత్మీయతా సూచకమగు నాకఠోరత యిందు లేదు. సాధారణముగ నూరక ప్రేలికెవరు కట్టుకట్టెదరు! ఎదురుదెబ్బ తగిలిన పిమ్మట కట్లు కట్టి కాపులు కాయుదురు. ఇంకను దెబ్బలు తగులకుండ కాపాడెదరు శ్యామల కరుణరోదనము పిల్లవానికి తన అనాధ స్థితిని తెలుపుచుండెను. చాలసేపటి వఱకాతఁడు శ్యామల యొడియందేడ్చుచుండి యట్లే నిద్రించెను. నిద్రించిన పిమ్మట నామె యాతనిని మంచముపై పరుండ బెట్టబోయెను. పిల్ల

వాఁడు గట్టిగా కౌఁగిలించుకుని విడువలేను. తన్నెవరో గోతిలో పారవేయుచుండినట్లాతఁ డతుకుకొని పోయెను. సందేహభయములతో నాతని ముఖము వికృతరూపము దాల్చెను. శ్యామల బాలకుని మఱల నొడిలోనికిఁ దీసికొనెను. మంచముపై పరుండఁబెట్టలేక పోయెను. పిల్లవాని నప్పు డెత్తుకొనుటలో నామెకొక యపూర్వతృప్తి లభించెను. ఒక యనుభూతానందము లభించెను. ఆమె యాత్మ యందొకానొక వేదన జనించెను. ఇట్టి వేదనలేక కన్నులు తెరువఁబడవు కర్తవ్య మార్గము గోచరింపదు. నేఁడామె కా మార్గము గోచరింప సాగెను.

---

## షష్ఠ ప్రకరణము

---

వాఁడు తన ప్రేమనంత గట్టిగా నిరూపించుకొన్న తరువాత నిఁక శ్యామలకు తనపై ప్రగాఢానురాగము జనించునని శివరావు ఆశించెను. అతని యాశ గగనకుసుమమయ్యెను. ఇంతకు పూర్వమెన్నఁడైన నవ్వుచునొక మాటయైన పలుకుచుండెడిది. నాఁటినుండి పిల్లలాలన పాలనలలో నామె మునిఁగి తేలుచుండెను. ఇంటికివచ్చి చూచుసరికి పిల్లలామెకడనుందురు. ఒకప్పుడన్నము పెట్టుచుండును. మఱొకప్పుడు దుస్తులుతొడుగుచుండును. ఒకప్పుడు ఆటలాడించుచుండును. వేఱొకప్పుడు

కథలుచెప్పుచుండును. ప్రాయమువైపునుండి నిరాశచెందిన యామె తృషిత హృదయమున కిదియొక అవలంబనమయ్యెను. పిల్లలతో నవ్వుచు మెదలుచు నుండుటచే నామె యూహా కల్పితమాతృకల్పన తృప్తినందుచుండెను. భర్తతో సంభాషించుటయందు జనించిన యప్రీతి, సందేహము, అరుచి, వెగటు పిల్లలతో అమాయకముగ నాటలాడుకొనుటతో నుపశమనమగుచుండెను. భర్తనుండి యెంతదూరము పరుగిడనిచ్ఛగించునో యామె పిల్లలవైపు కంతయెక్కువగ నాకృష్టయయ్యెను. మొదట భార్గవుడామెయొద్దకు రా జంకుచుండెను. కాని అప్పుడప్పుడతడు వచ్చి కూర్చుండసాగెను. అతడు శ్యామలయీడువాడే. కాని మానసిక వికాసమునం దైదు వత్సరములు చిన్న. ఆటపాటలే యాతని ప్రపంచము. ఆతని మధురకల్పనలకెల్ల లివియే. పచ్చని బలిష్ఠమగు శరీరము. అందమైన నగుమొగము. బాలకుడు. లజ్జాశీలుడు. అతనికి నింటికి భోజనమాత్రమే సంబంధము. రోజెల్ల నెచట తిరుగునో! శ్యామల యాతని క్రీడావార్తలు విని కొంతసేపైనను తనచింత మఱచుచుండెడిది. మరలబొమ్మలుచేసి వానికి వైభవముగ పెండ్లిసేయు భాగ్యము తనకు లభించదుగదా అని చింతించెడిది. బొమ్మలాటలువదలి కొలదిరోజులేయైనను ఆమెకు యుగములు గడచినట్లుండెను.

శివరావు ప్రయోజనశూన్యమగుపనిని చేయజాలడు. కొన్నాళ్ళు శ్యామల నటునిటు గొంపోయి యుద్యానవనములు, వినోదములు చూపుచుండెను. వానివలన

ప్రయోజనము లేదని తెలియగనే తిరిగి తన యేకాంత సేవనే యారంభించెను. దినమంతయు నలసి సొలసిన యాతని మన మామోదప్రమోదములకై యుద్విగ్న మగును. అతఁడు తన వినోద వాటిక ప్రవేశించి మామనునగా పూవులు ముకుళించుటయు, మొక్కలెండి పాదులలో దుమారము లేచుటయు కనిపించును. ఏలయీ వాటికను సర్వనాశన మొనర్పరాదని యాతఁడనుకొనుచుండెను. శ్యామలకు తన పట్ల విరక్తి యేలొకో యతని కర్థముకాలేదు. దాంపత్యశాస్త్రములోని మంత్రములన్నియు పఠించెను. అతని మనోరథ మీడేరలేదు. ముందేమి చేయవలెనో యతనికి దిక్కు తోఁచలేదు.

ఒకదినమున నిట్లు చింతించుచు కూర్చుండియుండ సహపాఠియగు రామానందశాస్త్రి యరుదెంచెను. చిరునవ్వు మోమున వెల్లివిరియ "ఓహో! క్రొత్తభార్య మగఁడవు కాఁబోలు, నవోఢయాలింగనమున నవయువకుఁడవైతివి. మంచియదృష్టవంతుడవు. అరిగిపోవు యౌవనమును లాలించి తెచ్చుకొనుటకు యౌవనవతిని పెండ్లాడుటకన్న వేఱొండుపాయము లేదు. నాజీవితము శుష్కముగ నున్నది. ఇంటి యిల్లాలు గయ్యాళి. వలదన్నను పట్టుకొని వదలదు. నా కిచటనైన రెండవపెండ్లి చేయించుము మహాప్రభూ! ఆ వచ్చిన యామెచే వండించి నీకు మృష్టాన్నము పెట్టింతు" ననెను.

శివరా "వంతి బుద్ధితక్కువపనిమాత్రము చేయకుము. లేకున్న పశ్చాత్తాపపడెదవు. యౌవనవతులకు యువకుల

మీఁదనే దృష్టియుంచును. మనసు పనికిరాదు. నమ్ము నమ్మక పోమ్ము, పెండ్లికాగానే నేను పరితాపపడుచుంటిని. ఏదో నాలుగైదువత్సరము లానంద మనుభవింప వలెననుకొంటిని అట్లు కాకపోఁగా కంఠమున కురియైనది.

శామా:—ఏమిమాటలోయి! పిల్లదానిని వశము చేసికొనుటే మంతకష్టము? నాలుగుసినిమాలు చూపింపుము. షికారు నకుఁ గొంపోయి వినోదములఁ జూపింపుము. ఆమె రూపము వర్ణించి పొగడుము. ఏలొంగదో యప్పుడు చూడుము.

శివ:—అన్నియును చేయుటయైనది.

శామా:—అలాగునా? అత్తర్లు, నూనెలు, పూవులు, బిస్కట్లు, నగలు, నానావిధములు నెరచూపితివా?

శివ:—అయ్యా! అన్నియునైనవి. దాంపత్య శాస్త్రములోని సాంకేతములన్నియు వర్తించితిని. అవి వట్టిమాటలు.

శామా:—అట్లైన నా సలహా యొకటి వినుము. ఈదాపునందే ముసలితనమును బాపు నిత్యయౌవనత్వపుఁ డొకఁడు కలఁడు. వానిచే నీరూపము మార్పించుకొనుము. ఒక్క నెరసిన వెండ్రుకగాని, మొగముపై నొక్క ముడుతగాని మిగిలినట్టు. ఏమిమాయ చేయునో యేమో రూపమంతయు నిట్టె మారును.

శివ:—సొమ్మెంత పుచ్చుకొనును?

శామా:—సొమ్మెక్కువే తీసికొనును. అయినను వందలను కొండును

శివ:—పోనిమ్మాతడెవరో మాయలమారియై యుండును. మూర్ఖులను కొల్లగొట్టుచున్నాడు. ఏవో రంగులు మెత్తి నాలుగైదురోజులు మొగము నున్నగచేసి మురిపించును. ప్రకటన మందులపై నాకు నమ్మకము లేదు! పది పదునైదైన నల్లు గాపించియుండును. అమ్మా! ఐదువందలే.

కామా:—ఐదువందలనసికెంత? ఒక్కనెల రాబడి. నా యొద్దనే ఐదువందలున్న మొట్టమొదటనే యీపనిం జేసియుందును. ఒక గంట పూజన ఐదువందలకన్న వేయిరెట్లెక్కువ.

శివ:— ఏదేని చట్టా వైద్యము చెప్పుము. మన కాకులో ప్రేళ్ళో తగిన వైద్యము. ఈ విద్యుత్తు రేడియము లాండలు బలికినవు లేక.

కామా:—అయిన శృంగార పురుషునివలె నటింపుము. ఈ చినిగిన ప్రాతకోటును పారవేయుము. మంచి బిగువైన సిల్కుకోటు పాము కుబుసమువంటి పంచెలు, పేటంచు త్తరీయములు మెడలో బంగరు గొలుసు కన్నులకు విలువగల అద్దములు ధరింపుము. పొట్ట కూడ తగ్గవలెను. నడుమున పదునగా రెండు పటకాలు ధరింపుము. కొంచెము కష్టమగునేమో కాని దోవతి అతికియుందును. పది పదునైదు జావళీలు నేర్చుకొనుము. అప్పుడప్పుడు గొంతువిప్పి పాడుచుండుము. మాటలు సరసముగ నుండవలెను. ప్రపంచమున నీకు చీకు చింత లేనట్లు

కనంబడవలెను. ఉన్నదంతయు నొక్కటే ప్రియురాలు. ధైర్యసాహసముల ప్రకటించు నదను వెతకుచుండుము. గాత్రులందేదోగలభా స్వాయముగచేసి దొంగదొంగ అని కత్తితీసికొని రొంటరిగ బయటికురుకుము. నిజముగ దొంగయుండునేమో జాగరూకతతో మెల్గుము. లేకున్న గుట్టు బయటపడును. ఒక నెలరోజులు నామాట పరీక్షింపుము. ఆమె నీకు లొంగి రాకున్న నాకు జుల్మానా విధింపుము.

శివరావామాటలకు నవ్వియూరకుండెను. వ్యవహారకుశలుండగువాడంతకన్న నేమిచేయును ? కాని యాతండు చెప్పినమాటలలో కొన్ని శివరావునకునచ్చెను. అవి తప్పక పని చేసితీరును. ఎబ్బెరికము లేకుండుటకై నెమ్మదినెమ్మదిగ తన రూపురేఖలు మార్చుకొనజొచ్చెను. శిరోజములతో ప్రారంభించెను సుర్మావరకే తెంచెను నెలతిరుగునప్పటికి రూపము మారిపోయెను జావళీలు నేర్చుకొనుట నగుబాటుచేటు. ధైర్యసాహసములు చూపించుట ప్రమాదము లేనిపని.

నాటినుండి ప్రతిదినము నాతండేదో తనధైర్యసాహసముల ప్రకటించు గాథ నుగ్గడించును. ఉన్మాదము పట్టెనేమో అని శ్యామలకు సందేహముకలుగజొచ్చెను. గట్టిగ రెండు ముద్దలుతిని హరించుకొనలేని యాతనినోట వీరగాథలు పిచ్చితనముగ తోచుటలో నాశ్చర్యములేదు. వీనివలన శ్యామల మనస్సున రాదగు పరిణామము వచ్చినది. ఆమె కాతనిపై జాలి హెచ్చెను. క్రోధద్వేషము లుపశమించెను ఒడలు తెలిసిన

వానిపై క్రోధద్వేషములు తగ్గును. ఉన్మత్తులు దయాపాత్రులు. అమె వారిని మాటిమాటికి గేలిచేయును. రెచ్చకొట్టును. అతసు తెలిసికొనకుండునట్లు మాత్రము సంచరించును. తనపాపమునకు ప్రాయశ్చిత్తము నొనరించుకొనుచుండె ననుకొనును. పాపటూనట్టిన యంతయు నాదుఃఖోపశమనమునకు గదా! విధి వ్రాసిన వ్రాలు నేను తప్పించుకొనలేను. ఈతని నేల దుఃఖపెట్టవలెను?

ఒకరోజున శివరావు శృంగారవేషముననచ్చి శ్యామలతో నేడు ముగ్గురు దొంగలనెదుర్కొంటి ననెను. నేను గొల్లపాలెమువైపునకు పోతిని. చిన్నచీకటి క్రైలుకట్ట యొక్క సప్పటికెక్కడనుండి వచ్చిరో ముగ్గురు కృపాణపాణులై యెదుర్కొనిరి. వారు యమకూతలవలె నుండిరి. నేనొంటరివాడను. చేతసిబెత్తము మాత్రముండెను. ఎదుట మూడుకత్తులు. పై ప్రాణములు పైనెగిరిపోయినవి. ఇంక చావుతప్పదని నిశ్చయించుకొంటిని. మరణమెట్లును తప్పదు గాన వీరునివలె మరణింపవలెనని తలచితిని. ఇంతలో నొకడు గద్దించి నీయొద్దనున్నదేదో యిక్కడనుంచి గుట్టుచప్పుడు కాకుండా పొమ్మనెను. నేను కత్తి సడుకొని "నాయొద్ద నీకత్తి మాత్రమున్నది. దీని విలువ రెండు మనుష్యుల తల" యంటిని.

ఈమాట యనుట తడవుగ ముగ్గురును కత్తులు దూసి పైకురికిరి. నేను కత్తితో నెదుర్కొనుచుంటిని. వారు ప్రాణములకు తెగించి పోరాడుచుండిరి. ఖంగు ఖంగుమని శబ్దమగుచుండెను. నాకత్తి సుదర్శనమువలె పనిచేయుచుండెను. ఈ రీతిని వారు కత్తుల పరాక్రమమును చూపిరి. నాపై నిగవాల

వియ్యమ్మ:—అరే, కన్నులార నేనుచూడలేదా! నీవంతవచ్చి చూడరాదా! మగవాఁడవై భయమందుచుంటివే!

శివరావింటినుండి బయటికివచ్చును వసారాలోనాఁగి పోయెను. ముందడుగు పడకుండెను. గుండెలు గుబగుబ కొట్టుకొనసాగెను. "పాము చాల పగజంతువు నిలువెల్లవిషము. కర్మమువాలక కాటువేసిన పరలోకయాత్రయే." గొంతుసవరించుకొని "నాకేమిభయము? పామేగాని సింహముకాదు గదా! పాముపై బట్టసూటిగపడదు. ఇదే పెద్దచిక్కు. నేనువెళ్ళి యెవరినైన పంపుదును. ఎవరింటనైన బల్లెముకఱ్ఱలదేమో చూచి వచ్చెదను. ఈలోన పాము బయటికి పోకుండును"

శివరావాక్కంతలో బైటపడెను. భార్గవుఁడు లోన భోజనముచేయుచుండెను. శివరావు బైటికిపోఁగానే అతఁడన్నమువదలి తన హాకీకఱ్ఱతీసికొని గదిలోఁజొరఁబడెను. చొరఁబడుటయే తడవుగ మంచమునీవలికి లాగివైచెను. పాముసుత్తుగా నుండెను. పరుగెత్తక పడగవిప్పి నిలఁబడెను. భార్గవుఁడువెంటనే మంచముమీఁది దుప్పటిలాగి దానిమీఁదవిసరి పైనుండిగబగబ కఱ్ఱతో బాదెను. పాముదుప్పటిలో నజ్జునజ్జయ్యెను. అతఁడు దానిని కఱ్ఱపై వైచికొని వీధిలోనికి గొంపోయెను. శివరా వెంతోమందిని వెంటబెట్టుకొని వచ్చుచుండెను. భార్గవుఁడు పామును వ్రేలవైచి తీసికొనిపోవుటచూడఁగనే యాతఁడ ప్రయత్నముగనఱచెను. సంబాళించుకొని "నేనువచ్చుచుంటిని గదా ఇంతలోనేలత్వరపడితివి? ఇమ్మెవరైన పాఱవైచివత్తు" రనెను.

పిమ్మట నాతఁడు ధైర్యముగ వియ్యమ్మ గదిలోని కేగి నలువైపుల నలయఁదిరిగి మీసములు మెలిపెట్టుచు శ్యామల యొద్ద కేగి "నేనువచ్చునరికే భార్గవుఁడు చంపివైచెను. తెలివి తక్కువ పిల్లవాఁడు కర్రతో పాముపై కురికెను. పామును బల్లెముతో మాత్రమే చంపవలెను. ఇదే పిల్లల తొందరపాటు. నేనిట్టి పాముల నెన్నింటిని చంపలేదు. పామునాడించి యాడించి చంపెడివాఁడను. ఎన్నిటినో గుప్పిట నలిపివైచితిని."

వియ్యమ్మ:—చాలు. "నీశౌర్యమును కట్టిపెట్టుము. ఇప్పుడే చూచితిమిగదా!" శివరావు పరిభూతుఁడై "పోనిమ్ము నేను పిరికివాఁడను. నీనుండి బహుమతులు కోరలేదుగదా! పోయి వంటవాని నన్నము వడ్డింపు మనుము."

శివరావు భోజనమున కరిగెను. శ్యామల మండిగముపై నిలిచి "ఈయనకేదో పెద్దజబ్బుపట్టుకొన్నది భగవంతుఁడా! నాకీదుర్గతిచాలదా? నేనాయనకు సేవచేయఁగలను. గౌరవింపఁగలను. నాజీవిత మాతని చరణముల కర్పింపగలను. కాని నాచేతఁ గానివని మాత్రము చేయలేను. వయోభేదము నేను తొలఁగించిన తొలఁగునది కాదు. అయ్యో! నాకీమాట మొదటనే తెలియకపోయెనే. ఈయన యింత కపటనాటక మాడవలసి యుండెడిది కాదుగదా."

---

# సప్తమ ప్రకరణము



నాఁటినుండి శ్యామల తీరు మాఱెను. ఆమె తన కర్తవ్యమునకై ప్రాణమర్పింపవలెనని నిశ్చయించుకొనెను. ఇంతవరకు నైరాశ్య సంతాపములవలన ఆమె తనకర్తవ్యము నాలోచించినది కాదు. ఆమెహృదయమున ప్రజ్వరిల్లుచున్న విషాదాగ్ని యసహ్యావేదనా జనకమై యామెను నిశ్చేష్టురాలినొనర్చెను. ఇప్పుడా దుఃఖవేగము తగ్గినది జీవితమునం దానందమింక లేదని యామెకు స్పష్టమయ్యెను. కలలు కనుటేల? నిరాశనందుటేల? ప్రపంచమున నందఱు సుఖపడుచుండిరా? దురదృష్టజీవులలో నేనొకతెను. నన్నీదుఃఖపుమూట మోయుమని విధి లిఖించెను. ఈబరువు దింపిన దిగదు. పారవేయఁజూచినను పారవేయఁజాలను. కనుల చీకట్లు గ్రమ్మినను, మెడ విఱుగనున్నను, ముందడుగువడకున్నను నీమూటమోయకతప్పదు. ఆమరణ కారాగారవాసి కెంతనియేడ్చి యేమి ఫలము? ఏడ్చిన నెవరువిందురు? ఏడ్చిన కొలఁది జరుగవలసినపనులు జరుగక మఱింత యాతనకలుగును.

మఱునాఁడు శివరావు కచేరీనుండి వచ్చి చూచునప్పటికి శ్యామల నవ్వుచు తనగది వాకిట నిలిచి యుండెను. ఆ యపూర్వశోభను జూచి యాతని కన్నులు తృప్తిపడెను. నాఁటికి నేఁడే పద్మము ప్రఫుల్లమై కనిపించెను. గదిలో నొక పెద్ద అద్దము గోడకు వ్రేలాడుచుండెను. దానిపై పరదా యుండెడిది. నాఁడా పరదా తొలఁగింపఁబడెను. గదిలో నడు

గిడఁగనే శివరావు దృష్టి అద్దముపైఁ బడెను. తన రూపము ముమూర్షుల కనిపించెను. హృదయమునకు తీవ్రాఘాతము కలిగెను. దినమెల్ల పరిశ్రమ చేసియుంటచే మొగము వాడి యుండెను ఎన్ని బలవర్ధక పదార్థములు తిన్నను బుగ్గలు ముడుతలు వాఱియుండెను. ఎంతనొక్కి కట్టినను బొజ్జ తొంగి చూచుచుండెను. అద్దము ముందరనే మఱొకవైపునకు చూచుచు శ్యామల నిలఁబడి యుండెను. రెండు రూపముల కెక్కడి కెక్కడ! ఒకటి రత్నఘటిత విశాల సౌధము. రెండవది విరిగి కూలనున్న పూరిగుడిసె అతఁడద్దము వైపికఁ జూడ లేకపోయెను తన హీనదశ యాతని కసహ్యమయ్యెను. అద్దము ముందునుండి అతఁడు తొలఁగెను. తన రూపమన్న తనకే రోఁతపుట్టెను. సౌందర్యరాశి యగు నా యువతికి రోఁత పుట్టుటలో నే యాశ్చర్యము కలదు? అతఁడు సాహసించి శ్యామల వైపు చూడలేక పోయెను. ఆయన యపురూపమైన సౌందర్య మాతనికి హృదయశల్య మాయెను.

శ్యా:—నేఁడింత యాలస్యమైనదేమి? దినమెల్ల నెదురు చూచి చూచి కన్నులు కాయలు కాచినవి ?

శివరావు కిటికీవంక చూచుచు "వ్యాజ్యెముల వలన రవంత తీరికలేదు. మఱొక వ్యాజ్యెమింకను మిగిలియుండెను. కాని తలనొప్పి పుట్టినదని సాకు చెప్పి తప్పించుకొని వచ్చితిని."

శ్యా:—ఇన్ని వ్యాజ్యెములేల పట్టవలెను. విశ్రాంతిగ చేయఁదగినంత పనిమాత్రమే పెట్టుకొనవలెను. ఆయువును పనులకు బలిపెట్టుదురా? వ్యాజ్యెము లెక్కువ నెత్తిం

పెట్టుకొనకుండు. నాకు ధనాశలేదు. మీరు బాగుగ నన్ను నేలోటుగు రాదు.

శివరావు:—గడపకు వచ్చు లక్ష్మిని కాళ్ళదన్నుకొనగలమా?

శ్యా:—లక్ష్మి రక్తమాంసముల బలికోరుచో గడపత్రొక్క కుండుటే మేలు.

ఇంతలో భార్గవుడు బడినుండి తిరిగివచ్చెను. ఎండపడి వచ్చుటచే మొగముపై చిరుచెమటలు క్రమ్మియుండెను పసిడి కాంతులనీను ముఖము రక్తారుణమైయుండెను. కన్నులు జ్యోతుల వలె ప్రకాశించుచుండెను. వాకిటనిలిచి "అమ్మా! తినుట కేమైన పెట్టుము. వెంటనే యూరుకొన పోవలె" ననెను.

శ్యామల పోయి యొక గ్లాసులో నీరును పళ్ళెరమున ఫలహారమును తెచ్చి భార్గవునకిచ్చెను. అతడు ఫలహారము ముగించిపోబోవ నెప్పటికి తిరిగి వత్తువని శ్యామల ప్రశ్నించెను.

భార్గ:—చెప్పలేను. తెల్లవారితో హాకీపడెదము. మైదానము చాలదూరము.

శ్యా:—త్వరగా రావలెను జుమా. అన్నము చల్లారిన నాకలి లేదందువు.

భార్గవుడు స్నేహపూర్వకముగ శ్యామలవంక జూచి "వచ్చుటయాలస్యమగుచో నచ్చటనే యింటికి ననుకొనుడు. నాకొఱకు వేచియుండపనిలే" దనెను.

అతడు వెళ్ళగనే శ్యామల భర్తతో "మొదట పాప మింటిలోనికి నైతము వచ్చెడువాడు కాడు. నాతో మాట్లాడుటకే సిగ్గు పడుచుండెను. ఏవస్తువైన నవసరమగుచో బజారునుండి

తెప్పించుకొనువాఁడు నేనుదగ్గఱకు పిలిచినప్పటినుండి రాసాగె" ననెను. శివరావు మొగము చిట్లించుకొని యితఁడు తినుబండారములకై మేనత్తయొద్ద కరుగక నీకడ కేల యేతెంచునని ప్రశ్నించెను.

శ్యామల తాను ప్రశంసాపాత్రురాలగుట కామాటచెప్పి యుండెను. ఆమె యాతని సహజసము నెంత ప్రేమించుచున్నదో చూపఁదలంచి యిట్లు చేసినది. నిజమునకామె ప్రేమ కృత్రిమమైనది కాదు. పిల్లలన్నచో నామె కెంతయో ప్రీతి. ఆమె నింకను బాల్యచాపల్యము వీడలేదు. అదే యౌత్సుక్యము, అదే చంచలత, అదే వినోదప్రియత్వము. ఆమె ప్రతిచేష్టనుండి బాల్యభావము ప్రస్ఫుటమగుచుండెను. స్త్రీసహజమగు నీర్ష్యయింకను నామెయందంకురింపలేదు. భర్త సన్నిహితుడగుటకు బదులేల కోపగించుకొనెనో యామెకర్థము కాలేదు "మేనత్తనేల యతఁడు కోరఁడో నాకేమి తెలియును, నాయొద్దకు వచ్చిన రావలదు వెళ్ళుమందునా? ఒకవేళ వెళ్ళుమనిన పిల్లలన్న నీమె కన్నులలో నిప్పులు పోసికొనుననకుందురా?

శివరావు దీనికి జవాబు చెప్పలేదు. ఆనాఁడాయన పార్టీలలో సంభాషింపలేదు. సూటిగ భార్గవుని దరికేగి వానిని పరీక్షింపసాగెను. పకుట్టువాని విద్యాబుద్ధులను గాని ప్రత్యేకముగ భార్గవుని తెలివితేటలను గాని పరీక్షించుట యందాసక్తిచూపుట యాతనికిదే ప్రప్రథమము. ఆయన తన పనినుండి క్షణమైన విముక్తి నెఱుఁగకుండెను. విద్యార్థుల చదువు వదిలి యాతనికప్పుడే ముప్పది సంవత్సరములు పైఁబడినవి.

అప్పటినుండి కన్నెత్తియైన వానివంక చూడలేదు. న్యాయ శాస్త్ర గ్రంథములు, పత్రికలు తప్ప వేరొక ప్రసక్తి యాతనికి లేదు. తీరిక యెక్కడిది? నాటికి నేఁడావిషయములలో భార్గవుని పరీక్షింపసాగెను. భార్గవుఁడు చురుకైన వాఁడేగాక కష్టపడి చదువువాఁడై యుండెను. ఆటలలో "బి" టీమునకు నాయకుఁడైనను తఱగతియందు ప్రథముఁడుగ నుండెను. పాఠ మొక్కసారి చూచిన మనమున నాటుకొని పోవుచుండెను. తొందరలో శివరావునకు తెలివిగల విద్యార్థులు సైతము యోచించి జవాబీయఁదగు ప్రశ్నలు తట్టలేదు. పైపై ప్రశ్నలకు భార్గవుఁడిట్టే జవాబు చెప్పెను. శత్రువుపై ప్రయోగింపఁబడిన శస్త్రప్రహారములు వృథాయైన సైనికుఁడు విసిగి వేసారి యుద్దేశము తప్పి ప్రేటు వేయునట్లాయన కూడ అడ్డదిడ్డపు ప్రశ్నలు వేయసాగెను. భార్గవుఁడు జవాబీయలేని ప్రశ్న యేదైన వేయవలెనని యాతని తలంపు. అతఁడెక్కడ చిక్కునాయని యోచించుచుండెను. భార్గవుఁడేమిచేయలేఁడో చూడవలెనని యాతని యూహ. అలవాటుపడిన పరీక్షకుఁడవఁడైనను భార్గవుని బలహీనత నిట్టే పసిపట్టగలిగి యుండును, కాని దాదాపర్ధ శతాబ్దినుండి మఱచిన చదువు నాధారము చేసికొని యీపనిచేయుట శివరావు తరమా? చివరకాతనికి తన కోపము తీర్చుకొనునుపాయము గోచరింపక "నేనిదే గట్టిగ పరీక్షించు చున్నాను. నీవు దినమెల్ల కాళ్ళునుగఁ దిరుగుచుందువు. నాకు నీ తెలివితేటలకన్న నీప్రవర్తన ముఖ్యము. నీవిట్లు ధూర్తుఁడవై తిరుగుట నాకు రవంతయు నిష్టము లేదు. భార్గవుఁడు నిర్భయముగ-

నేను సాయంకాలము మాత్రమొక గంట నేపాడుకొనుటకు పోవుచుందును. మరెప్పుడు నెచ్చటికిని పోను. నామాట నమ్మకున్న నమ్మనుగాని అత్తనుగాని యడిగి చూడుఁడు. ఆటకు వచ్చి తీరవలెనని ప్రధానాధ్యాపకుఁడు నొక్కి చెప్పుటచే విధిలేక వెళ్లుచుంటిని. నే నాటల కేగుట యిష్టములేనిచో రేపటి నుండియే మానివైచెదను.

మాటలు మఱొక మార్గముపట్టుట చూచి శివరావు తీవ్రముగ-నీ వాటలకే యేగుచుంటివనియును మఱెచ్చటికిని పోవనియును నాకేమి నమ్మకము. నేననేక కర్ణాకర్ణములు నిన్ను గూర్చిన విమర్శల వింటిని. భార్గవుఁడు కోపగించుకొని-నన్ను విమర్శించిన ప్రబుద్ధు లెవ్వరో చెప్పుఁడు-పేరైన విందు-ననెను.

శివ:—ఎవరైననేమి? వారితో నికేమిపని? వారు నిన్నుఁ గూర్చి అబద్ధము పల్కరని మాత్రము నీవు విశ్వసింప వలెను.

భార్గ:—నాయెదుటికి వచ్చి నీవు ఫలానాచోట తిరుగుచుండఁగ చూచితినని చెప్పుమనుఁడు. తిరిగి నా మొగమును వీధికి చూపను

శివ:—నీయెదుటికి వచ్చి నిన్ను విమర్శించునంత అవసరమెవ్వరికో యేల కలుగును? ఎవరు నీతో విరోధము కొని తెచ్చుకొందురు? నీవు నీజట్టుతో వాని కొంపఁగూల్చిన వాఁడేమి చేయఁగలుగును? నాతో నిట్టి విమర్శ లొక్కరుగాదు వందమంది చెప్పియున్నారు. నేను నా మిత్రులమాటను విశ్వసింప కుండుటకు తగిన కారణము లేదు. నీవు విద్యాలయమునందే నివసించిన బాగుగా

నుండుననని నా యభిప్రాయము. భార్గవుడు మొగము వంచుకొని-నాకేమియు సభ్యంతరము లేదు. ఈతుణ మున పొమ్మన్న పోయెదను.

శివరావు:—నీవు మొగము వ్రేలవైచితివేమి? నీకిక్కడ నుండుట యిష్టము కాదా? నీకింపమున్న సత్యేద్చెద వేమి? అయి నను నీకచట కష్టము కష్ట మేమున్నది?

భార్గవునకా ఛాత్రాలయమున నుండుట కిష్టము లేదు. శివరావు నొక్క యెక సగము బెదరు పెడి ప్రసన్నచిత్తునిగ లెనా కేమికష్టము? నాకెల్లను ఛాత్రాలయము నొక్కటే. నా కేమియు కష్టములేదు ఉన్నయు సహింపగలను. నేను రేపే వెళ్లెదను కాని గది వొకకొనున్నదో నా వశము కాదు.

శివరావు పశ్చాత్తాపము వెళ్ళకుండుట కేదో నాకు వెదకు చుండెనని యు తాను పోకున్నను నేరము మాత్రము లేకుండు నట్లు యత్నించుచుండెను. యును దలచెను. "ఇంతమంది పిల్లలకు గదులుదొరకగ నీకొక్కనికే దొరకకుండునా?" యనెను.

భార్గవుడు:—ఎంతోమందికి గదులుదొరకక బయట సత్రాల కున్నారు మొన్ననే యొకపిల్లవాడు ఛాత్రాలయము నుండి వెళ్ళిపోగా నాకాస్థానమున కేబదియార్జీలు వచ్చినవి.

శివరావు చర్చించి ప్రయోజనము లేదని తలంచెను. రేపు సిద్ధముగ నుండుమని భార్గవునకు చెప్పి బండిపై నెక్కి పిఠారుకు పోయెను. ఆతడు కొన్నదినములనుండి తఱచుగ సాయంకాల

మూన పికారుకు పోవుచుండెను ఆయుర్వృద్ధికదే మూలమంత్ర మని యనుభవజ్ఞులు చెప్పిరి. శివరావు వెళ్ళఁగనే భార్గవుఁడు వియ్యమ్మయొద్దకేగి — అత్తా! నాన్నగారు రేపటినుండి నన్ను విద్యాలయమునందే యుండుమనిరనెను. వియ్యమ్మ విస్మయము నంది యేలయని ప్రశ్నించెను.

భార్గ :— నాకేమి తెలియును? నీవు ధూర్తునివలెఁ ద్రిమ్మరు చుంటివని నాన్న యనెను.

వియ్యమ్మ :— నేనెక్కడను తిరుగుట లేదని నీవు చెప్పలేదా?

భార్గ :— ఎందుకు చెప్పలేను? వారు నమ్మినఁగదా?

వియ్యమ్మ :— ఇది నీసవతితల్లి యనుగ్రహామే

భార్గ :— లేదత్తా! నాకామెపై సందేహాము లేదు. పాప మామె పొరపాటున కూడ నట్లు చెప్పదు. ఏవస్తువైన నడుగుట యే తడవుగ తీసియిచ్చును.

వియ్యమ్మ :— పాపము నీకు స్త్రీస్వభావమేమి తెలియును! ఈ పన్నాగము పుట్టించినదియే. నీయెదుటనే తేల్చెదను చూడుము.

వియ్యమ్మ గగ్గోలు పెట్టుచు శ్యామల కడ కేగెను. ఆమెను తిట్టుటకును దెప్పుటకును రంగమున కీడ్చి పట్టీలు కొట్టించుటకును దొరకిన సదవకాశమునెల్ల జారవిడువక యుపయోగించుకొనుచుండెను. శ్యామల యామెను గౌరవించు చుండెను అణఁగి మణఁగి యుండెను. అన్నమాటలకు జవాబు సైతమీయకుండెను. ఆమె తనకు బుద్ధులు గఱపవలెనని తన

పొరపాట్లను సవరించవలెనని తన పనిపాటలఁ బరీక్షింపవలెనని శ్యామల యనుకొనుచుండెను. కాని వియ్యమ్మ కెప్పుడును నామె యన్న మంటయే. శ్యామల 'మంచము దిగిరండు, వదినే!' అనెను.

వియ్యమ్మ అక్కడనే నిల్చఁబడి- నాకు తెలియ కడిగ దను. ఇంటినుండి అందఱిని దఱిమివైచి నీవొక్కతెవే కులుకుదమను కొంటివా?-అనెను. శ్యామల భయకంపితమై 'నేనెవ్వరిని నేమియు ననలేదే! ఏమైనది వదినే! 'యనెను.

వియ్యమ్మ:—ఒక వంక భార్గవుని యింటినుండి వెళ్ళఁగొట్టుచుంటివి. పైఁగా నాకేమియును తెలియకుదనుమంటివి. నీవీపాటి కూడ చూచి సహింపలేవా?

శ్యామల:—వదినే! నీపాదసాక్షిగ నే నేమియు నెఱుఁగను అతని విషయమున పల్లెత్తుమాట యనిన నాకనులు కాలి పోవును.

వియ్యమ్మ:—ఎందుకు వ్యర్థముగ నొట్లు? నేఁటివఱకు శివరావు పిల్లల నేమియు ననియెఱుఁగను. భార్గవుఁడొక్క వారము మత్తవ్వయింటికి పోఁగా గాబరాపడి తాను స్వయముగ నేగి వెంట పెట్టుకొని వచ్చెను. ఇప్పుడా భార్గవునే ఇంటినుండి వెడలఁగొట్టి ఛాత్రాలయమున పెట్టనున్నాఁడు. పిల్లవానికేమి యొంపు టొంపు వచ్చినను నీయనుగ్రహమే. వాఁడెన్నఁడును బైట నున్నవాఁడు కాడు. తిండి తిప్పలు వానికి జ్ఞప్తి యుండవు. కూర్చున్న చోటనే పడి నిద్రించును. అగుటకు

యువకుఁడే యైనను బాలక స్వభావ మాతని వీడలేదు. ఛాత్రాలయమున నతఁ డొక్క క్షణమైన జీవింపఁడు. అచట వీడు తినెనో తినకుండెనో యెవరికిపట్టును? ఇంటనే యుండువాఁడు లేనపు డితరుల కనుకవలసినంత పని యేమి? ఇదుగో, నీమంచికి చెప్పుచున్నాను. పిమ్మట నీయిష్టము. నీమగనియిష్టము. వియ్యమ్మ చరచర వెళ్ళిపోయెను.

శివరావు షికారునుండి తిరిగి రాగానే శ్యామల యీ విషయమెత్తెను. ఆమె భార్గవునియొద్ద కొలఁదిదినములనుండి యింగ్లీషు నేర్చుకొనుచుండెను. అతఁడు వెళ్లిపోయినచో తన చదువేమగును? ఇంకొకరెవరు చదువు చెప్పెదరు? శివరావున కీవిషయమింతవఱకు తెలియదు. కొంచెము లవాటైన పిదప నొక్కసారిగ నింగ్లీషున పలుకరించి భర్తను విస్మితునిఁగావింప వలెనని యామె తలఁచెను. తన సోదరులయొద్దనే యామెకు కొంచెమాంగ్లభాషా జ్ఞానములవడియుండెను. ఇపుడామె నియమబద్ధముగ చదువుచున్నది. శివరావునకిది బల్లెపుపోటయ్యెను. కనుబొమలుముడిచి — ఎప్పటినుండి చదివించుచుండెను? నాకన్నదును నీవు చెప్పలేదే?

శ్యామల యాతని యీరూపము నిదివఱకొక్క పర్యాయము చూచియుండెను. నాఁడు కేశవుని చీల్చి చెండాడినపుడు ఆ రూపమే నేఁడుమరింత భయంకరముగ నామెయెదుట ప్రత్యక్షమయ్యెను. భయపడుచు ఆతఁడు చదువుచెప్పిన నిందేమి నష్టముగలదు! [illegible] లభించినపుడుమాత్రమే నాకు

చెప్పుచుందును. నీకు తీరిక లేకున్న వద్దనియే చెప్పుచుంటిని. ఆతఁడాటలకేఁగు సమయమున నాపి యీపదినిముసములో నేర్చుకొనుచుంటిని ఆతనికి నష్టము గలుగకుండుటయే నాకును నిష్టము.

ఇందు విపరీతమేమియు లేకున్నను శివరావుమాత్రము హతాశుఁడై మంచముపై కూలెను. నొత్తిపై చేయినిడుకొని చింతానిమగ్నుఁడై యోచింపసాగెను. తానుతలఁచినదంతయు నక్షరముల నిజమైనది. విషయమంతకన్న నెక్కుడేముదిరినది. ఇదివఱకే తానతని ఛాత్రాలయమున పెట్టనికి తనదోషమని వగచెను. తనసాధ్వీమణి వెళ్ళఁబోయు నంతనమునకుఁగల మూలకారణమాతనికి స్పష్టమయ్యెను. మున్నున్నఁడును గది నలంకరించియుంచలేదు. నగలు నాణెములు ధరింపలేదు. నేఁడంతయును మార్పే. అప్పుడేపోయి భార్గవుని పంపివేయువలెనని బుద్ధి పుట్టెను. కాని వ్యవహారకుశలత క్రోధమున కది సమయము కాదని బోధించెను. అతఁడు గ్రహించినచో కథ యడ్డము తిరుగును. కాని యామె మనోభావమును తెలిసికొనుట మాత్రము యుక్తము. శ్యామలతో- "నిజమే. నీకు పది నిముసములపాటు చదువు చెప్పినంత మాత్రమున నాతనికి పోవున దేమియు లేదు. కాని యతడసలే త్రిమ్మరి. తనపని చేయకుండుట కాతనికి మఱొక సాకు దొరకును గదా? రేపువాఁడనుత్తీర్ణుఁడగుచో రోజంతయు నీకు నేర్పుచుంటినని నెపము వైచును. నేను నీకు చదువు చెప్పుట గొ[illegible]

మొదటనే చెప్పవైతివి. వీని కొఱకును, వీఁడేమి చెప్పఁగలఁడు. ఏవో రెండు మాటలుచెప్పి కాలక్షేపము చేయుచుండియుండును. ఇట్లైన నీకేమియును రాదు." శ్యామల వెంటనే యాతని మాటల ఖండించుచు- "లేదు లేదు నా కాతఁడు వచ్చునట్లు చెప్పును. అతని శైలి యదే మోగాని చదువుపై మక్కువ కలిగించును. ఒకరోజున మీాకు స్వయముగ నాతని బోధనము చూపుదును. ఉపాధ్యాయి యింత శ్రద్ధగా బోధింపుదని నా యూహ.

శివరావు తన బుద్ధికుశలతకు సంతసించి మీాసములు మెలివెట్టుకొని నకిలించెను. రోజున కొక పర్యాయమే బోధించునా?

శ్యామల కింతను నాతని యాశయము బోధపడలేదు- 'మొదట సాయంకాల మొక్కసారి మాత్రమే చెప్పుచుండెను. కొన్నాళ్ళనుండి మఱియొకసారి వ్రాయుట కూడ నేర్పుచున్నాఁడు అతఁడు తన క్లాసునందు ప్రథముఁడుగ నుండునని చెప్పును మొన్న నేకదా పరీక్షలో ప్రథమ శ్రేణియందు తీర్ణుఁడయ్యెను. అతఁడు చదువఁ డందురేమి? నేనింతగ చెప్పుటకు కారణమున్నది. అనివ్వి నీవే పెట్టితివని యురుమురిమి మంగలముపైఁ బడినట్లు వదిన నన్ను దెప్పిపొడుచును. ఇప్పుడే విదిలించి పోయినది.'

శివరావు లోలోన సంశయ మవగాహన చేసికొనుచుండెను వృద్ధువచ్చి పిల్లను వెక్కిరించుచున్నది. నిన్నుపుట్టి [illegible] [illegible] [illegible]ంచుచున్నది. [illegible]

చాటున తన పనులు వెళ్ళదీసికొన నెంచుచున్నది. "ఛాత్రాలయము పేరెత్తిన వానికొంప యేమి మునుగునో నాకును నర్థముకాదు. ఇతర బాలురు స్నేహితులతో కలిసి యుండవచ్చునని గంతులువేయుదురు. వీడు మొగము ముడుచుకొనును. మొన్న మొన్నటివఱకు వీడు శ్రద్ధగానే చదువుచుండెను. తరగతిలో ప్రథముడుగ నుండుటకదియే కారణము. చదువుపై మోజు వీనికి తగ్గినది. మొక్కయై వంగక మ్రానై వంగదు. ఇక వీని నుపేక్షించుటకగదు. నీకొక యుపాధ్యాయి నేర్పాటుచేయుదును

మరునాడు శివరావు ప్రాతఃకాలమున వస్త్రములధరించి బయటికి వెడలెను. కచేరిసావడిలో పార్టీలు కూర్చుండియుండిరి. అందులో నొక జమీందారుండెను. శివరావున కతనినుండి సాలుసరి వెయ్యిరూప్యముల రాబడివచ్చును. కాని శివరావు వానినచ్చటనే విడిచి యిదే-పదినిముసములో వత్తునని చెప్పి బండినెక్కి తిన్నగా విద్యాలయ ప్రధానాధ్యాపకుని యొద్దకేగెను. అధ్యాపకుడు మిక్కిలి సజ్జనుడు. శివరావును కడుంగడు గౌరవించెను. కాని ఛాత్రాలయమున నొక్కపిల్లవానికి సైతము స్థానములేకుండెను. గదులన్నియు నిండియుండెను. ఊరిపిల్లలను వదలి పైనుండి వచ్చిన వారికిమాత్రమే స్థానమీయవలెనని పరీక్షాధికారి నొక్కిచెప్పియుండెను. కాన నొకవేళ నేదేనిస్థానము వచ్చినను భార్గవునకు మాత్రమిచ్చుటకు వీలులేదు. ఎంతోమంది బయటివారే వేచియుండిరి. శివరావు నిలుకడా; అతనికి మానవప్రవృత్తి యూ...

గ్రముగ తెలియును. అసంభవమును సంభవముగను అసాధ్యమును సాధ్యముగను లోభవశమున సంచఱుచేయుదురని యాతని దృఢనిశ్చయము. ఏమైన రాల్చిన పని జరుగునని భావించెను. గుమాస్తా యొద్దకేగి సంభాషణలో నావిషయ మెత్తెను. అతఁడునవ్వి "బాబూ! యిది కచేరికాదు. బడి" యనెను. ఈమాట యధ్యాపకుని చెవిని బడెనా-క్షణములో భార్గవుని పేరు బడినుండి తీసివేయుదురు. పైయుద్యోగులకు కూడ తెలియఁజేయుట యసంభవముకాదు" పాపము శివరావు మొగము చిన్నఁబోయెను. సుమారు పదిగంటలకు విసుగుకొనుచు నింటికివచ్చెను. భార్గవుఁడప్పుడే బడి కేగుచుండెను. శివరావతనిని శత్రువును చూచినట్లు కఠోరముగ చూచి యింటిలోనికేగెను.

ఆపిమ్మట పదిపండ్రెండు దినములు వఱకు నుదయ సాయం సమయములందు ప్రతి పాఠశాలకు నేగి ప్రధానాధ్యాపకుని ఛాత్రాలయమున తనకుమారునకు చోటిమ్మని ప్రార్థించుట శివరావునకు నియమిత కార్యక్రమమయ్యెను. అన్నితావుల నుండియు లేవనియే ప్రత్యుత్తరములు వచ్చెను ఇక భార్గవు నద్దెయింటి యందుంచుటో మరియొక యూరి బడికి పంపించుటో తప్ప వేఱు మార్గము లేకుండెను. ఈరెండు విషయములును సులభములే. పట్టణ సమీపములందుండు పాఠశాలలోఁ గొన్ని స్థానముల నాక్రమితముగ నుండవచ్చును. కాని అప్పటికి శివరావు హృదయమునందలి సందేహ తీవ్రత కొంత మందగించెను. నాటినుండి యాతఁడు భార్గవుఁడింట కాలిడుట చూడ

లేదు. భార్గవుఁ డాటలకు సైతము బయటి కరుగకుండెను. అతని దెబ్బతిన్న యాత్మాభిమానము పునఃప్రతిష్ఠకై యుద్విగ్నమగుచుండెను. పాఠశాల కరుగుటకు ముందుగాని తిరిగి వచ్చిన పిమ్మటఁగాని క్షణమైన నాతడు గదివీడి యావలికి పోకుండెను. మండు వేసవి కాలము. ఆరుబయట కూడ చెమ్మటలు కాలువగట్టు నా సమయమందు సైత మాతఁడు గదియందే కదలక కూర్చుండును. అతఁడు తన సత్ప్రవర్తన బలమున తనపై నారోపింపబడిన కలంకము సత్యవిదూరమని నిరూపింప నెంచుచుండెను.

ఒక రోజున శివరావు భోజనమున కరుదెంచు సమయమునకే భార్గవుఁడును స్నానమాచరించి భుజింపవచ్చెను. కొన్ని నెలలుగ శివరావతని దుస్తులు విడిచిన యొడలు చూచి యుండలేదు. నేఁడు చూడఁగనే హృదయము తరుగుకొని పోయెను. ఒక యస్థిపంజర మెదుట నిలుపఁబడినట్లుండెను. ముఖముపై బ్రహ్మచర్యతేజము ప్రకాశించుచుండెను కాని శరీరము చిక్కి శల్యమైపోయెను. "నీ యారోగ్యము బాగుండుటలేదా యేమి! ఇంత చిక్కిపోయితి వేమి!"

భార్గవుఁడు ధోవతి కప్పుకొనుచు—'ఆరోగ్యమున కేమి! బాగుగనే యున్న' దనెను.

శివ:—అయిన నింత దుర్బలముగ నుంటి వేమి!

భార్గ:—నేను దుర్బలముగ నుండుటేమి! ఇంతకన్న బలిసి మెప్పుడుంటిని!

శివ:—ఇదివఱకున్న శరీరములో సగమైనలేదు. పైఁగా దుర్బలముగ లేవందువు. అక్కా! పూర్వ మిట్లే డిల్లి యుండెనా?

విద్యమ్మ దొడ్డిలో తులసిచెట్టునకు నీరు పోయుచుండెను.

విద్యమ్మ:—ఏల దుర్బలుఁడగును? ఏమిలాలన, యేమిపాలన? నేను పల్లెటూరి మోటుదాననగుటచే పిల్లలపోషణము నెఱుఁగకుంటిని. పొట్టనిండ పెట్టి వీరి యారోగ్యము చెడఁగొట్టుచుంటిని' ఇపుడు చదువునేర్చిన బుద్ధికుశలయగు వనితామణి కుటుంబ నిర్వహణము చేయుచున్నది. పిల్లల బలుపున కంతున్నదా?

శివరావు:—అక్కా! నీవుబొత్తుగ నన్యాయము చేయుచున్నావు. నీవు పిల్లలను చెడగొట్టుచుంటివని యెవర నిరి? వరులకు చేఁతగానిపని నీవు న్యాయముగ చేయవలెను. ఇంతవిషయమే బొత్తుగ పట్టించుకొనకుండుట ధర్మమా? తానే తెలియనిపిల్లకదా అది యితరుల కేమిచేయఁగలదు? ఇది నీవని.

విద్య:—నా వని యనుకొని నంతకాలము యథావిధిఁ జేసితిని. నీకు పరాయదానముగ కన్పించినపుడు నేనేల పూసికొనవలెను? పాలుత్రాగి యెన్నాళ్ళయ్యెనో రవంత యడిగిచూడుము. పోయి గదిచూడుము. ఫలహారమునకు వంపిన మిఠాయి మురిగిపోవుచున్నది. నేను

పెట్టితిని. తినకున్న నాదోషము లేదని యజమానురాలి యభిప్రాయము. నేను బలవంతముగ నోటఁబెట్టలేను గదా యనుకొనును. ఎన్నఁడును గారాబముతోఁగని దేబెలిట్లు తిందురేమో! నీపిల్లలు కవటాకులవలె పెరిగిరి. అనాథులవలె నేఁడుబ్రతుకవలెనన్న వారికష్టమా! నా కెవరేమనుకొన్నను భయము లేదు. కావున స్పష్టముగ చెప్పివేయుచున్నాను. పైఁగా వానిని పాఠశాలయందే యుంచుటకు యత్నించుచుంటివని వింటిని. పాపము వాఁడింటనైన కాలిడ కూడదా? వాఁడు నాయొద్దకే రా వెఱచును. అయినను నాయొద్దనేముండును గాన వానికి పెట్టెదను?

ఇంతలో భార్గవుఁడు రెండుమెతుకులు తిని లేచెను. "అప్పుడే తిండియైనదా? అరే! కూర్చుండి నిముసమైన కాలేదే నీవు తిన్న దేమున్నది? రెండుమెతుకులేనా" యని శివరావు ప్రశ్నించెను.

భార్గవుఁడు సంకోచించుచు—"పప్పు, కూరయు నేకదా యున్నవి. ఎక్కువతిన్నచో గొంతులో మంటమండును. పుల్లని త్రేఁపులువచ్చును."

భోజనముచేసి లేచునప్పటికి శివరావు చింతామగ్నుఁడై యుండెను. పిల్లవాఁడిట్లే దుర్బలుఁడగుచుండిన నేదియోని భయంకరవ్యాధి పట్టుకొనును. అతనికి వియ్యమ్మపై నమిత కోపమువచ్చెను. ఆమె ఇంటియజమానురాలిని కాదనియే యొడలుమంట. తనకాయధికారమేల లభింపవలెనో స్వంత

యోచింపదు. సరిగా రూపాయలుసైతము లెక్కింపలేని తానెట్లింటి పెద్దయగును? సంవత్సరముపాటు పెద్దరికము వెల్గించెనుగదా దమ్మిడియైన మిగుల్పలేదు. ఈరాబడిలోనే శ్యామల రెండుమూఁడువందల రూపాయలుమిగుల్చుచుండెను. విద్యమ్మ పెత్తనమునందీ మొత్తమే ఖర్చులకు చాలకుండెను. ఇంతకును గారాబమే యీపిల్లలను పాడుచేసినది. అంతకన్న నేమియునులేదు. ఇంత పెరిగిన పిల్లలకొరు లన్నముకలిపిపెట్టవలయునా? ఎవరివిషయము వారికిఁ దెలియవలెను. శివరావు దినమంతయు నిదే యోజించుచుండెను. ఇద్దరు ముగ్గురు స్నేహితులను సైతమడిగిచూచెను. వారాతని యాటపాటలను నిరోధింపవలదనియు, నిప్పటినుండియు బంధించియుంచ వలదనియు, తిరిగి చెడినకన్న గదిలో మురిగి చెడిపోవుటకెక్కువ అవకాశము కలదనియుచెప్పిరి. చెడుస్నేహముపట్టకుండ చూడవలసినదే "కాని యింటిలో మూఁతపెట్టియుంచుటతగదు. యౌవనమునందేకాంత వాసము ప్రవర్తన కెంతేని భయంకరము. శివరావునకు తనతప్పు తెలిసివచ్చెను. ఇంటికివచ్చి భార్గవునికడకేగెను. అతడప్పుడే బడినుండివచ్చి యొకపుస్తకము తెఱచియుంచి యెదుటికిటికివంకఁ దదేకధ్యానములో చూచుచుండెను. ఇంకను దుస్తులువిప్పలేదు. బిడ్డనొడియందుంచుకొని యాచించుచున్న యొక భిక్షుకిపై నాతని దృష్టి నిలిచియుండెను. పిల్లవాఁడు తల్లియొడిలో సింహాసన మధిష్ఠించిన రాజకుమారునివలె నుల్లాసముగనుండెను. భార్గవుఁడా బాలకునిఁ జూచి యేడ్చుచుండెను. అతఁడు తనకంటె నెన్నిమడుంగులు సౌఖ్యవంతుఁడు! అతల్లి

యొడికి బదులుగ నీ విశాల ప్రపంచమున మతియేయితరవస్తువు నంది యాతఁడంత ప్రసన్నుఁడగ నుండఁగలుగును? ఈశ్వరుఁడు కావలెననికూడ నిట్టివస్తువును సృష్టింపలేఁడు. దైవమా! మ్మాతృవియోగము వ్రాసిపెట్టియుండిన బాలకుల సృష్టించెద వేల స్వామీ! నేఁడు నన్నుఁబోలు దురదృష్టవంతుఁడొకఁడేని కలఁడా? నేను తింటినో, పడుకొంటినో, బ్రతికితినో, చచ్చితినో యెవరికి కావలెను? నేను నేఁడు నిజముగ మరణించినను దుఃఖించువారెవ్వరు? నాన్నగారికిపుడు నన్నేడ్పించుటయే యొక యానందము. వారు నాముఖమైన జూడనిచ్చగింపరు. నన్నింటి నుండి గెంటివేయఁ దలంచుచున్నారు. తల్లీ! నీగారాబు కొడుకు నేడు తుంటరిగ పరిగణింపఁ బడుచున్నాఁడు. నీవు బ్రతికి యుండఁగ నెత్తి నిడుకొని పెంచిన తండ్రియే నేఁడు నన్ను మూర్ఖునిగ, దుష్టునిగ నిందించుచున్నాఁడు. నేనీ యింటనుండఁదగినవాఁడను సైతము కాదు. భార్గవుఁడు లోలో నిట్లుతలపోయుచు కుమిలి కుమిలి యేడ్వసాగెను.

ఆసమయముననే శివరావువచ్చి వాకిటనిలచెను. భార్గవుఁడు వెంటనేకన్నులుతుడిచికొని శిరమువంచి నిలువఁబడెను. అతని గదిలో కాలిడుట శివరావునకిదే ప్రథమము. భార్గవుని గుండె కొట్టుకొనసాగెను. నేఁడేమి మూడునో అని అతఁడు కంపించిపోవుచుండెను. భార్గవుఁడేడ్చుచుండుటఁ జూచినంతనే చిరనిద్రాణమగు శివరావు వాత్సల్యమొక్కక్షణము జాగరితమయ్యెను. 'ఏడ్చుచుంటివేమి నాయనా! ఎవ్వరేమనిరి?'

భార్గవుఁడెంతో కష్టముతో పెల్లుబుకు కన్నీరు

నాపిల్లని-'లేదు. నేనేమ్చుచుండు లేదు' అనెను.

శివ:—మీరాయమ్మయేమియు ననలేదుకదా?

భార్గ:—లేదు. ఆమె నాతో మాట్లాడనే మాట్లాడను.

శివ:—ఏమిచేయఁగలను నాయనా? ఏదో పిల్లల సంరక్షించు నని పెండ్లియాడితిని నాయాశలకుగంటిననవి. నీతో నసలే మాట్లాడదా ?

భార్గ:—కొన్ని నెలలనుండి మాట్లాడ లేదు.

శివ:—ఈమెస్వభావము విచిత్రమైనది. ఆమెకేమికావలెనో బోధపడదు. ఈమె స్వభావ మిట్టిదని తెలిసియుండిన పెండ్లియాడకుందును. ప్రతిదినము నేదోమాటపై కయ్యమునకు కాలుదువ్వును. నీ పురోజంత యు నైపే యుండవని యామెయే నాతోఁ జెప్పెను. ఆమె మనమునందలి మాట నాకేమి తెలియును? నీవు చెడు స్నేహముపట్టి తిరిగి చెడుచుంటివని భావించితిని. తన పిల్లవాఁడు తుంటరియై తిరుగుచుండుట చూచి యే తండ్రి దుఃఖింపఁడు? అందులకే నిన్ను ఛాత్రాలయ మునఁ జేర్పనుంకించితిని. అంతేగాని మతేమియు లేదు నాయనా. నీయాటపాటలు నిరోధించవలెనని నాయుద్దే శము కాదు. నీయీస్థితిఁజూచి నాహృదయము క్షోభిం చుచున్నది. నేను పొరబడితినని నిన్న గుర్తించితిని. నీవుల్లాసముగ నాడుకొనుము. ఉదయమునను, సాయం కాలమునను బాగుగ తిరుగుము. స్వచ్ఛవాయువున నీ యారోగ్యము కుదుట పడును. ట్లేది కావలసిన అబ్బి

నన్నడుగుము. ఎవరికడ దేవురింప వలసిన పనిలేదు. ఇంట నామె లేదనియే తలంపుము నీతల్లి పోయినను నీతండ్రి బ్రతికియే యున్నాఁడు

బాలకుని నిష్కపట సరళహృదయమున పితృప్రేమ యుప్పొంగెను. భగవత్సాక్షాత్కారమైనట్లుండెను. తన్నైరాశ్యమున తండ్రి నెన్నో మాటలన్నందుకతని హృదయము క్షోభించెను. సవతిపై నున్నాతనికి సందేహము లేకుండెను. దైవసమానుఁడగు తండ్రిపట్ల తానెంతో యన్యాయమాచరించెను పితృభక్తి యత్తుంగతరంగమువలె నుబికిరాగా నాతఁడుతండ్రిపాదములపై శిరమునుంచియేడ్వసాగెను. శివరావు కరుణావేశమున గద్గదకంఠుఁడయ్యెను. ఒక్కక్షణమైన నెవని వియోగము తనకు దుర్భరముగఁ దోఁచుచుండెనో, యెవని విషయమున జనులైక్యంతమున గుణవంతుఁడని, బుద్ధిమంతుడనీ యుగ్గడించుచుండిరో యతనిపట్ల తానింత కఠోరతనెట్లవలంబించెను ! తాను తనప్రియపుత్రునే ఘోరశత్రువుగ పరిగణించుచుండెను. అతని నింటనుండి వెడలఁగొట్ట నెంచుచుండెను. శ్యామల. తండ్రికొడుకులమధ్య నొకగోడగా నిలిచియుండెను. అమెను తనవైపాకర్షించుకొనుటకు తాను వెనుక కరుగవలసి వచ్చుచుండెను. ఇట్లు పితాపుత్రులమధ్య దూరమధికమగుచుండెను తత్ఫలితముగ నేఁడు తన ప్రియపుత్రుని యెదుట కపటనాటక మాడవలసివచ్చినది. శ్యామలను తమమధ్యనుండి తొలగించి యిఁక రెండవపక్షమును తనవైపున కాకర్షించుకొనుట కాతని కాలోచింపఁగ నాలోచింపఁగ నొకయుపాయము గోచరించెను.

అతఁడా యుపాయమునప్పుడే అమలునందు పెట్టసాగెను. ఇంతైన నతనికభీష్ట సిద్ధియగునో కాదో యెవనికెఱుక ?

ఛాత్రాలయమునకు బంపవలదని బతిమాలుకొన్నను భర్త తన మాటను వినక పెడచెవిని పెట్టినదాది శ్యామల భార్గవునియొద్ద చదువుట మానివేసెను. అతనితో మాట్లాడుటకూడ కట్టిపెట్టెను. తనను భర్త శంకించుచుండెనని యామె యాభావమాత్రముగ గుర్తించెను. అబ్బా! ఎంతసందేహ ప్రవృత్తి ? వీరిప్రతిష్ఠను భగవంతుఁడుసైతము కాపాడఁజాలఁడు. ఈయన మనమున నింతటి దుర్భావనలు నిండి యుండెను కాఁబోలును. నన్నింత నీచురాలినిగ భావించిరి ! ఆమె యెన్నోరోజులు కుమిలి కుమిలి యేడ్చెను. ఆయనకేల సందేహము కలుగుచుండెనాయని యామె యాలోచించెను. ఆయనకు కంటగించుపని తానేమిచేయుచుండెనని పరీక్షించుకొనెను. ఎంతయోచించినను తనయుందట్టి దోషమామెకు గోచరింపలేదు. అయిన భార్గవునితో మాట్లాడుట, నవ్వుట, మెదలుట, చదువుచెప్పించుకొనుటయే యాయనకు గిట్టకుండెనా ? అదియే ఆయన సందేహకారణమా ? అయిన నింక భార్గవుని యొద్ద చదువుట కట్టిపెట్టెదను. పొరపాటునకూడ నాతనితో మాట్లాడను. అతని మొగమైన కన్నెత్తి చూడను.

ఆమెకీ తపస్సు దుర్భరముగనుండెను. భార్గవునితో సంభాషించుటలో నామె విలాసకల్పన యుత్తేజిత మగుటయేగాక కొంతతృప్తి సైతము కలుగుచుండెను. అతనితో మాట్లాడునపుడామెకొక యపారమగు నానందము లభించుచుండెను.

ఆమె యీ యనుభూతిని మాటలతో చెప్పఁజాలదు. ఆమె అంతరాంతరములందైనను కువాసన లేకుండెను. ఆమె స్వప్నమందైనను భార్గవుని కలుషితమగు ప్రేమ నెన్నఁడును వాంఛించియుండలేదు. ఈకు జోడు వారలతో నవ్వుచుమాట్లాడవలెనని అందఱికున్నట్లే యీమెకుసైతము ప్రకృతిసిద్ధమగు నొకకోర్కె, యొకఅజ్ఞాతతృష్ణయుండెను. అదియీమె తృప్తి లేశమునకు సాధనమైయుండెను. ఇపుడా అతృప్తతృష్ణ జ్వాలయై భగ్గునమండ సాగెను. ఉండియుండి ఏలొకో యీమెమన మజ్ఞాతమగు వైకల్యమునందును. పోఁగొట్టుకొనిన యేదోవస్తువుకొఱకు తడవుకొనినట్లామె బాధపడును. ఒకప్పుడెక్కడ కూర్చుండిన నచటనే కూర్చుండిపోవును. ఏపనిపైకిని మనస్సుపోదు. శివరావు వచ్చినపుడుమాత్రము తన ప్రవృత్తులన్నింటిని నైరాశ్యముద్రన నణఁగద్రొక్కి నవ్వుచు నాయీమాటలు మాట్లాడెడిది.

శివరావు భోజనముచేసి కచేరికిపోఁగనే నేఁడు విద్యామ్మ శ్యామలనత్తి పొడువనారంభించెను· ఇచట పిల్లలను సాకవలసివచ్చునని తెలియునుగదా. నేనా బాధపడలేను. ఎవ్వరును లేని దిక్కుమాలిపోయిన వానికిచ్చి చేయుమని యీవారి నడుగలేకపోయితివా! వాఁడే నీఅందచందములనుజూచి మురిసికొనువాఁడు, తన మహాభాగ్యమునకు సంతసించెడివాఁడు. ఇక్కడ నీముసలివగ్గు నీవేషములుచూచి యేమిసంతసింపఁగలఁడు. ఈపిల్లల సాకెదవని నిన్నాతఁడు వివాహమాడెనేగాని మదనసామ్రాజ్యము నేలుటకుఁగాదు. విద్యామ్మ గంటలతరబడి శివమెత్తించుచున్నను శ్యామల నోటినైన మెదపలేదు. ఆమె తన నిర్దోషిత్వమును నిరూపింపఁదలంచుచుండెను ఆమె కది

చేఁతగాకుండెను. తనభర్త చెప్పినట్లు తాను నడచుచుంటినని తెలుపుచో నింటిగుట్టు బజారున పడిపోవును. తన దోషము నొప్పుకొని సవరించుకొనుచో నేమి కొంప మునుఁగునో యని తగని భయము. ఆమె స్వభావసిద్ధముగ స్పష్టవాది. ఉన్న దున్నట్లు కుండ బ్రద్దలుకొట్టి చెప్పగల సాహస మామెకుఁ గలదు. కాని పరిస్థితి విషమముగ నుండెను. కాన మానమే శరణ్యమని యూరకుండెను అంతకన్న మఱియొక మార్గము లేకుండెను. భార్గవుఁడు నానాఁటికి కృశించు చుండెనని యామె గుర్తింపకపోలేదు. అతని నిరాశా విరక్తిభావములా మెకు తెలియక కాదు. ఆమె చేతులకు నోటికి కూడ తాళము వేయఁబడి యుండెను. దొంగ ఇంటనే దొంగతనము జరిగి నప్పుడాతని స్థితి యెట్లుండునో శ్యామల స్థితియు నంతియే.

---

## అష్టమ ప్రకరణము

ఏపనినైన మన మాశించిన దానికి విరుద్ధముగ జరిగి నప్పుడే దుఃఖము కలుగును. శ్యామల తనపై నిందారోపణము చేయునని భార్గవుఁడెన్నఁడును భావించియైన నుండలేదు. అందుచే నాతఁడు దుర్భరవేదన నందుచుండెను. ఆమె నన్నేల నిందించును? నన్ను నిందించిన నామెకేమి లభించును? వీఁడు నాభర్త సంపాదన తినుచుండెను. వీని చదువు సంధ్య

లకు సొమ్ము ఖర్చగును-వస్త్రములకు సొమ్మియ్యవలెననియే కదా! నేనింటియందైన నుండకుండుట యామె వాంఛితమై యుండును. నేను లేకుండపోయిన వారికి ఖర్చుండదు. ఆమె నాపట్ల ప్రసన్నచిత్తయై యుండును. ఆమె నోటినుండి యెన్నఁ డును పరుషోక్తి విననైన లేదు. ఇదంతయు నటనయేనా? అయి యుండవచ్చును. పిట్టలను పట్టుకొనుటకై బోయవాఁడెట్ల వేయును. ఆహా! ఎట్టి క్రింద వలయున్నదని తెలిసికొనఁ జాలక పోతిని. ఈ కపట మాతృప్రేమ నా నిర్వాసనమునకు భూమిక కదా!

నేనిచట నుండుట యామెకేల కంటకముగ నుండ వలెను. తనకు భర్త యగువాఁడు నాకు తండ్రి కాఁడా? పితా పుత్రుల సంబంధము భార్యా భర్తల సంబంధముకంటె తక్కు వయా? అయినను నేనామె సంపూర్ణాధిపత్యమునకు వ్యతిరే కింపలేదే. ఆమె యేమిచేసినను నోరు మెదల్పలేదు. నన్ను పితృవాత్సల్య వంచితునిగ నేలచేయ నుంకించు చున్నది! తన సామ్రాజ్యమున నాకు సూదిమోపు చోటైన నీయలే కున్నది తాను రమ్యహర్మ్యముల వసించుచు నేనే చెట్టునీడనో తల దాచుకొనుట సైతము చూచి సహింపలేకున్నది.

ఇతఁడు పెద్దవాడై నాభర్త యాస్తికి యజమానుఁడగును. కాన నిప్పటినుండియే వెడలఁగొట్టుట మంచిదనుకొనెనేమో. నాపట్ల నిట్టి సందియ మవసరము లేదని యామెకెట్లు నచ్చ చెప్పఁగలను? ఆమె కేదైన నహితము తలపెట్టుటకు ముందు భార్గవుఁడు విషము తిని ప్రాణములు విడఁగలఁడని యేప్రకార

మామెకు తెలియఁగలదు? తానన్ని కష్టములు సహింపవలసి వచ్చినను నామె హృదయశల్యము మాత్రము కాఁజాలదు. అందఱివలె నాకును జన్మనొసగిన తండ్రి యాతఁడు. నేనన్న వారికి మిక్కిలి యనురాగముండెను. కాని ద్వితీయ వివాహము చేసికొనిననాఁడే మమ్ము విస్మరించెనని నాకు మాత్రము తెలియదా! మేమీయింట ననాథలవలె పడియుండవలెను. మాకేమియు అధికారము లేదు. పూర్వసంస్కారమువలనఁ జెఱకు నాథులకంటె కొంచెము మెఱుఁగుగఁ జూడఁబడు చున్నామే కాని నిజమునకు మేమున్సైత మనాథులమే నేడేమి! అమ్మ చనిపోయిననాఁడే యనాథులమైతిమి. ఈరెండవపెండ్లితో సర్వము సంపూర్ణమైనది. నేను మొదటినుండియు నీమెతో సంత, నన్నిహితముగ మెలఁగకుంటిని. ఆదినములలోనే తండ్రి నాపై నిందారోపణము చేసియుండిన బాగుగానుండి యుండును. అపుడు నాకింత మనఃక్లేశము కలుగకుండెడిది. నేనాయాఘాతమునకు సంసిద్ధముగనే యుంటిని. నేనీ విశాల ప్రపంచమున కూలినాలి చేసికొనియైన బ్రతుకఁజాలనా? నాపై విషమ సమయమున అస్త్రము ప్రయోగింపఁబడినది. క్రూరజంతువులాద మఱచిన వానిపైఁ బడిచప్పుడు లేకుండ నుఱుకుచుండును. ఇందులకేనా నాకెంతో యాదరసమ్మానములు జరుగుచుండెడివి? భోజనమునకు లేచుట రవంత యాలస్యమగుచో పిలుపుపై పిలుపు వచ్చుచుండును. ఫలహారమునకు ప్రొద్దుప్రొద్దుననే యుప్మామాలు పెసరట్లు తయారగుచుండెను. సొమ్మేమైన నవసరమా యని మాటిమాటికి కడుగఁబడుచుండెను. ఇందుకేనా

యీ వందరూప్యముల చేతిగడియారము తెప్పింపఁబడుట!

అయినను వీరికి మతిపోక నేరమైన తోఁచలేదా! నన్ను తుంటరి యనిరి! నాలో నేమి తుంటరి తనము చూడఁగల్గిరి! పుస్తకములవంకకన్నెత్తియైన చూడఁడు, నిరంతరముడబ్బుకై ఏడ్పించుచుండు ననవచ్చునే. ఈమాట యేలతోఁపవలెను! నాపై నారోపింపఁబడఁగల దోషములలోనికెల్ల నిదియే ఘోరమైనదను తలంపుతోనే కదా! ప్రపథమముననే నాపై నాగ్నేయాస్త్రము వేయఁబడినది దీని బారినుండి తప్పించుకొనుటకల్ల. తండ్రిదృష్టిలో నేను నీచుఁడను కావలెననికదా. నన్ను ఛాత్రాలయమునకంపుట కేవలమొక సాకు. పానకములోని పుడకవలె నన్ను దీసిపారవేయుటే ముఖ్యోద్దేశము. నాలుగైదు నెలల తరువాత దమ్మిడియైన నీయకుండ కట్టుబాటగును. నేనుచచ్చిన నేరికి కావలె? దీనివెనుక నీమెప్రేరణయుండెనని మొదటనే తెలిసిన నే ఛాత్రాలయమందు స్థానము లేకున్నను నెట్లోనివంతా దించుకొనియుందును. నౌకరుల గదులలోనైన చోటు దొరకకుండునా! వసారాలలో మాత్రమేల యుండరాదు? పోనిమ్ము వ్రాఁతమాత్రము మించిపోయినదేమి! ప్రేమలేనిచోట పొట్టకూటికై పడియుండుట సిగ్గుచేటు. ఇవుడిది నాయిల్లుకాదు. ఇచటనేపుట్టితిని ఇచటనేపెరిగి పెద్దనైతిని. కాని యిది మాత్రమిపుడు నాదికాదు. తండ్రికూడ నావాఁడుకాఁడు. నేనాతనిపుత్త్రుఁడనే కాని యాయనమాత్రము నాకు తండ్రి కాఁడు. బంధుత్వమునకు ప్రేమయేమూలము. ప్రేమలేనిచో నేమియులేదు. అమ్మా! నీ వెక్కడనున్నావోకదా!

భార్గవుడు విలపింపసాగెను. పూర్వో[illegible]యొక్క ప్రేమ పునరనుభూతమగుటతో నశ్రువులు ప్రవహింపసాగెను. ఎదురుగ తల్లి నిలిచి వినుచున్నట్లమ్మా యమ్మాయని పలుమార్లుచ్చైస్స్వరమున పిలిచెను తల్లిలేనిదుఃఖము నేఁడాతని కనుభవమయ్యెను. అతఁడాత్మాభిమాని. సాహసుఁడు కాని నేఁటివఱకును సుఖముగ పెరిఁగినవాఁడగుటచే నిపుడు దిక్కులేనివానిగ భావించుకొనుచుండెను

రాత్రి పదిగంటలయ్యెను శివరామచటికో భోజనమున కేగెను. రెండుసార్లు పరిచారిక భార్గవుని భోజనమునకు పిలువ వచ్చుటయైనది. భార్గవుఁడు నేనురాను, నాకాఁకలిలేదని విదలించి చెప్పెను. నాకక్కఱలేదు బాబో యన్నను వచ్చి నెత్తినెక్కెదవేమి యనెను అంచుచే మూఁడవసారి శ్యామలపోయి పిలుమన్నను నామెపోలేదు. ఆయనగారు నేను పిలిచినను రారనెను.

శ్యామల :—ఎందుకురారు ? పోయి యన్నము చల్లారిపోవుచున్నదని చెప్పుము. వచ్చి రెండే ముద్దలు తినుమనుము.

పని :—నేనన్నియుఁ జెప్పిచూచితిని ఆయనరారు.

శ్యామల :—నేనాయనకొఱకు వేచియుంటినని చెప్పితివా ?

పని :—లేదమ్మా ఆమాటమాత్రము చెప్పలేదు. అబద్ధమేల యాడవలెను ?

శ్యామల :—అయిన పోయి యీమాటనే చెప్పుము. నేను కూర్చుండియుంటినని యతడు రాకున్న చేసినవంట నట్టే యుంచి పోయి పండుకొందునని చెప్పుము. మాయమ్మవు

కాదూ! ఈసారికి పోయిరమ్మా (నవ్వి) రానిచో చంక నెత్తుకొనిరమ్ము

పరిచారిక యానతిగైకొనుచు వెడలిపోయెను. క్షణములో తిరిగివచ్చి అమ్మా! ఆయన ఏడ్చుచున్నారు. ఎవ్వరేమనిరో! యనెను. నూతిలో పడిపోయిన బిడ్డకొఱకు నుద్విగ్నయగు తల్లివలె శ్యామల యులికిపడి రెండుమూఁడడుగులు ముందుకువైచెను. మఱలనాగిపోయి పరిచారికతో 'ఏడ్చుచున్నారా? ఎందుకేడ్చుచుండిరో అడుగలేదా?' అనెను.

పని:— లేదమ్మా అడుగలేదు నేనేల అబద్ధమాడవలెను!

భార్గవుఁ డేడ్చుచున్నాఁడు ఈనిశ్శబ్ద నిశీథమున నొంటరిగ నాతఁ డేడ్చుచున్నాఁడు. తల్లి జ్ఞాపకమువచ్చియుండును. పోయి యెట్లునచ్చచెప్పఁగలను! అయ్యో! యెట్లు చెప్పఁగలను! ఇది తుమ్మిన నూడుముక్కైనది. నేనాతని పొరపాటునఁగూడ నేమియు ననలేదు. దైవమా యిందుకు నీవే సాక్షి. నీపై రవంత మాటగూడ నేనవరితోడను చెప్పియుండలేదని యెట్లు విశ్వాసము కల్గింపఁగలను? తండ్రితో చెప్పి యిదంతయు నీమెయే చేయించినదనుకొనుచుండును. ఇట్టి నిష్కలంకుఁడును దైవసమానుఁడునగు పుత్రునిపై నిందారోపణ మొనరించిన నన్ను మించు రాక్షసి ప్రపంచమున నుండదు.

భార్గవుని యారోగ్యము నానాఁటికి క్షీణించుచుండుట శ్యామల పరికించుచుండెను. నానాఁటికతఁడు దుర్బలుఁడగుచుండెను. ఆతని ముఖకాంతి ప్రతిదినమునకు మలినమగుచుండెను. అతని నగుమోము సంకుచితమై పోవుచుండెను.

కారణ మామెకు తెలియనిది కాదు. ఆమె తన భర్తతో యేవిషయము ముచ్చటించుటకైన వీలు లేదు. ఆమె హృదయ మదియంతయుచూచి క్షోభించిపోవుచుండెను వల్లెత్తుమాట యైన ననుటకుమాత్ర మవకాశము లేకుండెను. భార్గవుఁడుచిన్న చిన్న మాటలకు సైత మేల నింత కించ పడవలయునని యామె యనుకొనును. తుంటరి యనఁగనే యాతఁడు తుంటరి? అయ్యో నా? నావిషయము వేఱు. ఏరవంత సందేహమైనను నాజీవితమును సర్వనాశ మొనరింపఁగలదు. ఇట్టి చిన్నమాటలైనా నాతని కేమిలెక్క ?

పోయి యాతనినోదార్చి అన్నముపెట్టవలెనని యామె మనమున ప్రబలేచ్ఛ జనించెను. పాపము రాత్రియంతయు నాఁకలితో వెళ్ళుచున్నను. అయ్యో! నేనుగదా యీయుపద్రవములకు మూలకారణము. నేను రాకపూర్వమీయింట శాంతి వెలయుచుండెను. తండ్రి, కొడుకులను ప్రాణసమముగ ప్రేమించుచుండెను. నేనురాఁగానే యన్నియు నడ్డంకులైనవి. వీనికంతెన్నఁడైన నుందునా? దైవమునకెఱుక. నాకు చావైన రాదు. పాపమెంటరిగ నాఁకలితో పడియున్నాఁడు. ఉదయము కూడ నెంగిలిపడిమాత్రము లేచిపోయెను ఆతని తిండిమాత్ర మాత్రమెంత ? ఒకటిరెండు సంవత్సరముల బిడ్డమైనను నాతని పాటి తినును.

శ్యామల బయలు దేఱెను. భర్త యాజ్ఞకు విరుద్ధముగ బయలుదేఱెను. తనకు పుత్రుఁడగువానితో మాటలాడుటకు సైతమామె హృదయము కంపించి పోవుచుండెను.

ఆమె విస్మయముగ గదివంక తేరి పాఱఁజూచెను. ఆమె మొదలు మఱచి నిద్రించుచుండెను. బయటి గదివైపునకుఁ బోయెను. అచట సైతము అంతయు నిశ్శబ్దముగ నుండెను. శివరా మింతవఱకును రాలేదు. ఇది అంతయు చూచుకొని యామె జాగరూకతతో భార్గవుని గదియొనుటికి వెళ్ళెను. గది తెఱఁ వబడి యుండెను. భార్గవుఁడు బల్లపై నొకపుస్తకము తెఱచి యుంచి తలవంచుకొని కూర్చుండెను. అతఁడు చింతాశోక ముల సజీవమూర్తివలె నుండెను. శ్యామల పిలువవలె ననుకొనెను. కంఠమునుండి శబ్దము పైకి రాలేదు.

ఇంతలో భార్గవుఁడు తలయెత్తి ద్వారము వంక చూచెను. శ్యామల నంధకారమున గుర్తింపఁజాలక పోయెను. ఉలికిపడి యెవరు వారనెను.

శ్యామల కంపిత స్వరముతో-"నేనే. వచ్చి భోజనము చేయవేమి? ఎంతరాత్రి యైనదో తెలియునా!"

భార్గవుఁడు మొగము ప్రక్కకుఁ ద్రిప్పికొని-'నాకాకలి లేద'నెను.

శ్యా:—నేనీమాట పరిచారిక నోట మూఁడుపార్లు వింటిని.

భార్గవుఁడు వ్యంగముగా నవ్వి-'అంత యాఁకలి వైచుచో నెక్కడినుండి వచ్చు' ననెను.

భార్గవుఁ డిట్లనుచు గది తలుపులు మూసివేయుదమను కొనెను. కాని శ్యామల తలుపులు తెఱచుకొని లోనికి వచ్చెను. భార్గవుని రెండు చేతులు పట్టుకొని యనునయ వినయ ములతో సజలనేత్రయై- "నేను చెప్పుచున్నందులకు రెండు

మెతుకులు తినను. నీవు తినకున్న నేనుకూడ తినకయే పను
కొందును. రెండే రెండు మెతుకులు తినుము నాయనా. నన్ను
రాత్రియంతయు నాకలితో మాడ్చెదవా!"

భార్గవుఁ డాలోచనలో పడెను. ఇంతవఱకీమె భోజ
నము చేయలేదు. నాకై వేచి కూర్చున్నది. ఈమె స్నేహ
వాత్సల్య వినయములందిన స్త్రీరూపమా? ఈర్ష్యా ద్వేషముల
మాయావిని మూర్తియా! అతనికి తల్లి జ్ఞప్తికి వచ్చెను. తా
నలిగినప్పుడామెయూ నిట్లే నచ్చఁజెప్పుచుండెను. తాను వచ్చు
నంతదనుక నామె పీడకుండెడిది. భార్గవుఁడామె బలవంతము
పెట్టిన కాదనఁజాలక పోయెను-"నా వలన మీకింతశ్రమమైనది.
మీరు నాకొఱకై కూర్చుండి యుండిరని తెలిసిన నెప్పుడో
భోజనమునకు వచ్చియుందును.

శ్యామల తిరస్కారపూర్వకముగ —"నీవు భోజనము చేయకయే
నేను చేసి పండుకొందు నని యెట్లు తలంచితివి? సవతి
నైనంత మాత్రమున నంత స్వార్థపరురాలనగుదునా?"

ఇంతలో గదినుండి శివరావు దగ్గుట వినిపించెను.
ఆయన భార్గవుని గదివైపునకే వచ్చుచున్నట్లుతోఁచెను. శ్యామల
మొగముపై నెత్తురుచుక్కలేదు. వెంటనే యామె గదినుండి
బయటపడెను. కాని వెళ్ళిపోవు సమయంబు లేకపోవుటచే
క్రోధస్వరముతో—'ఇంతతడవు వంటయింట వేచిపడియుండు
టకు నేనెవరికిని దాసినిగాను. ఇష్టములేనివారు మొదటనే
చెప్పివేయవలె' నని పలికెను.

శ్యామల యక్కడ నిలిచియుండుట శివరావు చూచెను. ఎంత అనర్థము! ఈమె యిక్కడ నేమిచేయవచ్చినది?--'నివిచట నేమిచేయుచుంటి' వని అడిగెను.

శ్యామల కర్కశస్వరముతో—ఏమి చేయుచుంటినా! నా కర్మ కేడ్చుచుంటిని. నేనే సకలార్థములకు మూలమును. ఒకరలిగి కూర్చుందురు. మఱియొకరు ముడిచికొని పండుకొందురు. ఎవరెవరికని నచ్చజెప్పి బ్రతిమాలు కొనఁగలను! ఎంతవఱకు!

శివరావాశ్చర్యపడి—'విషయమేమ?' నెను.

శ్యామ:—విషయమున కేమున్నది? ఆయన భోజనము చేయఁడు. పదిసార్లు పరిచారకను పంపితిని. చివరకు నేను పరుగెత్తికొని వచ్చితిని. ఆతనికేమి నా కాఁకలి వేయుటలేదని సులభముగఁ జెప్పివేయును. నేనింటివారి కందఱికిని దాసిని. లోకమంతయు నన్నె దుమ్మెత్తి పోయును. ఎవరికాఁకలి లేకున్న నేమి! ఈ రాక్షసి యెవరికిని తిండినైనఁ బెట్టదందురు.

శివరావు భర్గవునితో—భోజనమేల చేయవురా! ఎంతప్రొద్దుపోయినదో తెలియునా?

భార్గవుఁడు కొయ్యబాఱి నిలిచియుండెను. తనకావంతయు నవగతముకాని యొక రహస్య నాటకము నాతఁడు దర్శించు చుండెను. క్షణముక్రిందటివఱకు వినయపూర్వకముగ నుండిన నేత్రములనుండి యీ యాగ్న్యాగ్నిజ్వాలలేమి? నుదను

వర్షించిన యధరములనుండి యీ విషవృష్టియేమి? ఆతఁడర్ధ చైతన్య దశయందు 'నా కాఁకలి లేదు' నెను.

శివరావు గద్దించి-'ఆఁకలి యేల లేదు. అంత యాఁకలి లేకుండిన సాయంకాలమే యేల చెప్పలేదు? నీకని యెవరు రాత్రి అంతయు కనిపెట్టుకొని కూర్చుండెదరు? నీవింతకుపూర్వ మిది యెఱుంగవు. అలుగుట యెప్పటినుండి నేర్చుకొంటివి? పోయి భోజనము చేయుము.

భార్గ:—లేదు. నాకు రవ్వంతయు నాఁకలి లేదు.

శివరావు పండ్లు పటపట కొఱుకుచు-'సరే ఆఁకలి వేసి నప్పుడే తిందువు లెమ్మ'ని లోనికి వెడలిపోయెను. శ్యామ లయు నాయన వెను వెంట నేగెను. శివరావు పోయి పండుకొనెను. శ్యామల వెళ్ళి వంటనర్దివైచి పుక్కిలించి యుమ్మివైచి, తమలపాకులు వైచికొని నవ్వుచు వచ్చెను. శివరావు 'భోజ నము చేసితివా' యనెను.

శ్యా:—ఏమి చేయుదును? ఎవరికొఱకో తిండితిప్పలు మాని వేయుదునా?

శివరావు:—వీనికేమి పట్టినదో నంతయు అర్థముగాదు. రోజు రోజునకు చిక్కి శల్యమై పోవుచున్నాఁడు దినమం తయు నాగదిలోనే పడియుండును.

శ్యామల పలుకలేదు. ఆమె చింతాసాగరమున మునకలు వేయుచుండెను నాలోని యీ ఆకస్మిక పరివర్త నకు భార్గవుఁడేమను కొనియుండును? తండ్రిని చూఁడగనే యీమె భర్గునిఁ నేల మండిపోయినదని యాతని మనమున

ప్రశ్న యుదయింపరాదా? దీనికిఁగల కారణమాతఁడూహింపఁ గలుగునా? పాపమాతఁడు భోజనము చేయవచ్చుచుండెను. ఇంతలోన మహానుభావుఁ డచటనుండి యూడిపడెనో ఈమర్మ మాతనికెట్లు తెలుపఁగలను? తెలుపుట సంభవమగునా? దైవమా! నన్నింత కీవత్సముద్రమున పాలబై చితివి!

ఉదయమునలేచి యామె యింటి పనిపాటలలో నిమగ్నరాలయ్యెను. తొమ్మిది గంటలకు పరిచారిక వచ్చి- 'భార్గవయ్యగారు పుస్తకము లన్నియు నొక గుఱ్ఱపుబండిలో నెక్కించుచున్నార'ని చెప్పెను.

శ్యామల స్తంభితయై--బండిలోనా? ఎక్కడికి పోయెదరు?

పని:—నేనడుగఁగా బడియందే యుందుమనిరి.

భార్గవుఁ డుదయమునసేయేగి ప్రధానాధ్యాపకునితో మాట్లాడి అచట నుండుటకేర్పాటు గావించుకొని వచ్చెను. అధ్యాపకుఁడు మొదట నిచట చోటులేదు. నీకంటె ముందు వచ్చిన వారెందరో కలరని చెప్పెను. కాని చోటు నీయకున్న తానింక చదువు నాపవలసి వచ్చుననియు, పరీక్షలలో కూర్చుండుట సైతమసంభవమనియునుఁ జెప్పఁగ అధ్యాపకున కంగీకరింపక తప్పలేదు.

భార్గవుఁడు ప్రథమశ్రేణికిఁ జెందినవిద్యార్థి. అతఁడు పాఠశాలకు ప్రతిష్ఠతెచ్చునని యధ్యాపకులనుకొనుచుండిరి. ఇట్టి విద్యార్థిని వారెట్లు వదలుకొనఁగలరు? పాఠశాలా కార్యా

లయవుగదిని భార్గవునికిచ్చిరి. అందుచే నాతఁడు పుస్తకము
లను బండికెత్తుచుండెను.

శివ :—అప్పుడే యేమితొందరవచ్చినది. నాలుగైదు దిన
ములు తరువాత వెళ్ళవచ్చును. నీకై మంచివంటవానిని
వెతకుచున్నాను.

భార్గ :—అక్కడివంటవాఁడు బాగుగా వండును.

శివ :—ఆరోగ్యము జాగ్రత్త. చదువునకై స్వాస్థ్యము బలి
పెట్టకుము.

భార్గ :—అక్కడ నందఱును తొమ్మిదిగంటలకు చదువుట
కట్టిపెట్టవలెను నియమముగ ప్రతిదినము నాటలాడ
వలెను.

శివ :—పఱుపు దీసికొనిపోవేమి ? ఎచటపండుకొందువు ?

భార్గ :—కంబళి తీసికొనిపోవుచున్నాను. పఱువక్కరలేదు.

శివ :—నౌకరు సామానుబండిలో పెట్టులోపలపోయి భోజ
నము చేయుము. రాత్రిసైతమేమియు తినలేదు.

ఇంటిలో కేశవుఁడు మాధవుఁడుకూడ సోదరునితో పోవ
మొండిపట్టు పట్టుచుండిరి. శ్యామల వారిద్దరినూరార్చుచుండెను.
అక్కడ చిన్నపిల్లలుండరు నాయనా. అన్నిపనులు స్వయముగ
చేసికొనవలసియుండును.

ఇంతలో నియ్యమ్మవచ్చి నీదెంత వజ్రహృదయమే.
పిల్లవాఁడు రాత్రియంతయు తిండితినకుండ పండుకొనెను
ఇపుడు వచ్చిమంచినీళ్ళుకూడఁ ద్రావకుండ వెడలిపోవుచు
న్నాడు. నీవు పిల్లఁతో నిచట నాటలాడుకొనుచుంటివి. వానిని

నీవెఱుఁగవు. వాఁడు పాఠశాలకుఁ గాదు వెళ్లునది. వనవాసమునకుఁ బోవుచున్నాఁడు. ఇంక తిరిగి రాఁడు. వాఁడందఱివలె నాటలలో తగిలిన దెబ్బ మఱచుపిల్లవాఁడు కాఁడు.' ప్రతివిషయమును నాతని హృదయమున హత్తుకొనిపోవును.

శ్యామల దైన్యముగా — ఏమిచేయను వదినెగారూ! ఆయన యెవరు చెప్పినను వినరు. దయచేసి మీరు వెళ్ళి పిలుచుకొని రండు. మీరు పిలిచినఁ దప్పక వత్తురు.

వియ్యమ్మ :— అసలు వాఁడింటినుండి వెడలిపోవుటకేమి ముంచుకొనివచ్చినది? ఇల్లాఁనెనింత యౌవనప్రాయము వానికెన్నఁడును పుట్టలేదు. మఱొకచోట వానికిదివఱకొకదినమైన తోఁచనేతోఁచకుండెను. నీవే వానినేమో యనియుందువు. వానిపై నేవో చాడీలు చెప్పియుందువు. ఏలచేసితివింటికి నిప్పుపెట్టుకొందువు? ఇల్లు పల్లకాడైన పిమ్మట నీ వనుభవింపఁగల్గెదవు సున్నయే. గుర్తెఱుంగుము.

శ్యామల యేడ్చి మొత్తుకొని—'నేనాతని నేమైన యన్నచో నా నాలుక కోసివేయుఁడు. అవును సవతిని కావున యపప్రతిష్ఠ నాకుతప్పదు. మీకు నమస్కారము. పోయి పిలిచికొనిరండ' నెను.

వియ్యమ్మ తీవ్రస్వరముతో—'నీవేనేల పిలువరాదు? నీ హోదాకు లోపమైపోవునా? నీకొడుకేమైనచో నిల్లే యూరకుండునా?

శ్యామలస్థితి కడుంగడు విచిత్రముగ నుండెను. ఎచట నుండి సర్పమువచ్చుచుండునట కనిపెట్టియు ఱెక్కలు విఱిగిన పక్షి యెగిరిపో లేకయు, నచటనే యుండ లేకయు గిలగిలకొట్టుకొనునట్లామె బాధపడుచుండెను. ఆమెహృదయములో లోనం గుమిలిపోవుచుండెను. ఎవరికిని విప్పిచెప్పుట కవకాశము లేకుండెను.

ఇంతలో నిద్దరుపిల్లలు నేడ్చుచు లోనికివచ్చి—'అన్నయ్య వెళ్ళిపోయె' నని చెప్పిరి. శ్యామల యచేతన మూర్తివలె నిలంబడిపోయెను. వెళ్ళిపోయెనా! ఇంటిలోనికివచ్చి నాతో చెప్పనైన లేదు. నేనతనికి కేమియు కాకపోయినను లోన మేనత్తనైన నుంటినుగదా ఆమెను కలియుటకైనను వచ్చియుండవలసినది. అవును! లోననెట్లు కాలిడెదరు! నేను చూచిపోదునేమో! ఇందుకేవచ్చియుండడు.

---

## నవమప్రకరణము

భార్గవుండు వెళ్ళిపోవుటతో నిల్లు శూన్యమయ్యెను. పిల్లలిద్దరును నాబడియందే చదువుకొనుచుండిరి. శ్యామల ప్రతిదినము వారిని భార్గవుని స్థితిగతులంగూర్చి యడుగుచుండెను. సెలవుదినమున నతండువచ్చునని యాశించెను. సెలవులును వచ్చెను. గతించియుం బోయెను. భార్గవుండు

రాలేదు. శ్యామల హృదయము పరితపింపసాగెను. ఆమె అతి నిక్కై మినుపయుండలు తయారుచేసెను. సోమవారమునాఁడు దయమున నవి పరిచారికకిచ్చి బడికిఁబంపెను. భార్గవుఁడు పంపిన వానినిఁ బంపినట్లు త్రిప్పివైచెను.

శ్యా:—ఆయన యిదివఱకుకంటె బాగుపడిరా?

పని:—బాగో వోగో నేను చెప్పలేను తల్లీ! ఎండివరుగై పోయిరి.

శ్యా:—ఏమీ? ఆరోగ్యము బాగుగా లేదా?

పని:—ఈమాట నేనెఱుఁగ లేదమ్మగారూ! అబద్ధము నేనేల చెప్పవలెను? అక్కడి నౌకరుమాత్రము నాతో అంది. మీ దొరగారు రెండు మెతుకులైన తినఁడేమని నన్నడిగెను. భోజనమునకు కూర్చుండి లేచెదరఁట ఇంకదినమెల్ల నేమియునుఁ దినరఁట ఎప్పుడునుఁ జదువుమనే యుందురఁట.

శ్యా:—మినుపయుండలనేల త్రిప్పివైచెనో నీవడుగ లేదా?

పని:—ఆమాట నఱుఁగ లేదమ్మా. అబద్ధము నేనేల చెప్పవలెను? ఇక్కడ పెట్టుటకైనను వీలులేదు నీవెంటనే తీసికొనిపొమ్మని యాయన చెప్పఁగా తీసికొనివచ్చితిని.

శ్యా:—ఇంక నేమియు పన లేదా? నిన్న నేల రాలేదో యడుగ లేదా? సెలవుగదా!

పని:—అమ్మా! అబద్ధమేల చెప్పవలెను? ఈమాట యడుగుటకు నాకు జ్ఞాపకమే లేదు ఆయన మాత్రమింక విటకి రావలదనియు, నేమియు తేవలదనియూ గట్టిగ

నొక్కి చెప్పినారు. నాకెవ్వఁడును జాబుగాని, చీటీగాని వ్రాసి పంపవలదనియు, పిల్లలతో నేమియుఁ గబురు చేయవలదనియు మీ యమ్మగారితోఁ జెప్పుమనెను. పిమ్మట అతఁడొక కఠోరమగు మాట పలికి యేడ్వ సాగెను. అమ్మా! ఆమాట నేను చెప్పలేను.''

శ్యా:—"ఏమి మాటయది-చెప్పుము."

పని:—ఏమని చెప్పనమ్మా! నా బ్రతుకే వ్యర్థమని యాయన వెక్కి వెక్కి యేడ్వసాగెను.

శ్యామల చల్లని నిట్టూర్పు విడిచెను. హృదయము స్తంభించిపోవునేమో యనిపించెను. ఆమె పత్యాయుపును నార్త నాదము కావించుచుండెను ఆమె యచట కూర్చుండియుండఁ జాలకపోయెను. పోయి ముసుగు పెట్టుకొని పడుకొని యేడువ సాగెను. 'ఆయనకుఁగూడ తెలిసెనా?' దైవమా! యిఁక నేమి జరుగునో! ఆమెను యమబాధ పెట్టుచున్న సందేహాగ్ని శత గుణమై ప్రజ్వరిల్ల సాగెను. ఆమెకు తన విషయమై రవంతయు చింతలేదు. ఆమె యాశలన్నియు నడుగంటుటచే నింక నామెకు విచారింపఁదగిన విషయమే లేకుండెను. తానను భవించుచున్న దంతయుఁ దన పూర్వకర్మ పరిపాకమని యామె మనమునకు సమాధానముఁ జెప్పికొనెను. ఇఁక నిట్టి దుర్దశయందు సైతము సిగ్గువీడి జీవించు ప్రాణులెచటనైన నుందురా? తన జీవితమును, సర్వాభిలాషలను నామె కర్తవ్యవేదిపై బలిపెట్టి యుండెను. హృదయము విలపించుచున్నను కృత్రిమహాసము ముఖముపై

తనఁబఱువవలసి వచ్చుచుండెను. మొగముచూచుట సైతమిష్టము లేని వారితోనే నవ్వుచు మెలఁగవలసి యుండెను. ఏ దేహస్పర్శ యామెకు నల్లత్రాచును ముట్టినట్లు చల్లగ భయంకరముగ శరీరమును కంపింప చేయుచుండునో యాదేహముచే నాలింగితయై యామె అనుభవించు నసహ్యత, గూఢమైన వేదన, రోఁత యెవరికి తెలియఁగలదు! ఆసమయములో నామెకు భూమియేల బ్రద్దలైపోదాయని యనిపించు చుండును. నేఁటివఱకీవిడంబన తనకు మాత్రమే. ఇపుడా సమస్య అత్యంత భయంకర రూపము దాల్చినది.

ఆమెకనులార భార్గవుని యాత్మవేదనఁ జూడఁజాలకుండెను. భార్గవునిఁబోలు మనస్వి, సాహసికుఁడునగు యువకునిపై నిట్టి నిందారోపణ మెంతటి దుష్పరిణామమునకు దారి తీయునో యూహించుకొని యామెహృదయము కంపింప సాగెను. ఇపుడు తనపై నెన్నిసందేహము లెవరికికలిగినను సరే. తానాత్మహత్య చేసికొనవలసివచ్చినను నింక యూరకుండఁ జాలదు. భార్గవుని రక్షించుటకామె మనసు పరితపించుచుండెను. భయసందేహములను, సిగ్గును వీడి కర్తవ్యపథము ననుసరింప నామె నిశ్చయించుకొనెను.

శివరావు భోజనముచేసి కచేరికి వెళ్ళుటకుముందు ప్రతి దినమూమె నవశ్యమొకపరి కలిసికొని వెళ్ళుచుండును. అతఁడు వచ్చు సమయమయ్యెను. వచ్చుచునేయుండునను తలంపుతో శ్యామల వాకిటనిలువఁబడి యాతనకై నిరీక్షించుచుండెను. కాని యిదియేమి? ఆయన బైటికే వెళ్ళిపోవుచున్నారే. బండి

సిద్ధమై వాకిట నిలువఁబడియుండెను. బండి తెమ్మని సాధారణ ముగ నిటనుండియే యాజ్ఞాపించుచుండిరి. నేఁడాయన రారా అటనుండియే వెళ్ళిపోయెదరా? లేదు. అట్లగుటకు వీలులేదు. ఆమె పరిచారికను పిలిచి—పోయి బాబుగారిని పిలుచుకొనిరా! చాల ముఖ్యమైనవిషయము రవంత విని పొమ్మని చెప్పుమని పంపెను.

శివరావు వెళ్ళుటకు సిద్ధముగనుండెను. కబురువిని లోనికివచ్చెను. గదిలోనికిరాకయే దూరమునుండి యామాట యేమో త్వరగా చెప్పుము. నేను వెంటనే వెళ్ళిపోవలెను. ఇంతకుముందే ప్రధానోపాధ్యాయుని యొద్దనుండి భార్గవునికి జ్వరమువచ్చుచున్నదనియు, నింటియొద్దనే చికిత్సచేయించుట మంచిదనియు కబురువచ్చెను. అందుచే నచటనుండియే కచేరికి వెళ్లెదను. నీదంత ముఖ్యవిషయమేమియు కాదుగదా! యనెను.

శ్యామలపై పిడుగుపడినట్లయ్యెను. అశ్రువేగమునకును కంఠస్వరమునకును ఘోరసంగ్రామము కాఁజొచ్చెను. రెండును మున్ముందు బయలువెడలఁ జూచుచుండెను. ఏ యొక్కటి యును వెనుకముఁగువేయ నిష్టపడకుండెను. కంఠస్వరములోని దుర్బలతను, నశ్రువుల సబలతను పరీక్షించిన నింక నీ సంగ్రామ మొకక్షణము సేపు జరుగుచో నేదిజయించునో చెప్పుట కష్టమని పించుచుండెను. చివరకు రెండును నొకమారే బయల్వెడలెను. బయటికిరాఁగానే బలవంతుఁడు దుర్బలునణచివైచెను. కేవలము "ఏమంత ముఖ్యవిషయముకాద"ని మాత్రము నోటి నుండి వచ్చెను. నీరసముకే వెళ్ళుచుంటిరిగదా.

శివ:—నిన్న నేనడుగఁగా పిల్లలు కూర్చుండి చదువుకొనుచుండ నని చెప్పిరి. నేఁడింతలో నేమైనదో తెలియదు.

శ్యామల యావేశమున కంపించిపోవుచు—"ఇదం తయుఁ జేతులార మీరే చేయుచున్నా" రనెను.

శివరాఘు మొగముచిట్లించి.—"నేను చేయుచుంటినా? నే నేమి చేయుచుంటిని ?"

శ్యా:—మీహృదయము నడిగికొనుఁడు.

శివ:—ఇక్కడ వానికి చదువునందాసక్తి కలుగుట లేదనియు, నలుగురితో నచటనుండిన నుత్సాహముగ చదువు కొనుననియు తలంచితిని. ఇందేమితప్పున్నది? ఇంత కంటె నేనేమి దోషమాచరించితిని?

శ్యా:—బాగుగ నాలోచించుకొనుఁడు. అతని నిందుకొఱకే అచటికంపివైచితిరా ? మీమనమున నింక నేమియు లేకుండెనా ?

శివరావు సంకోచమున పడెను. తనబలహీనతను దాచు కొనుటకై చిఱునవ్వు నవ్వయత్నించి—"అయిన నింతకన్న నేముండునో నీవే యోజించుకొనుము" నెను.

శ్యా:—సరే. అట్లేకానిండు. దయచేసి వానినీరోజుననే తీసి కొనిరండు. అచటనేయుండిన రోగమంతకంతకు వళనుఁ దప్పిపోవును. ఇక్కడ వదినగారు చేసినంత పరిచర్య నెవ్వరుఁ జేయఁజాలరు.

ఒకక్షణమాగి స్వామి శిరమువంచుకొని—"నావలన తీసికొని రాకుందురేని నన్ను మాయింటికంపివేయుడు. నే నచటనే నిశ్చింతగ నుండగలను.

శివరావిందు కేమియు జవాబుచెప్పకయే బయటికి వెడలి పోయెను. క్షణములో బంటి పాఠశాలవైపున కరిగెను.

మనమా! నీ నడక విచిత్రమైనది. ఎంతో రహస్యమయ మైనది. దుర్భేద్యమైనది. నీరంగు లెంతలో మార్చుకొందువు. ఈకళయందు నీవునిపుణావు. పూవత్తులలోని రంగులు మారుటకుసైతము కొంత సమయము పట్టును. కాని నీరంగు మారుట కందులోని లక్షాంశమైన పట్టదు. అప్పుడే వాత్స ల్యమంతయు క్షణములో సందేహముగ మారిపోయినది.

"వాడు జబ్బుచేసినదను నెపముతో నాటకమాడు చుండుట లేదుగదా" అని యాలోచించుచు శివరావేగు చుండెను.

---

## దశమ ప్రకరణము

భార్గవుడు రెండుదినముల వఱకు ఘోరచింతాపు గ్నుడై యుండెను. మాటిమాటికిని నాతనికి తల్లిమాట జ్ఞాప కము వచ్చును, అన్నము రుచింపదు. చదువుపై మనసుపోదు. అతని చిన్నమనుదశయు తల్లిరింకెడసది గాను రోలులుండి

ఛాత్రాలయములోనుండు విద్యార్థియై యధ్యాపకు లింటియొద్ద చేసికొని యున్నచిన పరిస్థితి మాత్రఁడు చేయుకుండెను అందుచే నాతఁడు తరగతియందు బల్లయొక్క నిలువలసి వచ్చెను. ఎన్నఁడును జరుగని పని నాఁడు జరిగినది. ఈ ఘోరావమానము కూడ నాతఁడు భరింపవలసివచ్చెను

మూఁడవ దినమున నీచింతలలోనే తేలియాడుచు నాతఁడు మనమునఁ దలపోయుచుండెను.—'ప్రపంచమున నాయొక్కని తల్లియే మరణించెనా? సవతి తల్లులందరు నిట్లే యుందురు ప్రత్యేకముగ నాపాపమే యిట్లు పండలేదు. నేను పురుష ప్రయత్నమొనర్చి లక్ష్యమును సాధింపవలెను. తల్లి దండ్రులెట్లుండఁదలఁచిన నట్లుందురుగాక. అహర్నిశలు కృషి చేసి ఈ సంవత్సరము ఛాత్రవృత్తి సంపాదింపఁగల్గితినా యింక వారి సొమ్ము నాకవసరము లేదు. ఎంతమంది పిల్లలు స్వయం కృషితో గొప్పగొప్ప యుపాధుల బడయలేదు? సమయాను కూలముగ నడచుకొనుట, కష్టములకోర్చి అతిక్రమించుట యనునవే పురుషలక్షణములు అదృష్టమును నిందించుకొనుచు నేడ్చుచుండిన ప్రయోజన మావంతియు లేదు.

ఇంతలో కేశవుఁడు వచ్చి యెదుట నిలిచెను.

భార్గ:—కేశవా! ఇంటియొద్ద పరిస్థితులేమి? క్రొత్త అమ్మకు చాలా సంతోషముగ నున్నది గదా?

కేశ:— ఆమె మనస్సులో నేమున్నదో నేనెఱుంగను. కాని నీవు వచ్చినప్పటినుండి యామె యొక్క పూర్వపైన అన్నము తినలేదు. ఎప్పుడు మూఁడు దినములు నేడ్చుచునే యున్నది.

నాన్న వచ్చినపుడు మాత్రము నవ్వుచు మెదలుచు నుండును. నీవు వచ్చివేయుఁగనే సాయంకాలము నేనుకూడ పుస్తకములు దుస్తులు సర్దుకొంటిని. నీయొద్ద నిక్కడనే యుండఁ దలచితిని. ఆరాక్షసి పనిముండ పోయి అమ్మకుఁ జెప్పినది. నాన్న యచటనే కూర్చుండెను. ఆయన ముందరనే అమ్మ వచ్చి పుస్తకముల లాగికొనినది. ఏడ్చుచు-'నీవుకూడ వెళ్ళిపోయెదవా! ఇఁక నీయింట నెవరుందురు? నావలన మీరందఱు నిల్లు విడిచి వెళ్ళిపోవుచున్నచో నేనే వెళ్ళిపోయెదఁ న'నెను. నేను మండి పోవుచుంటిని. నాన్నకూడ అక్కడ లేరు. విదలించి- మీరేల నెచటికో వెళ్ళిపోయెదరు! మీ యిల్లుకదా! సుఖముగ నుండుఁడు. పరాయివారము మేమేకదా. మేము లేనినాఁడు మీకంతయు సుఖమే సుఖము.

భార్గ :—నీవు బాగుగనంటివి. చాల బాగుగనంటించితివి! అవును మఱింత గగ్గోలుచేసి నాన్నతో చెప్పియుందు నంటియేనా?

కేశ :—లేదట్లు జరుగలేదు. పాపము క్రిందపడి యేడ్వసాగినది. నాకుఁగూడ జాలికలిగినది. నేనుగూడ నేడ్చితిని. ఆమెకొంగుతో నా కన్నీరుతుడిచి "కేశవా! నేనీశ్వర సాక్షిగ మీ యన్నగారి యొక్కమాటైన మీ నాన్నగారితోఁ జెప్పియుండలేదు. నాకర్మలో నీయపకీర్తి వ్రాసి యుండెను. అనుభవించు చుంటిని. అనుచు నేమేమో యనినది అదంతయు నాకర్థము కాలేదు. ఏదో

నాన్ననుగుఱించి భార్గవు డుద్విగ్నుడై :—నాన్నను గుఱించి యేమనెను ? జ్ఞాపకమున్నదా ?

కేశ :—ఆమాటలు నాకు గుర్తులేవన్నా ! కాని యానాటక మంతయు నాన్నను సంతోషపెట్టుట కాడవలసి వచ్చు చుండెనను భావముతో మాత్రము మాట్లాడినది. ఏవో ధర్మాధర్మములగురించి యుపన్యసించినది. ఆమాటలు నాకు బొత్తుగ నర్థముకాలేదు సినిమాచూచుటకి బంపుట యామెకిష్టము లేదు మాత్రము నాకు నమ్మకము కలిగినది.

భార్గ :—ఏవియెత్తుల నెఱుంగవు ఇవి చాల గొప్ప పేచీలు.

కేశ :—నీకు తెలియునేమో కాని నాకుమాత్రము తెలియదు.

భార్గ :—నీకు క్షేత్రగణితమే తెలియదు ఇవి యెట్లు తెలియును ? ఆమె యారోజున భోజనమునకు రమ్మని పిలిచి, నేను సిద్ధమగుసంతలో నాన్న రాగానే యాయన చూచి యెట్లు కపటనాటకమాడెనో మఱవగలనా !

కేశ :—నాకును నదేయర్థముకాదు. సినిమా నిచటనుండి వెళ్ళగనే నీసంగతులనుగసాగినది. ఇక్కడనుండి యెన్నకును నీవు రావంటివని నేనుచెప్పితిని. నేనబద్ధము చెప్పలేదు గదా. నీవే నాతోరానంటివి. ఈ మాటవినగానే యామె యేడ్వసాగెను. ఎందుకీమాట చెప్పితివిరాయని నేను విచారించితిని. మాటిమాటికి నావలన నాతండ్రిల్లు వదలివెళ్ళునా ? నేనన్నదింతలోనేమా ? వెళ్ళిపోవుచు నావంకనైన చూచుటకురాడా? భోజనము సిద్ధముగ

నున్న తిసిన్మైనపోఁడా? అహో! నా దుస్థితి యనుకొను చుండ నింతలో నాయన్న వచ్చెను. వెంటనే యేమ్మమాని కన్నీరు తుడుచుకొని నవ్వుచు నాయనయొద్ద కేగినది. అదేమో నాకు బోధపడదు. నేఁడు వచ్చుచు వెంటఁగొని రమ్మని బలవంతపెట్టినది. నేనీరోజున నిన్నిడ్చుకొని పోయెదను. రెండురోజులలో నామె యెంతచిక్కిపోయి నదో చూచిన కండ్లకును వచ్చెనవుఁడా!

భార్గవుఁడు జవాబు చెప్పలేదు. వాని పాదములు కంపించుచుండెను. కేశవుఁడు బసికంట నీని వగగత్తెను. అతఁడు బల్లపైఁ జేరఁబడి ఎంతసేపటినుండియో యూపిరి పీల్చుకొన లేదా యనునంత దీర్ఘముగ నుచ్ఛ్వసించెను. నోటినుండి యప్రయత్నముగ నీశ్వరా! యను దీర్ఘవేదనా భరితములగు శబ్దములు వెలువడెను. ఆనాటి మోచ్ఛ్వాసము లేవి యాతనికి తన జీవితము శూన్యముగాఁ దోఁచుచుండెను. కేవలమా యుచ్ఛ్వాసముగం దెంత నైరాశ్యము, ఎంత సానుభూతి, ఎంతజాలి, ఎంత దైన్యము నిండియుండెనో యూహించుట కష్టసాధ్యము. ఇపుడాతనికి రహస్యమంతయు నవగతమగుచుండెను. అతని వీడిత హృదయ మార్తనాద మొనరింపసాగెను- ఈశ్వరా! యింత ఘోర కలంకమా?

జీవితము నందింతకంటె మించిన యాపద యేమియుండును? ఇంతకన్న మించిన ఘోరము, మించిన నైచ్యము నూహింపగలమా? నేఁటివఱకే నిర్దయుఁడైన తండ్రియు పుత్రు

నిపై నింతటి ఘోరనింద నారోపించియుండఁడు. ఎవని ప్రవర్తనమును లోకము వేనోళ్ళ ప్రశంసించు చుండెనో, యెవఁడు యువకులందఱకు నాదర్శరూపుఁడుగ నుండెనో, దురాలోచనల నెవఁడెన్నఁడును దరికైనఁ జేరనీయఁడో యాతని పైననే యింతటి ఘోరకలంకమా! భార్గవునకు తనహృదయము బ్రద్దలగు ననిపించెను.

రెండవ గంట సైతము మ్రోగెను. పిల్లలు తమ తమ గదులలోని కేగిరి. భార్గవుఁడు చెంపక్రింద చేయినుంచుకొని నేలవంకఁ జూచుచుండెను. అతనికి తన సర్వస్వము పోయిన ట్లుండెను. తన మొగమేరికైన నెట్లు చూపుటా అని భయము కలుగుచుండెను. బడియందు గైరుహాజరగుచో జరిమానా విధింపఁబడును. అందు కాతనికి విచారము లేదు. తన సర్వస్వము నీటఁ గలిసిపోయిన తరువాత నీచిన్న చిన్న విషయముల లెక్కయేమి! ఇంత కలంక మాపాదింపఁబడినను నా ప్రాణములు నిలిచియుండుట ధిక్కారము.

శోకాతిరేకమున భార్గవు 'డమ్మా యెక్కడనుంటివ'ని బిగ్గరగ నఱచెను. నీవు ప్రాణ సమానముగఁ ప్రేమించు కుమారుఁడు నేఁడు ఘోరవిపద్దశ యందున్నాఁడు. న్యాయముగ నాతని తండ్రియే యాతని గొంతుకోయ సమకట్టి యున్నాఁడు. అమ్మా! యెక్కడ నుంటివో గదా'!

భార్గవుఁడు శాంతచిత్తుఁడై యాలోచింపసాగెను. నాపై నీనిందయు ములకల్గెను. దీనికేమి కారణము! ఇంత సందేహము కలుగుటకు నాలో వారేమి చెడుగును జూచిరి! ఆయన నా

తండ్రిగాని శత్రువులు కాదుగదా. అనావశ్యకముగ నాపై వారేల యపరాధము నారోపింతురు? తప్పక వారేదో విషయము చూచియుందురు వారికి నాపై నెంత ప్రేమయుండెను? నేను లేక భోజనము సైతము చేసెడివారు కారు. వారే అకారణముగ నాశత్రువులగుట యసమంజసము

ఈసందేహమునకు బీజారోపణ మెప్పుడు జరిగియుండును. నన్ను ఛాత్రాలయమున నుంచువిషయ మాతరువాత వచ్చినది. ఆరోజునరాత్రి యాయనవచ్చి నన్ను పరీక్షింపసాగిరి. కోపములో మొగమెఱ్ఱవడి యుండెను. వారికిష్టములేని పని యానాడు నేనేమిచేసితిని? నేను శ్రోత్రియమ్మ నేదైన తినుటకు పెట్టుమని అడుగబోతిని. నాన్న అపుడచటనే కూర్చుండి యుండెను. అవుసివుడు జ్ఞప్తికివచ్చుచున్నది అపుడే వారి మొగము కోపాద్రిక్తమైనది నాటినుండి అమ్మవాకడ చదువు మానివేసినది. ఆనాడే నేనమ్మకడ కరుగుచుండుట, వాతికోతలుజరువుట, మాటనుంచియాడుట నాయనకిష్టము లేదని తెలిసిన నింకటిప్రమాదము వాటిల్లెడిది కాదు. పాపము శ్రోత్రమ్మ యెంత దుఃఖించుచున్నదో!

భార్గవుడింతవఱకును శ్యామల విషయ మెన్నడును యోచింపలేదు. ఆమె జ్ఞాపకము రాగానే అతనికి రోమాంచమయ్యెను. పాపమామె సరళస్నేహశీలముగు హృదయమున కెంత యాఘాతమాకలైనోగదా. ఆహా నేనెంత భ్రమసంమంటిని! నేనామె వాత్సల్యమును కపటమనుకొనుచుంటిని. తండ్రిని తృప్తిపెట్టుటకామె యీకపటనాటక మాడవలసి వచ్చు

చున్నదని తెలిసికొన్నతిని. నేనామెకెంత యన్యాయము నొనరించి
తిని. ఆమె నాకొరకు సర్వత్యాగము చేయుచున్నది నేనిచటికి వచ్చి
వైచితినిగాని యామె యెచటికి పోగలను? ఆమె రెండు దిన
ములుగ భోజనము చేయు లేదని కేశవుడు చెప్పుచుండెను. నిరం
తరము విలపించుచుండునట పోయి యామెకెట్లు నచ్చచెప్ప
గలను? ఈ యభాగ్యురాలికై యామె యాకదనేల నెత్తిసిజుట్టు
కొనవలెను. మాటిమాటికి నాకొఱకు యామె యేలయేడ్చు
చుండవలెను? ఏల నన్ను రక్షింపసి కబురంపుచుండవలెను?
అమ్మా! నాకు నీపై రవంతయు సందియము లేదు. నాహృద
యము నీపట్ల స్వచ్ఛమని యెట్లు తెల్పగలను?

ఆమె యిప్పటికిని నేడ్చుచుండి యుండును. ఎంతటి
అనర్థము? తండ్రీ! యిదేమిట్లు చేయుచున్నావు? వివాహ
బంధములకేనా యేడినది? ఒక అమాయక బాలికను హత్య
గావర్చుటకేనా పెండ్లి? ఈ పూవును నలిపిపారవేయుటకేనా
కోసి తెచ్చితివి?

ఆమె యుద్ధరింపబడునెట్లు? ఆ నిరపరాధి హృదయము
చల్లబడునెట్లు? ఆమె నాపట్ల నెంతో ప్రేమను ప్రదర్శించి
యుండెను. ఆమె సౌజన్యమునకు ప్రత్యుపకారమా? ఆమె
దయారహితముగ నిట్లు బాధింపబడుచుండగ నేను చూచుచు
హాయిగ నుండుటయా? నా మూసరతనమునకై గాకున్నను నామె
మాత్మను రక్షించు నీ ప్రాణములను బలిదానమొనరింప
వలెను. ఇంతకంటె సద్ధర్మోపాయము వేరొకటి లేదు. ఆహా!
వనమునం దెన్నెన్ని గోర్కెలుండెడివి! వానినన్నింటిని

గాడిద పాలొసర్పవలసినదేనా! నామూలమున నొకపతివ్రతా
ణి శంకింపఁబడుచున్నదా? నా ప్రాణములనిచ్చియైన నామెను
క్షించుటయే నాకర్తవ్యము ఇదే నిజమగుశౌర్యము. తల్లీ!
యీ మచ్చను నారక్తములో కడిగివేయుదును ఇందే మన
శుభయూల కల్యాణము నున్నది.

అతఁడు దినమెల్ల నీయాలోచనలందే మునిఁగియుండెను.
సాయంకాలమిరువురు సోదరులును వచ్చి యింటికిరమ్మని
ఁడింపసాగిరి.

కేశ :—రావేమన్నయా! మాతో రావలసినదే.

భార్గ :—నీవుపిలువఁగనే వచ్చుటకు నాకు తీరిక లేదు.

మాధ :— రేపాది వారమేకదా.

భార్గ :—ఆదివారమునాఁడుకూడఁ బనియున్నది.

కేశ :—సరే రేపువత్తువా?

భార్గ :—లేదు. రేపు నేనొకయాటకు వెళ్ళవలెను.

మాధ :—అమ్మ లడ్డుకట్టుచున్నది రాకున్న నొక్కటియుఁ
దక్కదు. నేనును నీవును కలిసి తిందుము రా కేశా—
అంతేగా—

కేశ :—అన్నా! రేపునీవురాకున్న నమ్మయే యిచటికి వచ్చు
నేమో.

భార్గ :— నిజమేనా? లేదు. ఆమె యట్లేలచేయును? ఇచటికి
వచ్చిన నెంతో శ్రమయగును. ఁడెక్కడికో యాట
చూడఁబోయెనని నీవు చెప్పుము.

శీల :—నేనబద్ధ మేలచెప్పవలెను? వాఁడు మొగము మూడుఁచు
కొని కూర్చుండెనని చెప్పెదను. వెంటపెట్టుకొని వత్తునో
లేదో చూతుము.

సూధ :—నీవు చదువనైనఁ బోవ లేదని, పడి నిద్రపోవుచుంటి
వని మేము చెప్పెదము.

భార్గవుఁడు రేపురండని చెప్పి యాదూతలను వదలించుకొనెను. ఇద్దరును వెళ్ళినతరువాత తిరిగి చింతామగ్నుఁడయ్యెను. రాత్రియంతయు కునుకు పట్టలేదు. సెలవుదినమంతయు వ్యర్థముగఁ గడచెను. ఎక్కడ నామె వచ్చిపోవునో అని యాతఁడు భయమందుచుండెను. ఏబండిశబ్దము వినిపించినను నామె వచ్చునేమో అని యులికి పడుచుండెను.

ఛాత్రాలయమునందొక చిన్నయౌషధాలయ ముండెను. సాయంతనముల అందొక వైద్యుడొక గంటకాలము వచ్చిపోవుచుండెను. ఏకుఱ్ఱవానికైన జబ్బుచేసినచో నతఁడు మందిచ్చిపోవును. నేఁడతఁడు రాఁగానే భార్గవుఁడేదో యాలోచించుచు నతనియొద్దకేగి నిలువఁబడెను. అతఁడు భార్గవుని బాగుగ నెఱుంగును. చూచి యాశ్చర్యముతో "నీవిట్లుల నంటివోయీ! ఎండిపోవుచున్నావేమి? బజారుగాలి సోకలేదు గదా! అసలు నీకేమివచ్చినదో యిటురమ్ము చూతము"

భార్గవుఁడు నవ్వి—నాకు జీవనరోగము పట్టినది. మీ
యొద్ద దీనికి మందుగలదా?

వైద్యుడు:—నేను నిన్ను పరీక్షింప వలెను. నీయాకారమే
మాఱిపోయినది. గుర్తుపట్టుటకైన వీలు లేకున్నది.

వైద్యుఁడు భార్గవుని చేయి, గుండెలు, వీఁపు, కనులు, నాలుక మొదలైన వన్నియు నెన్నోసార్లు పరీక్షించి చూచెను.

విచారపడి 'ఆయిన నింక ప్లీడరుగారిని నేఁడేపోయి కలియుదును. మీకు "థాయిసిస్" రోగము తట్టుచున్నది. లక్షణములన్నియు దానివే' అనెను.

భార్గవుఁ డుత్సుకతతో—అయిన నింక నెన్నిదినము లలో నావని పూర్తియగును డాక్టరుగారూ ?

వైద్యుడు:—చాలు చాలు నీమాటలు కట్టిపెట్టుము. ప్లీడరు గారిని కలిసి నిన్నుచటికైనఁ బర్వతప్రదేశముల కంపుఁ డని చెప్పెదను భగవంతునిదయవలన నీకు త్వరలోనే నయము గాఁగలదు. రోగమింకను ప్రథమదశయందే యున్నది

భార్గ:—అయిన నింకను రెండు మూఁడు సంవత్సరములు పట్టునట్లున్నదే. నేనంతకాలము వేచియుండఁ జాలను. నాకు "థాయిసిస్ గీయిసిస్" ఏమియు లేదు. వేఱొక జబ్బునలు లేదు. అనవసరముగ తండ్రిగారి నిబ్బంది పెట్టకుఁడు ఇపుడు నాకు తలనొప్పిగా నున్నది. రవంత మందేమైన నిండు. నిద్దురకూడ పట్టవలెను. నాకు రెండు రాత్రులనుండి నిద్ర లేదు.

వైద్యుఁడు విషపుమందుల బీరువా తెఱచెను. చిన్న సీసాలోని మందును తీసి భార్గవునకిచ్చెను. భార్గవుఁడిదియేమైన విషమాయని అడిగెను. దీని నెవ్వరైన త్రాగిన మరణింతురా?

వైద్యుఁడు:—మరణింపరుగాని తల తిరిగి క్రింద పడిపోవుదురు.

భార్గ:—త్రాగఁగనే ప్రాణములుపోవు మందు సైత మిందే దేని కలదా?

వైద్యుఁడు:—ఒకటి రెండు గాదు. వందలున్నవి ఇదుగో సీ సీసాలోని పొందొక చుక్క కడుపులోని కేగినను ప్రాణములు క్షణములో పోవును.

భార్గ:—అయితే డాక్టరుగారూ! విషము త్రాగినవారికి చాల బాధ కలుగునా?

వైద్యు:—అన్ని విషములకును అంత బాధ యుండదు కొన్నింటిఁ ద్రాగఁగనే యొడలు చల్లబడి పోవును. ఈసీసా యిట్టిదే ఇది త్రాగఁగనే మూర్ఛ వచ్చును. ఆపైని బాధ యేముండును?

భార్గవుఁడు లోన "నయినచో ప్రాణములు తీసికొనుటంత కష్టము కాదన్నమాట. అయిన చావన్న లోకులింత భయమందెదరేల? ఈసీసా యెట్లు లభింపఁగలదు? మందుపేరు చెప్పి యేదుకాణమందైన అడిగినంత నాతఁడీయుఁను. ఆఁ ఆ మాత్రము నాందే దొరకకపోవునా? తేలికగా ప్రాణములు తీసికొనవచ్చునని బాగుగ తెలిసిపోయినది" ఏదో అమూల్య బహుమానము లభించినట్లు భార్గవుఁ డుప్పొంగి పోయెను. అతని శిరముపైనుండి యొక భారము తొలఁగినట్లయ్యెను. మనమున నావరించియున్న విచారమేఘములు పటాపంచలయ్యెను. ఒక నెల దినముల పిమ్మట తిరిగి యాతని ముఖము కలకల లాడుచుండెను. పలువురు పిల్లలు సరిత్తకుని యాజ్ఞ గైకొని

నాటకమును చూడఁబోవుచుండిరి. భార్గవుఁడు సైతము వారి వెంట నేగెను. తనకంటె సుఖజీవి ప్రపంచమున నింకొకఁడు లేఁడన్నంత సంతసముగ నుండెను. నాటక ప్రదర్శనమును జూచి విఱుగఁబడి నవ్వుచుండెను. మాటిమాటికి సీలలు వేయుట యుండును, మఱొకమారు మఱొకమారని కేక లిడుటయుందును నాతఁడే సర్వప్రథముఁడుగ నుండెను. పాటవిని తల గిర గిర యూచుచు నోహో యోహో అనుచుండెను. ప్రేక్షకులందఱు నాతనివంకఁ జూచుచుండిరి. నటకులు సైత మింతటి రసికుఁ డెచటనుండి వచ్చెనాయని యతనిఁజూడ నుత్సుకులగుచుండిరి. అతని యుచ్ఛృంఖలతకు మిత్రులాశ్చర్యము నందుచుండిరి. అతఁడు ప్రశాంతచిత్తుఁడును గంభీరుఁడు నగు యువకుఁడై యుండెను. నేఁడాకస్మికముగ నాతఁడేల యింత హాస్యశీలుఁడయ్యెను? అతని వినోదమున కంతులేకున్న దేమి? ఎవరికిని అర్థము కాలేదు.

రాత్రి రెండు గంటలకు నాటకము నుండి తిరిగి వచ్చిన పిమ్మటఁ గూడ నతని వినోదమున కంతు పట్టకుండెను. అతఁడొకని మంచము నెత్తివైచెను. అనేకుల గదుల తలుపులు మూసివైచెను. లోపలి నుండి వారు కటకట ప్రమోగించినను తీయలేదు. నవ్వుచు నూరకుండెను. ఛాత్రాలయ నిరీక్షకుని నిద్రకుఁగూడ భంగము కలిగెను. భార్గవుని యీ మూర్ఖత్వమున కాతఁడు దుఃఖించెను. అతని హృదయాంతరాళమునఁ జెలరేఁగు భీషణమగు తుఫాను

నెవరెఱుంగుదురు ? అసత్య నిందారోపణ మతని యాత్మ గౌరవమును, సిగ్గెగ్గులను సమూలముగ నాశమొనరించెను. అవమానమన్నను, తిరస్కృతియన్నను నాతనికావంతయు భయములేదు. అది వినోదముకాదు. ఆతని యాత్మయొక్క దయనీయమగు విలాపము. పిల్లలందఱును నిద్రింపగా నాతఁడు కూడ మంచముపై పరుండెను. కాని నిద్రపట్టలేదు. క్షణము సేపటికాతఁడు లేచి పుస్తకములన్నియు నర్ది పెట్టెలోపెట్టెను. చావవలసియుండఁగా చదివి యేమిఫలము? బతుకనందిన్నన్ని కష్టములు నవమానములునుండఁగ చచ్చుటయే మేలు.

ఆలోచించుచుండఁగనె తెల్లవారు జామయ్యెను. మూఁడు రాత్రులనుండి యాతనికి నిద్దురపట్టకుండెను. లేచి నిలువఁబడఁగ నాతని పాదములు వడఁకసాగెను. కనులు చిరుతలు క్రమ్ముచుండెను. తల గిఱ్ఱునదిరిగిపోవుచుండెను సకలాంగములును శిథిలమైయుండెను. ప్రొద్దెక్కు-చున్నను లేచి మొగము కడుగుకొనవైనను నతనికి శక్తిలేకుండెను. ఇంతలో నేదోరుమాలున మూటకట్టుకొని పరిచారిక వచ్చుట కనిపించెను. ఆమెవెంట నొకనౌకరుండెను. అతని హృదయమాగిపోయెను. దైవమా! ఆమె రానేవచ్చినది. ఇపుడు కర్తవ్యమేమి ? ఈ పరిచారిక యొంటరిగవచ్చియుండదు. బండి తప్పక బైటనిలిచి యుండును. లేవనైన నోపికలేని యతఁడామెను చూడఁగనే యదరిపడిలేచి బిగ్గరగా-'అమ్మగారుగూడ వచ్చిరటే ?' యని కేకవేసెను. అమ్మగారు రాలేదని తెలియఁగనే యాతని మనమున శాంతినెలకొనెను. పరిచారిక "బాబూ! సిన్న మీరు రాలేదు.

అమ్మగారు మీ కై నిరీక్షించుచుండిరి. వారన్న మీ కేల యింతకోపము బాబూ! ఆమె మీపై నంతయు నిందారోపణము చేయ లేదనుచున్నారు. నేడేడ్చుచు నాతో సీమిఠాయి తీసికొనిపోయి వారికిచ్చి నావలన బంటి నేల వీడిపోయిరో యడుగుచునిరి ఈపట్లైము నెచటనుంతును?

భార్గవుఁడు కఠోరముగ—పత్నియు నీని త్రిని గొట్టుకొనుము. రాక్షసి మిఠాయి తీసికొని వచ్చినది తగుదునమ్మా అని జాగ్రత్త నతోకసారి యిటు తొంగిచూచితివా ప్రాణములతో విడువను. కానుకలు తేవచ్చినది! పోయి వారి మిఠాయి నాకువలదని తిరిగి యిచ్చివేయుము. తనయిల్లు సుఖముగ నుండుమని చెప్పుము. నాకిచటనే హాయిగా నున్నది. కడుపునిండ తిని కులాసాగా నుంటినని చెప్పుము. నాన్నగారు చూచుచుండఁగ చెప్పుము. తెలిసినదా? వారి మొగము నెదుట చెప్పవలెను. నాకెవరిభయమును లేదు. ఎవరేమి చేయఁదలఁచినను జేయునిమ్ము. పొమ్మన్న నేపట్టణమునకో లేచిపోయెదను. చెన్నపట్టణమో, కలకత్తాయో, బొంబాయో ఎచటికి పొమ్మందురో కనుఁగొనుము. నాకీయూరంతో నాయూరు నంతియే. ఇక్కడ విశేషమేమున్నది?

పని:—బాబూ! మిఠాయియుంచుకొనుము లేకున్న నామె యేడ్చి యేడ్చి గుండెలుబ్రద్దలు కొట్టుకొని చచ్చిపోవును.

భార్గవుఁడు పొంగిపొరలు నశ్రువుల నతికష్టమున నాపుకొని చావనిమ్ము. నన్నెవరేమి సుఖపెట్టిరి. గనుకనే నేడ్వ

వలెను? నన్నామె సర్వనాశమే గావించెను. నాయొద్దకు నేమియు కబురంపవలదని చెప్పుము. తెలిసినదా?

పని:—బాబూ! కడుపునిండ తినుచున్నాను, బాగుగా బలిసితి నంటిరి. వచ్చినప్పటికంటె నిప్పుడు సగమైపోతివికదా!

శ్యా:—ఇది నీకన్నులదోషము. నాలుగైదు దినములలో బలిసి యెద్దునైపోవుదునో లేదో చూడుము. ఏడ్పులు మొత్తుకోళ్ళు మానకొనుమని కూడ నామెతో చెప్పుము. ఆమె యేడ్చినను, నన్నము తినకున్నను నిందు నాదోషమేమి కలదు? పెన్నంటినుండి వెడలఁగొట్టియైన సుఖముగ నుండఁగూడదా? కడుగొప్ప పేర్మిచూపింప బయలుదేఱినది. నేస్త్రీల స్వభావము బాగుగ నెఱుఁగుదును.

పరిచారిక వెడలిపోయెను. దానితో మాట్లాడుచుండఁగనే యాతని గుండెలు చల్లఁబడసాగెను. ఈ కపటాభినయము చేయుటకై తన మనోభావములఁ నణఁచుకొనుటకు తగినంత దార్ఢ్య మాతని యందు లేకుండెను. ఈకుటిల వ్యవహారమును వీలైనంత త్వరగ పూర్తిచేయుట కాతని యాత్మాభిమానము బలవంత పెట్టుచుండెను. కాని దీని పరిణామ మేమగునో! శ్యామల యీ యాఘాతమును సహింపఁగలుగునా? నేఁటి వరకాతఁడు మృత్యువును దలంచుకొనునపుడే యన్యప్రాణి విషయమును యోచించియుండ లేదు. నేఁడా యోజన యాకస్మికముగ మనమున నుద్భవించెను. తనజీవితముతో మఱొక ప్రాణిజీవితము ముడిపెట్టఁబడి యుండెనని యాతనికిఁ దోఁచెను. శ్యామల తన నిష్ఠురతయే నా ప్రాణములఁ దీసినదనుకొనును. ఈమాట దలం

చుకొని యీమె కోమల హృదయము బ్రద్దలు కాకుండునా? ఆమె జీవితమిప్పటికిని సంకటమునందున్నది. మాటి మాటికిని శంకింపఁబడుచు, తానే నా మృత్యువునకు మూలకారణమని యోచుకొనుచు నామె యెంత కాలము జీవింపఁగలుగును?

భార్గవుఁడు మంచముపై పండుకొని దుప్పటి కప్పుకొనెను. అతనికి చలిమాత్ర మాగకుండెను. గుండె లదరిపోసాగెను. క్షణములో తీవ్రజ్వరము వచ్చెను. అతనికి స్మృతి తప్పెను. ఆ యచేతన దశలో నాతనికి వివిధములగు కలలు వచ్చెను. అంతలో నలికిపడును కన్నుతెఱచి చూచును. తిరిగి స్మృతి తప్పి పడిపోవును.

ఇంతలో తన తండ్రి యలికిడి విని యాతఁడదరిపడెను. అవునాతని తండ్రియే. అతఁడు దుప్పటి నావల పాఱవైచి క్రింద నిలువఁబడెను. ఆక్షణమున తండ్రి పాదములకడ నాతని కాత్మార్పణముఁ గావింప బుద్ధిపుట్టెను. నేను మరణించిన నీయనకు నిజముగ సంతోషము కలుగునని పించెను. నేనింక నెంత సేపటికి మరణింతునో చూచుటకే యీయన వచ్చియుండు నని యాతఁడు తలంచెను. శివరావాతని చేయిపట్టుకొనెను. అతఁడు పడకుండ పట్టుకొని—నీశరీర మందెట్లున్నది బాబూ! ఏల పండుకొనవు? పండుకొనుము. నీవు నిల్చియుంటివా?

భార్గ:—నాయారోగ్యము చాల బాగుగ నున్నది. మీరనవసరముగ శ్రమపడి వచ్చితిరి.

శివరావు జవాబీయలేదు. కుమారుని స్థితి జూచి యాతని కన్నుల నీరు తిరిగెను. ఎవనిఁ జూడఁగనే యుల్లాస

ముదయించుచుండెనో అతఁడే చిక్కి శల్యమై యుండెను. ఐదారు దినములలో నాతఁడు గుర్తు పట్టలేనంత మారిపోయెను. శివరావతనిని జాగ్రత్తగ పరుండఁబెట్టి దుప్పటి కప్పి సేవ చేయవలెనా అని యాలోచింప సాగెను. పిల్లవాఁడు చేయి దప్పిపోఁడుగదా. ఈమాటఁ దలంచుకొనిన కొలఁది నాతని గుండె తఱుగుకొని పోవుచుండెను. అచటనే యొక బల్లపై కూర్చుండి వెక్కి వెక్కి యేడువ సాగెను. భార్గవుఁడు సైతము దుప్పటి కప్పుకొని యేడువసాగెను. కొలఁది దినముల క్రిందట నాతనిచూచుకొని తండ్రిహృదయముప్పొంగుచుండెను. కాని నేఁటి దారుణస్థితినిఁజూచి యాతని నింటికిఁ గొంపోవుదునా వలదాయని యాలోచింపసాగెను. ఇచట వైద్యము జరుగదా ? నేనిచటనే యిఱువదినాలుగు గంటలు కనిపెట్టుకొనియుందును. డాక్టరుగారుండనేయున్నారు. కష్టమేముండును ? ఇంటియొద్ద తలఁచుకొనినకొలఁది కష్టములే యాతనికి గోచరించుచుండెను. అన్నిటికంటె మించినకష్టమింటియందు శ్యామల యహర్నిశలాతనియొద్ద కూర్చుండియుండును. తానామెనువలదని నివారింప వీలుండదు. ఇది యాతని కసహ్యముగనుండెను.

ఇంతలో నిరీక్షకుఁడరుదెంచి, మీరీతనినింటికిఁ గొంపోవుట యుక్తమని నాయభిప్రాయము. బండియుండనే యున్నది కాన నిబ్బందిలేదు. ఇచట సరియైనచికిత్స జరుగుట దుర్లభము.

శివరావు :—అవును. నేనుసైతమా యభిప్రాయముతోడనే వచ్చియుంటిని. కాని యీతని పరిస్థితిఁజూడ విషము

ముగనున్నది. ఏమాత్ర మశ్రద్ధజరిగినను మన యధీనము తప్పిపోవును.

నిరీక్షకుఁడు :—ఇచటనుండి యీతనిని కదలించుటలో నంత యిబ్బందిలేకపోలేదు. కాని యింటియొద్ద లభింపగల విశ్రాంతి, యుపచారములిచట లభ్యమగుట యసంభవ మని మీకుఁదెలియని విషయముకాదు. పైఁగా నస్వస్థులగు బాలకుల నిచట నుంచగూడదను నిషేధము స్థిరముకలదు.

శివరావు :—మీారవసరమన్నచో ప్రధానోపాధ్యాయుల యను మతిని పొందెదను. ఈతని స్థితియందిచటనుండి తీసి కొనిపోవుట నాకావంతయు మనస్కరించుటలేదు.

నిరీక్షకుఁడు ప్రధానోపాధ్యాయుని పేరువినఁగానే యాతఁడు తన్నుభయపెట్టఁదలఁచు చుండెనని యనుకొనెను. మొగము చిట్లించుకొని ప్రధానోపాధ్యాయుఁడైనను నియమ విరుద్ధముగ పోఁజాలడు. నేనింతటి బాధ్యత నెత్తుకొనలేను.

అయిన నిపుడేమిజరుగవలెను ? ఇంటికి తీసికొనిపోక తప్పదా? తీసికొనిపోయినచో స్వాస్థ్యము మఱింత చెడుననను నెవ మున నచటనుంచదలంచెను, ఇచటనుండి కదలించి వైద్యాలయ మునకుఁ దీసికొనుపోవుటకుఁ దగినకారణమేమియును లేకుండెను వినినవారందఱును వైద్యునికి సొమ్మీయవలసి వచ్చునను భీతిచే వైద్యాలయమున బిల్లవానిని పాలువైచివచ్చెనని నిందింతురు. కాని యిపుడు వైద్యాలయములోఁ జేర్పుటకన్న వేఱుపా యము లేకుండెను. నిరీక్షకుఁడా సమయమున లంచము

తీసికొనఁదలంచిన రెండు మూఁడువత్సరముల జీతము ముట్టియుండును. కాని నీతినియమములకు లొంగిన బల హీనులకంత తెలివియెట్లుండును! శివరావునకవుడు భార్గవుని తీసికొని వెళ్ళకుండుటకేదైన నెపమును జూపఁగలుగు వాఁడె వఁడైన నుండిన జీవితాంత మతనికి కృతజ్ఞుఁడుగా నుండెడి వాఁడు ఆలోచించుకొనుటకైన నతనికిఁదగినంత సమయము లేకుండెను. నిరీక్షకుఁడు యమదూతవలె వెన్నంటి యుండెను. వివశుఁడై శివరావు బండీవాలువారి నిద్దరిని పిలిచెను. అందఱును భార్గవున త్తి బండిలో నుంపసాగిరి. భార్గవుఁడర్ధ చేతనావస్థలో నులికిపడి—'ఏమిది? ఎవరు'ని యడిగెను.

శివ:—ఎవరును లేదు నాయనా! నేను నిన్నింటికిఁ గొంపోవ వచ్చితిని. రమ్ము తండ్రీ! ఒడిలోఁ బెట్టుకొందును. ఇచటనుండుటకు వీలులేదు. ఇచటి నియమము లట్టివి.

భార్గ:—ఏమైన నచటికిరాను. నన్ను మఱెచటికైనఁ గొం పోకండు. ఏ చెట్టునీడకైన నేపాకలోనికైనఁ దీసికొని పోండు. ఇంటికిమాత్రము వలదు.

నిరీక్షకుఁడు శివరావుతో—మీరీమాటలను లక్ష్య పెట్టకుఁడు. ఇతఁడొడ లెఱుంగని స్థితియందున్నాఁడు.

భార్గ:—ఒడలెఱుంగని దెవరు? నేనేనా? ఎవరినైనఁ దిట్టు చుంటినా? కఱచుచుంటినా? స్మృతియుండేల లేను? నన్నిచటనే పడియుండనిండు. జరుగవలసినదేదో యిచ టనే జరుగఁగలదు. లేకున్న నన్ను వైద్యాలయము నకుఁ గొంపొండు. అచటనైన పడియుందును. బ్రతుక

వలసియుండిన బ్రతికెదను. చావవలసియున్న చచ్చె
దను. అంతేగాని యింటికిమాత్రమురాను.

ఈఅవకాశము గొదిగొని శివరావు నిరీక్షకుని మరల బ్రతి
మాలుకొనసాగెను. కానినియమబద్ధుఁడగు నానిరీక్షకుఁడేమియు
లొంగకుండెను. ఇదే అంటురోగమై యితరబాలురకు వ్యాపిం
చిన నెవఁడు బాధ్యత వహింపఁగలఁడు ? ఈవాదము ముందు
శివరావుమాటలు బొత్తుగ సాగకుండెను.

కడకు భార్గవునితో శివరావు—'నాయనా ! ఇంటికేల
రానందువు ? అచట నీకన్నివిధములుగ వీలుగనుండునే.' శివ
రావు మాటవరుస కాతని నిట్లడిగనే కాని కర్మముచాలక
యొప్పుకొనునేమో అని భీతినందుచునే యుండెను. భార్గవు
నానువ్రతికిఁ గొంపొవుటకతఁడేమైన నెపముకొరకై వెదకుచుండెను.
దానిబాధ్యతనంతను భార్గవుని నెత్తినే రుద్దఁజూచుచుండెను.
ఆపైనిదియంతయు నిరీక్షకుని సమక్షమున జరుగుచుండుటచే
అతఁడు సాక్షిగ నైతముండును భార్గవుఁడు తన మొండిపట్టు
దల వలననే యానువ్రతి కేఁగుచుండెనని అతఁడు చెప్పఁ
గలఁడు. ఇందులో శివరావు దోషమావంతయును లేదు.

భార్గవుఁ డగిరిపడి—లేదు. లేదు. నేను మువ్రతికి
రాను. నేనింటికి రాను. నన్నానువ్రతికిఁ గొనిపొండు. ఇంటి
వారెవరును రాకుండ కట్టుదిట్టము చేయుఁడు. నాకేమియును
జబ్బులేదు. బొత్తుగ లేదు. మీరు నన్ను వదలుఁడు. నేనే స్వయ
ముగ నడువఁగలను.

అతఁడున్మత్తునివలె లేచి వాకిలివైపునకు నడచెను. కాళ్ళు తొట్రుపడుచుండెను. శివరావు పట్టుకొనకున్న క్రింద పడి పెద్ద గాయము తగిలియుండెడిది. నౌకర్ల సాయముతో శివరావతనిని బండియొద్దకుఁ దెచ్చి లోనఁ గూర్చుండబెట్టెను.

బండి వైద్యాలయము వైపునకు నడచెను. శివరావు కోరకొని నట్లే జరిగెను. ఈదుఃఖము నందాతని మనము తృప్తముగ నుండెను. కుమారుఁడు తన యిచ్ఛానుసారము వైద్యాలయమున కేగుచుండుట అతని కింటితో సంపర్కము లేకుండుటకుఁ బ్రబల తార్కాణముకదా! భార్గవుఁడు సద్దోషి యనుట కింతకంటె నేమి ప్రమాణము కావలెను? తానాతని యెడ నకారణముగ సందేహపడుచుండెను.

క్షణములో నితృప్తికి బదులాతని మనమున దుఃఖ మావరించెను. అతఁడు ప్రాణసమానుఁడగు కుమారు నింత దుర్దశయందు సైతమింటికిఁ గొంపోక వైద్యాలయమునకు తీసి కొనిపోవుటయా? అతని ప్రాణములు నష్టపడునప్పుడు సైతము తన విశాల భవనమునం దాతనికి జానెడు చోటు లేకపోయెనా! ఎంత విచిత్రము!

మఱొక్క క్షణములో శివరావు మనమున కర్మము చాలక యీ విషయమంతయు భార్గవుఁడెఱుంగఁడు గదా అను ప్రశ్న యుదయించెను. ఇందుచేతనే యాతని కిల్లన్న ద్వేషము జనింపలేదుకదా? అంతే యగుచో నన్నియు తలక్రిందగును.

ఆ యనర్థకల్పన మాత్రమననే శివరావాపాదమస్తకము కంపించిపోయెను. గుండెలు టకటక కొట్టుకొనసాగెను.

హృదయమునకు తీవ్రమైన దెబ్బ తగిలెను. ఈ జ్వరమున కిదియే కారణమగుచో పరిణామము దైవమునకే యెఱుక. ఈసమయమున నాతని స్థితి మిక్కిలి శోచనీయముగ నుండెను. తన కొంకరలు పోయిన చేతులు కాచుకొనుటకు రాజేసికొనిన అగ్నియే తన గృహమును కాల్చివేయుచుండెను. ఈదయాశోక పశ్చాత్తాప సందేహములతో నాతని చిత్తము క్షోభించుచుండెను. ఆతని గుప్తరోదనము బయటికి వినిపించుచో వినువారలు వెక్కి వెక్కి యేడ్చెదరు. అతని యశ్రువులు బయల్వెడలినచో ప్రవాహమైపాఱును. అతఁడు నిస్తేజమై వెల్వెలబాఱు పుత్రుని మొగమువంక వాత్సల్యపూర్ణముగఁ జూచెను. వేదనా విచలితుఁడై యాతనిఁబొమ్మున హత్తుకొనెను. శోకవేగమున నాతనికి వెక్కిళ్ళు రాసాగెను.

ఎదుట వైద్యాలయము సింహద్వారము కనిపించుచుండెను.

---

## ఏకాదశ ప్రకరణము

---

సాయంకాలము శివరావు కచేరినుండి యింటికిరాఁగానే పిల్లవానిస్థితి యెట్లుండెనని శ్యామల నడిగెను. శ్యామల ముఖముపై నామమాత్రమునకైనను చింతాశోకములు లేకుండెను. ఆమె యలంకరణ మెప్పటికన్న నిను మిక్కిలిగ

నుండెను. ఇదివఱకు చంద్రహారము కంఠమున ధరింపనిది నేఁడదియు కంఠమున విరాజిల్లుచుండెను. ఆమెకు నొడ్డాణమన్నను పూర్వమంతగ నిష్టము లేకుండెను కాని నేఁడది సన్నని జలుగుపట్టుచీరపై నూత్న శోభలీనుచుండెను.

శివరావు మొగము త్రిప్పుకొని-'జబ్బుగానున్నది. ఇంకేమి కల'దనెను.

శ్యామల :—మీరు వానినితీసికొని రానేగిరిరి గదా.

శివరావు విదలించుకొని- 'వాఁడు రానిది నేనేమి చేయుదును? నేను బలవంతముగ నీడ్చుకొని రాలేనుగదా? నాయనా! యింటికిరమ్ము. నీకచట నేయిబ్బందియు నుండదని యెంతవచ్చెఁ జెప్పినను వినలేదు. ఇంటిమాట వినవలెంది నాతనిజ్వరము హెచ్చు పెరిగిపోవుచుండెను. నేనిక్కడనే మరణింతునుగాని యింటికిరానని మొండిపట్టుపట్టెను. చివరకు విధిలేక వైద్యాలయమునందుఁ జేర్చివచ్చితిని. ఏమిచేయుమందువు?'

వియ్యమ్మ సైతమువచ్చి వంచలోనిలువఁబడి "వాఁడు జన్మతః చాల మొండివాఁడు. చూచుచుండుఁడు. వాఁడిక్కడికి రానురాఁడు, అక్కడ వానికి నయమును కా"దనెను.

శివరావాతురతతో—నీవు నాలుగైదు దినములచటికి వచ్చిన బాగుగానుండునక్కా! నీవున్న నాతనికి కొంతమనశ్శాంతి కలుగును అక్కా! నా ప్రార్థన మంతయాలకింపుము. వాఁడొంటరిగ నేడ్చియేడ్చి ప్రాణములు వీడును. అమ్మా యమ్మా యని నిరంతర మొక్కటే యేడ్పు. నేనచటనే పడియుందును. నీవును

నాతో బయలుదేఱుము. వానిపరిస్థితి బాగుగలేదు. ఆ యూ కారమే లేదు. దైవకృప యెట్లున్నదో యేమో శివరావు కన్నులనీరునిండెను. కాని వియ్యమ్మ యవిచలితభావముతో నేవచటనున్న నా బంగారువాయన దగ్గఱ నేని యిదే పరుగెత్తి కొని వచ్చెదను. కాని నామాటమాత్రము నమ్ముము. వాని కచట నయమగుటకల్ల. నేను వానిని సంపూర్ణముగ నెఱుంగు దును. వానికి జబ్బేమియును లేదు. ఇంటినుండి వెడలఁగొట్టఁ బడితినను దుఃఖమే జ్వరరూపమునఁ బీడించుచున్నది. నీవు లంఘ నములు వేయుము. సివిలుసర్జనుకైనఁ జూపుము. అతనికి మాత్రమచట నయముకాదు.

శివ:—ఇంతకు నాతని నింటినుండి వెడలఁగొట్టిన దెవరమ్మా! చదువుకొనుమని నేనే ఛాత్రాలయమున కంపితినంతియే కదా!

వియ్యమ్మ:—నీవేయుద్దేశముతో నంపినను నాతని మనము క్షోభించిపోయినది నామాట యిపుడెవరికిని లెక్క లేదు. నాకధికార మెంతకన్నను లేదు. నీవు యజ మానుఁడవు. నీభార్య యజమానురాలు. నేను గుప్పెఁ డు మెతుకులకై యీయింటఁబడియున్న యనాథను. నా మాట యెవరువిందురు! లక్ష్యమెవరికి! అట్లని నోరు మూసికొని యుండఁజాలను. భార్గవుఁడింటికి వచ్చినఁ గాని బాగుపడఁడు నీవు మొదటివలె నాతనిపట్ల ప్రేమ జూపినఁగాని కోలుకొనఁడు.

విద్యమ్మ అచటినుండి వేగముగ వెడలిపోయెను. తన జ్యోతిర్విహీనములును ననుభవపూర్ణములునగు కన్నులయెదుట నామె కన్నవిషయములును, స్వభావములును మూర్తీభవించి నట్లుండెను. ఈపాప భారమంతయు నామె శ్యామలనెత్తిఁ రుద్దుచుండెను. ఈదేవి యింటనుండు నంతవఱ కీయింటిదుర్గతి యింతియే యని నోటివఱకు వచ్చినమాట నామె ప్రయత్న పూర్వకముగ నాపుకొనినను దాని యాశయము మాత్రము శివ రావునకు బోధపడక పోలేదు. విద్యమ్మ వెళ్ళిపోయిన తరు వాత శివరావు శిరమువంచి యాలోచించుకొన సాగెను. అతనికి తనపై నమితకోపము వచ్చుచుండెను. ఎదుటనున్న గోడను తలపగులఁగొట్టుకొందమనిపించెను. తాను వివాహమేల యాడవలెను? అసలు వివాహమేమంత అవసరము? దైవమాత నికి నొకరుకాదిద్దరుకాదు ముగ్గురుకుమారుల నొసఁగియుండెను. వయస్సుకూడ సుమారేఁబది సంవత్సరములువచ్చెను. ఇంక తానేల పెండ్లియాడవలెను? దైవమీయామిషతోఁ దనసర్వనాశ మొనరింపనెంచెనా? అతఁడు కన్నెత్తి సాహసయుక్తమును, నిశ్చలమునగు శ్యామలరూపము దరికించెను. ప్రపంచమును నరకుగొనిన యామె యా యాకృతినిఁజూచి శాంతచిత్తుడయ్యె ను. ఎన్నిదినముల తరువాతనో యాతనికట్టి శాంతచిత్తము సమకూరినది. ప్రేమపీడితహృదయ మిట్టిస్థితిలో నింతశాంతము గను, నవిచలితముగను నుండఁగల్గునా? లేదెన్నఁటికిని లేదు. హృదయక్షోభము భావకౌశలమున నణఁగుపడఁజాలదు. తన మనోదౌర్బల్యమునకా క్షణములో నతనికెంతయో బాధకలి

గెను. తా నకారణముగ సందియమునకు తావొసంగి యింతటి యనర్థమును కొనితెచ్చుకొనెను. అతనిమనస్సు భార్గవుపట్ల కూడ నిశ్శంకమయ్యెను. కాని యానందేహమునకు బదులు మఱియొక సందేహము బాధింపఁ జొచ్చెను. భార్గవుఁడిది అంతయుఁ దెలిసికొనలేదుకదా? తెలిసికొనియే యింటికి రాకను చుండెనేమో! అతనికీ విషయము తెలిసినట్లైన మహానర్థము సంభవించును. ఈయూహయే అతనిని కంపించి వైచెను. శరీర మంతయు శిథిలమై వశము తప్పెను. అతఁడు బండివానిని వేగ ముగా బండితోలుమని హెచ్చరించెను. అతని హృదయా కాశము నావరించిన సందేహమేఘ పటలములన్నాళ్ళకు నేఁడు పటాపంచలయ్యెను వెలుఁగు కిరణములు లోనుండి తఱుము కొని వచ్చుచుండెను. బండివాఁడు నిద్రపోవుటలేదు కదా యని యతఁడు బైటికి తలపెట్టి చూచెను. గుఱ్ఱమింత నెమ్మదిగ నడ చుట పూర్వమాయన మెన్నఁడు నెఱుఁగఁడు.

వైద్యాలయముఁ జేరుటతోడనే యతఁడు భార్గవుని వైపున కుఱికెను వైద్యుఁడు చింతామగ్నుఁడై అతని ముందు నిలిచియుండెను. శివరావు చేతులు, కాళ్ళు చచ్చుపడెను. గద్గదస్వరముతో.—'నెట్లున్నది డాక్టరుగారూ!' అని యడి గెను. అడుగుటతోడనే యేడ్వనారంభించెను. డాక్టరు జవాబు చెప్పుటకు రవంత యాలస్యము చేయఁగా నతని ప్రాణము లెగిరి పోయె ననిపించెను. అతఁడు మంచముపై నాసీనుఁడై యొడలు మఱచిపడియున్న కుఱ్ఱవాని నొడిలోని కెత్తుకొని పిల్లలవలె వెక్కి వెక్కి యేడువ సాగెను. భార్గవుని యొడ లినుప

పెంకువలె కాలిపోవుచుండెను. అతఁడొక పరి కన్నెత్తి చూచెను. ఎంత భయోత్పాదకమగు దీనదృష్టి! శివరావు పిల్లవానిని కౌఁగిలించుకొని డాక్టరుతో 'విషయమేమో చెప్పక మౌనముద్ర వహించితిరేమ'ని అడిగెను.

డాక్టరు సంక్షిప్తముగ—'ఉన్నపరిస్థితి తాము చూచుచునేయున్నారు. నూటయారు డిగ్రీల జ్వరమున్నది. ఇంక నేను చెప్పవలెను? ఇంకను జ్వరము ప్రకోపించుచున్నది. నాచేతనైనంత వఱకుఁ జేయుచున్నాను. దైవకృప యెట్లున్నదో. మీరు వెళ్ళినప్పటినుండి నేనొక క్షణమైన నిచటినుండి కదలలేదు. భోజనమునకైన పోజాలకుంటిని. ఇది మహాజ్వరము స్మృతియే లేదు. ఒక్కక్షణములో నేమి జరుగునో చెప్పఁజాల. అంతవిషమపరిస్థితి సంభవించినది. ఉండియుండి మైకము క్రమ్ముచున్నది. ఇతని నింటియందెవ్వరైన దూషించిరాయేమి! మాటిమాటి కమ్మా! నీవెచట నుంటివను మాటయే.

వైద్యుఁడిట్లు మాట్లాడుచుండఁగనే భార్గవుఁడాకస్మికముగ లేచి కూర్చుండి శివరావును మంచముపైనుండి నెట్టివేసి యున్మత్తస్వరముతో 'నన్నేల గద్దింతురు? నన్ను మీరే చంపుఁడు. ఇప్పుడే చంపుఁడు. కానిండు కత్తి లేదా? ఉరిత్రాడైన నున్నదా అదియును లేదా? నేను నాకంఠమును ధరింతును. అమ్మా! నీవెక్కడనుంటివో గదా!' అని తిరిగి యచేతనుఁడై పడిపోయెను. శివరావు క్షణముసేపు శిథిలాంగుఁడై పడియున్న పుత్రునివంకఁ వ్యథితనేత్రములతోఁ జూచెను. వైద్యుని రెండు చేతులుపట్టుకొని అత్యంత దీనముగ—అయ్యా! యీకుఱ్ఱవానిని

రక్షింపుఁడు. దైవసాక్షిగ రక్షింపుఁడు. లేకున్న నాసర్వస్వము నాశనమైపోవును. నేను భాగ్యవంతుఁడను గానుగాని యేమి మ్మన్న నదితెచ్చియిచ్చెదను. వీనిని మాత్రము రక్షింపుఁడు. మీరు పెద్ద పెద్దవైద్యులను పిలిపించి సలహాగైకొనుఁడు. వీని యీస్థితి చూడఁజాలను. నేనెంతయైన ధనము వెచ్చింతును. అయ్యో! కుమారా!

వైద్యుడుజాలిపడి—బాబూ! నేను మీకు యథార్థము వచించుచున్నాను. నేనతనికి చేయఁదగినదంతయుఁ జేయు చుంటిని. మీరితర వైద్యుల సలహాలను సైతము తీసికొనుమను చున్నారు గాన నట్లే కావింతును. ప్రసిద్ధవైద్యులందఱిని పిలి పింతును. కాని మీకిదమిత్థమని యేమియు ధైర్యముచెప్ప లేను. పరిస్థితి అత్యంత విషమముగ నున్నది.

శివరావేడ్చుచు—వద్దు డాక్టరుగారూ! ఆమాట నోట రానీయవద్దు దైవము నన్నింత చిన్న చూపు చూడఁడు మీరు చెన్నపట్టణమునుండి కలకత్తానుండి వైద్యులను పిలిపిం పుఁడు. నేనామరణము మీసేవఁ జేయుదును. వీఁడే నాకు దీపకుఁడు. వీఁడే నాజీవితాధారము. నాహృదయము బ్రద్దలగు చున్నది. వీనికీమైకము తప్పిపోవుటకేదేని మహౌషధముఁ నిండు. నన్నుగుర్తుపట్టినామాటలు తెలిసికొనఁ గలుగనట్లు చేయుఁడు. అట్టి సంజీవని వంటి మహౌషధ మేమియును లేదా? నేను వీనితో నాలుగైదుమాటలు మాట్లాడవలెను.

శివరావావేశముతో భార్గవునికడకేగి—'నాయనా! కన్నులు తెఱచి చూడుము. నేను నీకడకూర్చుండి యేడ్చుచున్నాను. నీవన్న నాకేమియు దుర్భావనలేదు. నాహృదయము నీపట్ల నిశ్శంకమైనది'.

వైద్యుడు:—తిరిగి మీయనర్గళధోరణి ప్రారంభించితిరా! అయ్యా! మీరుపిల్లలుకారు, వయస్సువచ్చినవారు ధైర్యముగ నుండవలెనుగాని........

శివ:—సరే డాక్టరుగారూ! ఇఁక నేను నోరెత్తను. పొరపాటైనది. మీయిష్టమువచ్చినట్లు చేయుఁడు. నేనంతయు మీకే వదలివైచితిని. ఈతనిపట్ల నాహృదయము నిష్కళంకమైనదని తెలుపుటకేదేని యుపాయము లేదా? పోనీ మీరే చెప్పివేయుఁడు డాక్టరుగారూ! మీరే చెప్పివేయుడు. నీ యభాగ్యుఁడగు తండ్రి నీకడ కూర్చుండి యేడ్చుచున్నాఁడనియు, నతని హృదయము నీపట్ల మిక్కిలి స్వచ్ఛమైనదనియు, నీపైఁ బెరిగిన భ్రమలన్నియుఁ దొలఁగిపోయినవనియుఁ దెల్పుఁడు. ఇంతియే. నాకింకనేమియు నక్కఱలేదు. నేను మెదలకుండ కూర్చుండెదను. నోరైన కదల్పను. కాని తాము మాత్రము తప్పక యీమాటఁ జెప్పవలెను.

డాక్టరు:—బాబూ! మీపెద్దలకో నమస్కారము. దయయుంచి మాటలఁ గట్టిపెట్టుఁడు. లేకున్న విధిలేక మిమ్మావలికిఁ బంపివేయవలసివచ్చును. నేనాధీనునకుఁబోయి తుణ

ములో నితరవైద్యులకుఁ గబురుపెట్టి వచ్చెదను. నిశ్శబ్దముగఁ గూర్చుండవలెను జాఁడీ!

డాక్టరు దయానిధాన్యుఁడు. కాకున్న నేతండ్రి చెట్టంత తనకుఱ్ఱవాని నిట్టి దుర్దశయందుఁ జూచి సహింపఁగలఁడు ? శివరావు వస్తుతః కుక్కలి గంభీరుఁడు. ఇప్పుడు కుర్యోగ్యామిత్రో యనినంతమాత్రమున నేమియు మేలుజరుగదని యతనికిఁ దెలియక పోలేదు. అయినను నాతఁడాసమయమున శాంతముగ కూర్చుండఁజాలక పోయెను. ఇది కేవలము రోగమియగుచో నతఁడు ధైర్యముగనుండెడివాఁడు. తానే వైద్యులఁ బిలిపించెడి వాఁడు. ఇతరులకు నచ్చఁజెప్పెడివాఁడు. అన్నిపనులను మెలకువతో నిర్వహించెడివాఁడు. కాని యీదుర్దశకు దానేకారణమని యోచింగి యోచింగి, యీ విపత్తు తానేమొట్టించినదని తెలిసి తెలిసి యే పితృహృదయము వ్రజకాఠిన్యము వహింపఁగలదు ? అతని మేనఁగల ప్రత్యణువు నాతని ధిక్కరించుచుండెను. 'నాకీదుర్భాషణ జనింపనేల'యని యాతఁడు పశ్చాత్తప్తుఁడగుచుండెను. ప్రత్యక్ష ప్రమాణములేకయే నేనింత ఘోరము నెట్లూహించి విశ్వసించితిని ? అవును తానావరిస్థితులందేమి చేయవలయున ? తాను చేసినదానికంటె భిన్నముగఁ జేయవలసినది యాతనికిఁ గోచరింపలేదు. వాస్తవమునకు వివాహబంధమే చేసేత మెడకుఱ్రితాడు బిగించుకొనుటయైనది. ఇదే యన్ని యాతనలకును మూలకారణము.

నేనేమియు విచిత్రపువని నాచరింపలేదే! స్త్రీపురుషులందఱును వివాహమాడెదరు. వారి జీవితము లానందముగనే

గడచును. అనందమునకేగదా వివాహమాడుట. ఈ బజారు నందెందఱు రెండు, మూఁడు, నాల్గు పెండ్లిండ్లు చేసికొనలేదు. ఏడవవివాహము సైతము చేసికొన్నవారు లేకపోలేదే. వారి వయస్సుకూడ నాకంటె నధికమే యగునే. కాని వారు బ్రతికి యున్నంతకాలము సుఖముగనుందురే. అందఱును భార్యలకన్న ముందు మరణించుట యనునది సైతము లేదు. రెండుమూఁడు పెండ్లిండ్లు చేసికొనినవారు సైతము భార్యపోయినవారెంతో మందికలరు. అందఱు నావలెనే బాధపడుచుండిన నేల వివాహ మాడెదరు? నాతండ్రిమాత్ర మేఁబదియైదవయేట వివాహము చేసికొనలేదా? నాపుట్టుక కాయనవయస్సెఱువదికిఁ దక్కువ కాదు. కాని యప్పటికి నిప్పటికి కొంచెముభేదము లేకపోలేదు. పూర్వస్త్రీలు చదువుకొనినవారు కారు. పతియెట్లున్నను భార్య యాతనిని పూజ్యునిగ నెంచుచుండుటో లేక పురుషుఁడు సిగ్గు విడిచి యట్లు ప్రవర్తించుటో జరుగుచుండెను. యువకుడు ముసలిదానితో తృప్తిఁజెందనప్పుడు యువతిమాత్రమేల ముదుసలిఁజూచి సంతసించును? కాని నేనంత ముసలివాఁడను కానే! నన్నుఁజూచి యెవరును నలుబదికి మించినవనుకొనరు. ఏదియెట్లున్నను యౌవనము పోయినపిదప యువతిని పెండ్లియాడిన నెంతోకొంత సిగ్గువిడువవలసి వచ్చును. స్త్రీలు స్వభావసిద్ధముగ లజ్జాశీలలైయుందురు. కులటలవిషయము వేఱు. సాధారణముగ స్త్రీలు పురుషులకన్న నెక్కువ సంయమశీలలు. తగిన వరుడు లభించిన స్త్రీ పరాయినుగ వానితో నవ్వులాటలు, పరిహాసములు నాడునేమో కాని యామె హృదయముమాత్రము

సాధారణముగ నిర్దోషముగ నుండును. ఈకుజోడు కాని సంబంధము జరిగినపుడామె కన్నెత్తి యితరునివంకఁ జూడకున్నను మనమున మాత్రము దుఃఖింపక తప్పదు. మొదటిది రాతిగోడ. వర్షించినకొలది గట్టిపడును. రెండవది బోలుమట్టిగోడ. ఇట్టే నీరుపడఁగనే కరగిపోవును.

ఆలోచించుచుండఁగనే శివరావునకు కునుకుపట్టెను. అతని మనోభావములే తాత్కాలికముగ స్వప్నరూపముఁ దాల్చెను. మొదటిభార్య భార్గవుని యెదురుగనిలువంబడి స్వామీ! ఇదేమిట్లుచేసితిరి? నేను రక్తమునోడ్చి పెంచుకొన్న బిడ్డనింత నిర్దయముగ చంపివేసితిరా? ఇంత యాదర్శయువకునిపై నింతటి ఘోరకలంక మాపాదింతురా? ఇప్పుడేడ్చి మొత్తుకొని ప్రయోజనమేమి? మీరే వానిని చేతులారఁ జంపితిరి నేను మీనిర్దయ హస్తములనుండి లాగికొని నావెంటఁ గొంపోవుచున్నాను. మీరింత సందేహ పడుటిదివఱకులేదే. వివాహముతోపాటు సందేహమునుగూడ మెడకుఁగట్టుకొంటిరా? ఈ కోమలహృదయముపై నింతటి కఠోరాఘాతమా? ఇంతటి భీషణకలంకమా? ఇంత అవమానము సహించి యేసిగ్గులేనివారోగాని జీవింపఁజాలరు. నాపుత్రుని కది చేతకాదు. ఆమెయట్లనుచునే పుత్రునొడిలోఁ గూర్చుండబెట్టుకొని కొంపోయెను. శివరావేడ్చుచు నామె యొడినుండి పుత్రుని తీసికొనుటకుఁ జేతులఁ జాచుచు, కన్నులు తెఱచెను. ఎదురుగ నైదారుగురు వైద్యులు నిలిచియుండిరి.

# ద్వాదశ ప్రకరణము

మూఁడు దినములు గతించినను శివరావింటికి రా లేదు. విద్యమ్మ రెండు పూటలపోయి భార్గవునిఁ జూచి వచ్చుచుండెను. ఇద్దరు పిల్లలు సైతమేగుచుండిరి. శ్యాముల యెట్లు పోవును? ఆమె కాళ్ళకు సంకెలలు వేయఁబడి యుండెను. అమె భార్గవుని శరీర పరిస్థితులను వినుటకెంతో యాతురతనుఁ జెందుచుండెను. విద్యమ్మ నడిగిన నామె కోపమున దెప్పి పొడుచును. పిల్లల నడిగిన తలయు తోఁకయులేని మాటల బల్కెదరు. స్వయముగ నొకమారు పోయి చూడవలెనని యామె మనము వ్యాకుల పడుచుండెను. సందేహము శివరావు పుత్ర ప్రేమను శిథిలమొనరించెనేమోయనియు, నాతని కృపణత్వము భార్గవుని చికిత్సకు బాధాకరమయ్యెనేమో యనియు నామె భయపడుచుండెను. వైద్యులెవరి వారునుఁ గారు వారికి డబ్బుతోనే సంబంధము. రోగి బ్రతికిననేమి, చచ్చిననేమి. పోయి యామస్త్రీ వైద్యునకు వేయిరూప్యముల మూటనిచ్చి "యెట్లైన నీకుత్రానిని బ్రతికింపుఁడు, మీకిదియే బహుమానము" మనవలెనని తీవ్రముగు కోర్కె జనించుచుండెను. కాని యామె యొద్ద రూప్యములు లేవు. సాహసముంజేకన్న ముందే లేదు. తానిప్పటికైన నచటికేగిన భార్గవుఁడు కుదుట పడును. అతనికి జరుగవలసినంత యుపచారము జరుగుట లేదు. లేకున్న నింత మాత్రపుజ్వరము మూఁడురోజులకైన తగ్గదా

ఇది దేహజ్వరముకాదు. మానసికము, చిత్తము శాంతించినఁ గాని దీని ప్రకోపముతగ్గదు. తానచట నొకరాత్రియంతయు కూర్చుండినచో, భర్త యందులకేమియు నభ్యంతరము పెట్టకున్నచో, మనమున సందియమందకున్నచో, బహుశః భార్గవునికి తనపట్ల తండ్రిహృదయము నిష్కలంకముగనున్నదని తెలిసి యతఁడు శీఘ్రముగ నారోగ్యవంతుఁడు కావచ్చును కాని యిది యెట్లు జరుగును ? తన్నచటఁ జూచిన భర్తసహించి యూరకుండునా ? ఆయన యింకను సందేహమువీడలేదా ? ఇచటనుండి వెళ్లునప్పుడు తనపొరపాటునకు పశ్చాత్తాపపడుచున్నట్లు కనిపించెను. తానువెళ్ళగనే తిరిగి యాయన సందేహాగ్ని ప్రజ్వరిల్లి పుత్రుని ప్రాణముల గ్రసింపదుగదా ?

ఈ వెనుక ముందాలోచనలతో మూఁడురోజులు గతించెను. ఇంటిలో ప్రొయ్యి రాజేయఁబడలేదు. ఎవ్వరును పచ్చిమంచినీళ్లైనఁ ద్రాగలేదు. పూటకూటియింటినుండి యన్నముఁదెప్పించి పిల్లలకుఁ బెట్టిరి. శ్యామల, విద్యున్మాలయు నన్నముమాట నెత్తలేదు. వారి కన్నముపై నిష్టముతప్పినది.

నాల్గవదినమున కేశవుఁడు బడినుండి తిరిగివచ్చుచు వైద్యాలయము మీఁదుగవచ్చెను. శ్యామల—'నాయనా ! వైద్యాలయమునకేగి వచ్చితివా. నేఁటిస్థితిగతులేమి ? మీ యన్న లేచి కూర్చుండెనా' యని యడిగెను

కేశవుఁడు మొగముచిట్లించి—అమ్మా ! నేఁడతడు కదలుట మెదలుట సైతము లేదు. ఊరకమంచముపై కాళ్ళుచేతులు కొట్టుకొనుచు పడుండెను.

శ్యామల ముఖము తెల్లవోయెను ఆతురతతో—'మీ నాయనగారచటలేరా' యని ప్రశ్నించెను.

కేశ:—ఎందుకులేరు? నేఁడాయన యుదేవునిగ నేడ్చుచుండెను.

శ్యామల హృదయము టకటక కొట్టుకొన సాగెను. "వైద్యులక్కడలేరా!" యనియడిగెను.

కేశ:—వైద్యులచటనే నిలువఁబడి సంప్రతించు కొనుచుండిరి. అందరికన్న పెద్దసివిలుసర్జనిఁగ్లీషుభాషలో రోగికి క్రొత్త నెత్తురెక్కించవలెనని చెప్పుచుండెను. ఇది విని నాన్నగారు నా దేహమునుండి యెంతవలయునన్న నంత రక్తము తీసికొనుఁడని పల్కిరి. సర్జను నవ్వి మీరక్తము వలన ప్రయోజనము లేదు. యువకరక్తము కావలెననెను. చివర కతఁడు పిచికారితో నేదో మందన్నయ్యకు చేతికెక్కించెను. ఆనాఁది నాలుగంగుళము లకుఁ దక్కువ లేదు. అన్నయ్య కదలనైన లేదు. నేను భయపడి కన్నులు మూసికొంటిని

మహాసంకల్పములు చాలభాగ మావేశమునందే జనించుచుండును. భయముతో వణఁకిపోవుచుండిన శ్యామల ముఖముపై దృఢసంకల్పముచే నపూర్వశోభ ప్రకాశింపసాగెను. ఆమె తనదేహమునుండి రక్తము నీయ నిశ్చయించెను. ఆమె రక్తమువలన భార్గవుని ప్రాణములు రక్షింపఁబడునేని యామె సంతోషమునకు తుదిమొదళ్ళు వర్ణింపఁగలము. ఇవుడెవరేమనుకొనినను నామె లక్ష్యపెట్టదు. ఆమె కేశవునితో—'నీవు

పోయి వెంటనే యొకబండిని తీసికొనిరమ్ము నేను వైద్యాలయమున కేగెదన' నెను.

కేశ:—అచట నిపుడు చాలమంది యుందురు. రాత్రికి పోవచ్చును.

శ్యా:—కాదిప్పుడే పోవలయును.

కేశ:—నాన్నగారు కోపగింతురేమో?

శ్యా:—కోపపడనిమ్ము. నీవు పోయి వెంటనే బండిదెమ్ము.

కేశ:—అమ్మవారిచేత బండి తెప్పించినదని నేను చెప్పివేచెదను.

శ్యా:—అట్లే చెప్పుము

కేశవుఁడు బండి తెచ్చుటకు పోఁగానే శ్యామల తల దువ్వుకొని జడ వేసికొనెను. దుస్తులు ధరించెను నగలు పెట్టుకొని తాంబూలము వైచికొనెను. వాకిట బండికై నిరీక్షించుచు నిలువఁబడెను.

విద్యున్మ తనగదియందు కూర్చుండి యుండెను శ్యామలనంసిద్ధయైయుండుటఁజూచి 'ఎక్కడికి ప్రయాణము' నెను.

శ్యా:—ఇదే వైద్యాలయమువఱకు పోయివత్తును.

విద్యు:—అచటికేగి యేమిచేసెదవు?

శ్యా:—ఏమియు లేదు. చేయుటకేమున్నది? చేయుట దైవము పని. చూడవలెనని యున్నది.

విద్యు:—నామాటవిని వెళ్ళకుము.

శ్యామల వినయపూర్వకముగ — కేశవునకు నేఁటివఱ స్థితి బొత్తిగ బాగుండలేదని చెప్పెను. పోయి యిప్పుడే తిరిగి వత్తును. లేకున్న మనసాగుటలేదు. మీరుకూడ రారాదా?

విద్యు:— నేను చూచియే వచ్చితిని. బయటనుండి యెవరైన క్రొత్తరక్త మెక్కించినఁ గాని ప్రాణములు దక్కు నాశ లేదనుకొనుము. ఎవరు తమరక్తము నిత్తురు? ఎందుకిత్తురు! ప్రాణభయము లేని దెవరికి!

శ్యామల:— అందుకే నేను వెళ్ళునంటిని. నా రక్తము పనికి రాదా!

విద్యు:— ఎందుకు పనికిరాదు? యువరక్తము కావలెను గదా! కాని పరరక్తముతో బ్రతుకుచు జీవించుటకంటె మరణించుటయే మేలు.

బండి వచ్చెను. శ్యామలయు, కేశవుఁడును పోయి కూర్చుండిరి. బండి బయలుదేఱెను.

విద్యున్మ వాకిట నిలిచి యెంతో సేపు చూచుచుండెను. నేఁడు ప్రథమముగ నామెకు శ్యామలపై జాలి కలిగెను. ఆమెకు చేతనైనచో శ్యామలను నాఁడు బంధించి యుంచెడిది. దయాసానుభూతులామె సప్రయత్నముగ నెంత దూరము గొంపోవుచున్నవో యామె ప్రకటిత రూపమున దృగ్గోచరమగుచుండెను, దురదృష్టవశమున సర్వనాశమార్గమునఁ బట్టిపోవుచున్నది.

శ్యామల వైద్యాలయమునకుఁ జేరునప్పటికి దీపములు వెలిగింపఁబడెను. వైద్యులు తమనలవోల నొసంగి వెడలి

పోయిరి. భార్గవుని జ్వరము కొంచెము తగ్గెను. అతఁడు తదేక దృష్టితో ద్వారమువంకఁ జూచుచుండెను. ఏదేవతా నిరీక్షణ మునకో యాకాశమువంకఁ దృష్టి ప్రసరించుచుండినట్లు తోఁచు చుండెను తానెచట నుండెనో యతనికి తెలియదు.

ఇంతలో శ్యామలను జూచి యాతఁడులికి పడెను. అతని నిశ్చల సమాధి భగ్నమయ్యెను. అతని విలుప్త చైతన్యము ప్రదీప్తమయ్యెను. మఱచిన మాట జ్ఞప్తికి వచ్చినట్లతనికి తన స్థితి తెలియవచ్చెను. అతఁడు కన్నులు విప్పి శ్యామల వంక చూచి మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొనెను.

శివరావు హఠాత్తుగ—'యిచటికేమి చేయ వచ్చితివ'ని ప్రశ్నించెను

శ్యామల నోరు మెదల్పఁజాలక పోయెను. ఏమిచేయ వచ్చితివని గదా? యీ సూటి ప్రశ్నకైన తాను జవాబీయఁ జాలకుండెనా? ఏమిచేయవచ్చితివి? ఇంత క్లిష్ట సమస్య యెవరికైన నెన్నఁడైన నుదయించెనా? ఇంటిలోని పెద్ద పిల్లవాఁడు జబ్బుతో పడియుండఁగ చూచుటకు వచ్చెనని ప్రశ్నింపకున్న తెలియదా? ఈ ప్రశ్న యేల?

ఆమె చేష్టలుడిగి హతబుద్ధియై నిలిచి యుండెను. శివరావు కోపతాపములను పిల్లలిద్దరివలన విని యాయన మనస్సు కఠినమయ్యెనని తలంచెను. ఇపుడది తన భ్రమ యని స్పష్టమయ్యెను. అవును మహాభ్రమ. అశ్రువర్షము సైతము సందేహాగ్ని నార్పఁజాలకుండెనని తెలిసిన నామె

యెన్నఁడును రాకుండెడిది. ఆమె క్రుళ్ళి క్రుళ్ళి మరణించెడిది ! కాని యింటినుండి బయట కాలు పెట్టెడిది కాదు.

శివరావు తిరిగి--'నీవేమి చేయ వచ్చితివ'ని ప్రశ్నించెను.

శ్యామల నిష్పందేహముగ—'మీ రేమి చేయ వచ్చితి ర' నెను.

శివరావు ముక్కుపుటము లుబ్బెను. అతఁడు మండిపడి మంచముపైనుండి లేచి శ్యామలచేయిపట్టుకొని 'నీవిచటికి రాఁబనిలేదు. నేను పిలిచినపుడు రమ్ము. తెలిసినదా!' యనెను

అయ్యో! ఎంతఅనర్థము వాటిల్లినది! మంచముపైనుండి కదలనైనజాలని భార్గవుఁడు లేచి నిలువఁబడి శ్యామలపాదములపై వ్రాలి యేడ్చుచు "అమ్మా ! యీ నిర్భాగ్యునికై వ్యర్థముగ మీ కెంత శ్రమయైనది ? నేను మీ మాతృవాత్సల్యమెన్నఁడును మఱువఁజాలను మీఋణమునుండి విముక్తుఁడ నగుటకు దైవము నన్ను తిరిగి మీగర్భమున జన్మింపఁజేయుగాక అని ప్రార్థింతును. నేను మిమ్ము సవతితల్లిఅని భావింపలేదు. నాహృదయము దైవమెఱుంగును. నాకన్నతల్లి యనియే భావించియుంటిని. మీవయస్సు నాకంటె నెక్కువ కాకపో వచ్చును. కాని మీరు నామాతృదేవతలు. నేను నిరంతరము మిమ్మాదృష్టితోడనే చూచు చుంటిని.............ఇంక నేను మాటాడఁజాలను. క్షమింపుఁడు. ఇది తుదిమాట.

శ్యామల యశ్రుప్రవాహము నాపుకొనుచు—'ఏల యిట్లందువు! నాలుగైదు దినములలో నారోగ్యము కుదుట పడ గలదు.'

భార్గవుఁడు క్షీణస్వరముతో — ఇంక నాకు బ్రతుకుపై నాశ లేదు నాకు మాట్లాడుశక్తిసైతము లేదనెను.

భార్గవుఁడశక్తుఁడై నేలకూలబడియెను. శ్యామల నిర్భయముగ భర్తవంక చూచి వైద్యులేమని సలహా నిచ్చిరనెను.

శివ:— అందఱును చెల్లము కొట్టినరాళ్ళైరి. క్రొత్తరక్తము కావలెనట.

శ్యా:— క్రొత్తరక్తము లభించుచో ప్రాణములు దక్కునా?

శివరావు శ్యామలవంక కోపదృక్కులతోఁ జూచి — నేనీశ్వరుఁడనుగాను. వైద్యునిసైత మీశ్వరుఁడని తలంపను.

శ్యా:— క్రొత్తరక్తమంత యలభ్యమగు వస్తువా?

శివ:— కొండమీఁదికోతియు నలభ్యముకాదు.

శ్యా:— నేను నారక్త మిచ్చుటకు సిద్ధము వైద్యుని పిలిపింపుఁడు.

శివరావాశ్చర్యపడి "నీవా?" అనెను.

శ్యా:— అవును. నారక్తము పనికిరాదా?

శివ:— నీవు నీరక్తమిత్తువా? నీరక్తమువసరము లేదు అందులో ప్రాణభయముండును.

శ్యా:— నాప్రాణ మింతకన్న నేనాఁడు పనికివచ్చును?

శివరావు సజలనేత్రుఁడై — లేదు శ్యామలా! దానివిలువ నాదృష్టియందు పూర్వముకన్న హెచ్చినది. నేఁటివఱకది నా భోగవస్తువై యుండెను నేఁటినుండి యది నాభక్తికిఁ దగినదైనది. నేను నీపట్లకడుంగడు నన్యాయము నొనరించితిని. క్షమింపుమనెను.

# త్రయోదశ ప్రకరణము



జరుగవలసిన దేమో జరిగిపోయినది. ఎవరి ప్రయత్నమును నేమియు కొనసాగలేదు. వైద్యుడు శ్యామల శరీరమునుండి రక్తమును తీయ ప్రయత్నించుచుండగనే భార్గవుడు తన యుజ్జ్వలజీవితపు తుది శోభను ప్రదర్శించి యీ మాయాప్రపంచమును వీడిపోయెను. ఇంతవఱకును నాతడు శ్యామల దర్శనార్థమై తన ప్రాణములను నిలబెట్టుకొనియుండెను. ఆమెను నిర్దోషిగ నిరూపింపని దా ప్రాణములు దేహము నెట్లువీడును. నేటికి వాని యాశయము సంపూర్ణమయ్యెను. శివరావునకు శ్యామల నిర్దోషయని తెలిసిపోయెను. కాని చేతులు కాలినపైఁ గాని యాకులు లభింపలేదు.

పుత్రశోకముతో శివరావుజీవితము దుర్భరమయ్యెను నాటినుండి యాతని పెదవులపై చిఱునగవు తాండవింపలేదు. జీవితము తనకు వ్యర్థమైనట్లు తోచుచుండెను. కచేరికి వెళ్ళును గాని కేసులు విచారింపలేదు. ఏదో కాలక్షేపమునకై మాత్రము వెళ్ళుచుండెను. గంట రెండుగంటలలో విసిగి యింటికి తిరిగి వచ్చును. తిండికి కూర్చుండిన నన్నము రుచింపదు. శ్యామల చాల రుచికరముగ వండును. కాని శివరావు రెండుముద్దలకన్న నెక్కువ తినజాలకుండెను. తినినముద్దయైనను వెళ్ళిపోవునా యనిపించుచుండెను. భార్గవుని గదివంక చూడగనే యాతని హృదయము బద్దలగుచుండెను అతని యాశా

జ్యోతి వెలిగెడిచోట నిరాశాంధకారము వ్యాపించియుండెను. అతనికింకను నిరువురు పుత్రులుకలరు. కాని పాలిచ్చునావు పాడై పోవగ దూడలపైనేమియాశ? పూతపూచి కాయలు కాయుచెట్టు వితిగికూలఁగా మొక్కలపై నాశనిఁకేమి యేమి ఫలము? మరణము సర్వజన సామాన్యమే. కాని తన చేతులార ప్రాణము దీసితినను చింత యాతని దుఃఖపెట్టుచుండెను. ఈ మాట జ్ఞాపకమురాఁగానే యాతనికి గుండెలు బ్రద్దలగునని పించుచుండెను.

శ్యామలకు భర్తయెడల ననన్యసానుభూతి యేర్పడెను. పీడైనంతవఱకాతని చింతాపిశాచముకు నుంచుటకామె నిరంతరము యత్నించుచుండెను. మఱచికూడ నామె పూర్వపు మాటలనెత్తకుండెను.

శివరావామెతో భర్తృని మాట యెత్తుటకు సిగ్గుపడుచుండెను. ఒకసారి శ్యామలతో తన మనోభావము లన్నియు విప్పి చెప్పదలనుకొనను గాని సిగ్గు నోట మాట రానీయకుండెను. తన మనోవ్యథ నితరులకు చెప్పుటచే లభించు నుపశాంతి సైతమాతని కందుచే లభింపకుండెను. దుఃఖమిట్లు లోలోన విషమువలె శరీరమంతటను వ్యాపించుచుండెను దేహము నానాటికి క్షీణించుచుండెను.

కొన్ని దినములనుండి శివరావునకును భార్గవున కౌషధము నిచ్చిన వైద్యునకును స్నేహము గాఢమయ్యెను. పాపమాయన అప్పుడప్పుడు వచ్చి శివరావునకు నచ్చఁజెప్పుచుండెను. ఒకప్పుడు వెంట వాహ్యాళికి గొంపోవుచుండెను. అతని

భార్య సైతము రెండుమూడుసార్లు శ్యామలను చూచిపోవ వచ్చెను. శ్యామలకూడ వారియింటికి చాలసార్లు వెళ్ళి వచ్చెను. కాని వెళ్ళిన కొన్ని దినముల వఱకామె మనస్సు చింతాక్రాంతమైయుండును. ఆదంపతుల సుఖజీవన మవలోకించి యామె తన దుర్దశపట్ల దుఃఖింపకుండ నుండజాలక పోవుచుండెను. వైద్యునికి నెలకు మొత్తము మీద రెండువందల రూపాయలు లభించుచుండెను అందులోననే వారు ఖుషముగ కాలము వెళ్ళబుచ్చుచుండిరి. ఇంటియందొక దాసిమాత్ర ముండెను. ఇంటి పనులు చాలభాగము యజమానురాలే చేసికొనుచుండెడిది. నగలు కూడ నామె శరీరముపై కొలదిగనే యుండెను. ధనమును తృణసమానముగ నెంచగల్గు ప్రేమబంధనము వారి మధ్యనుండెను. మగని చూచి పెండ్లము మొగము వికసించుచుండెను భార్యను చూచి భర్త పరమానంద మొందుచుండెను శ్యామల యింట ధనమంతకన్న నెక్కువయే యుండెను. ఆభూషణములతో నామె శరీరము బరువెక్కుచుండెను. ఇంటి పనులేవియు తాను స్వయముగ చేసికొన నక్కఱ లేదు. శ్యామల సంపన్నురాలయ్యు అధిక దుఃఖమనుభవించుచుండెను. యశోధర విపన్నయయ్యు సుఖముగ నుండెను. యశోధరకు శ్యామలకు లేని వస్తువేదో యుండెను. అదే వైభవమును, సంపదను తుచ్ఛముగ భావింపజేయుచుండెను. ఆమె యశోధర యింటికి నగలు పెట్టుకొని పోవుటకు గూడ సిగ్గుపడుచుండెను.

ఒక రోజున శ్యామల వైద్యునింటికి వెళ్ళెను. ఆమె విచారములో నుండుట జూచి యశోదర—'అక్కా నేడేల

విచారముగ నుంటిరి? వకీలుగారు కులాసాగా నున్నారా?' అని యడిగెను.

శ్యా:—ఏమిచెప్పను యశోధరా! ఆయన యారోగ్యము నానాటికి క్షీణించుచున్నది. ఏమి చేయుటకును దోచకున్నది. దైవకృప యెట్లున్నదో?

యశో:—వారు వాతావరణముమార్చి యెటకైన నేగుట యవసరమని మాయింటి వారనుచున్నారు. లేకున్న భయంకరరోగము సంప్రాప్తించునట. ఎన్నోపర్లు వకీలుగారికీవిషయము చెప్పిరికూడ. కాని వారు మాత్రము తమ యారోగ్యము చాలబాగుగ నుండెననియు, జబ్బేమియు లేదనియు త్రోసివుచ్చుచుండిరి. నేడు నీవుకూడ చెప్పుము.

శ్యా:—డాక్టరుగారు చెప్పినదే వినని వారు నేనుచెప్పిన విందురా?

క్షణములో శ్యామలకన్నులు సజలమయ్యెను. నెలల తరబడి హృదయము నాందోళనపెట్టుచున్న నందేహము నేడు బయల్వెడలెను. ఇప్పటివఱకామె దాసని దాచిపెట్టియుండెను. ఇంక దాపజాలకపోయెను. "అక్కా! నాకు లక్షణములు శుభావహముగఁ దోచుటలేదు. భగవంతుని కృప యెట్లున్నదో" అనెను.

యశో:—వాతావరణము మార్చితీరవలెనని నీవు గట్టిగ వారికి నొక్కి చెప్పవలెను. మూఁడు నాలుగు నెల

లేచటనైనఁ గడపినఁ జాలమాటలు మఱపునకు వచ్చును. ఇల్లు మార్చినను దుఃఖము కొంత యుపశమించునని నాయభిప్రాయము. నీవు కదలుటకు సైతము వీలు కాదుగదా? నీకెన్నవనెల?

శ్యా:—ఎనిమిదవనెల గడచుచున్నది. ఈచింత నన్ను మఱింత వేధించుచున్నది. నేను దైవము నెన్నఁడైన కావలెనని కోరియుంటినా? ఈబెడద నాతలపై నేలరుద్దవలెను? నేను కడుంగడు నిర్భాగ్యురాలనక్కా! వివాహమునకొక నెల ముందే తండ్రి మరణించెను. ఆయన చనిపోయినది మొదలు నాకు శనిగ్రహముపట్టినది. మొదట వివాహము స్థిరపడినదే. వారు వెనుకాడఁగా తప్పిపోయినది. పాప మమ్మ విధిలేక నావివాహమిట్లు చేయవలసి వచ్చెను. ఇప్పుడు మాచెల్లెలు వివాహము కానున్నది. దాని నాక యేరేవునఁబట్టునో తెలియదు

యశో:—మొదట స్థిరపఱుచుకొన్న సంబంధమువారు వెను కేల యుండిరి?

శ్యా:—ఆవిషయము వారికే తెలియవలెను. మాతండ్రి లేనపుడు వారికి వేలకువేలు కట్నమెట్లు లభించును?

యశో:—ఇదిమిక్కిలి నైచ్యము. ఏయూరివారో!

శ్యా:—విజయవాడ. పేరు గుర్తులేదు కాని యొకాఫీసు శాఖలో పెద్దయుద్యోగస్థుఁడు.

యశోధర గంభీర భావముతో—'ఆయన కుమారుఁ డేమిచేయుచుండె' ననెను.

శ్యా:—పనియేమియు లేదు. ఎచటనో చదువుచుండెను. చాల తెలివైన వాఁడట.

యశోధర శిరమువంచి—'అతఁడు తండ్రితో నేమియు ననలేదా? తాను యువకుఁడుగదా. అంతమాత్రము తండ్రి నొప్పింపలేకపోయెనా ?'

శ్యామల:—ఆమాట నాకేమి తెలియును? ధనమెవరికిచేదు? సందేశమంపిన బ్రాహ్మణుఁడు పిల్లవానికే యంగీకారము లేకుండెనని చెప్పెను. కాని పిల్లవానితల్లి మాత్రము దేవతయఁట. ఆమె పతిపుత్రులిరువురకు నచ్చఁజెప్పెను. కాని యామెమాట సాగలేదు.

యశో:—నాకా యువకుఁడు కనఁబడినచో మొగము వాచునట్లు తిట్టెదను.

శ్యామల:—నా యదృష్టమున వ్రాసియున్నట్లు జరిగినది. పాపము వినులగతి యేమగునో!

సాయంకాలము శ్యామల యేగినపిమ్మట వైద్యుఁడు రాఁగా యశోధర 'యేమండీ' ఒకచోట వివాహము స్థిరపఱుచుకొనినపిమ్మట లోభవశమున వేఱొకచో వివాహమాడు వానిని మీరేమందుర' నెను.

చలపతి భార్యవంక కుతూహలముగఁజూచి—'అట్లు చేయఁగూడదంను నంతకంటె నేమందును!'

యశో:—అది మిక్కిలి నైచ్యమనరేమి? మొదటితరగతి యవినీతియనరేమి ?

చల:—అవునన్లనుటకు నా కభ్యంతరము లేదు.

యశో:—అపరాధ మెవరిదెక్కువ? వరునిదా? వరునితండ్రిదా?

యశోధర యీ ప్రశ్నల నేలవైచుచుండెనో యంత వఱకు చలపతి కర్థముకాలేదు. ఆశ్చర్యపడి పరిస్థితినిఁబట్టి చెప్ప వలసియుండును. వరుఁడుతండ్రి యధీనుఁడగుచో తండ్రిదే దోష మనుకొనుము.

యశో:—అధీనుఁడైనను యువకుఁడగు వానికి తనకర్తవ్య మేమియు లేదా? తనకువచ్చినకోటు తండ్రికిష్టము లేనంతమాత్రమున నేడ్చిరా కుట్టుకొనిరా కొని పించుకొనక మానునా? ఇట్టి మహత్తరవిషయమున తండ్రి నవసరమగుచో విరోధింపలేఁడా? వరుఁడు, వరునితండ్రి యిద్దరును నపరాధులేయనుము. ఇందు వరునియపరాధమే యెక్కువ. వరునితండ్రి ఖర్చు లన్నియు నేనేభరింపవలెనుగదా! వధుపక్షమునుండి యెంతగుంజఁగలిగిన నంతమంచిదనుకొనును. స్వార్థమున కమ్ముడుపోని వరుఁడగుచో తనయాత్మబలమునుఁ జూపి తండ్రి నెదిరించవలెను. అతఁడట్లు చేయనిచో లోభియు, భీరువునని యందును. దౌర్భాగ్యవశమున నిట్టిప్రాణియే నాకు భర్తయయ్యెను. అతని నేమాటలతో తిరస్క రింపవలెనో నాకు బోధపడుట లేదు.

చలపతి తడబడుచు—ఆ విషయము...అది...వేఱు. ఇచ్చిపుచ్చుకొను మాటకాదది. వధువు తండ్రిగతించెను. అట్టి స్థితియందు మేమేమిచేయఁగలము. కన్యయందు సైత మేదో

దోషముండెనని వింటిమి. ఆదోషమేమో నీకేల? కథ నెవరు చెప్పిరి?

యశో:—ఆకన్య చెవిటిదనియో, కుంటిదనియో, చాకలికో మంగలికో పుట్టినదనియో, భ్రష్టురాలనియో చెప్పుము. ఊరక విడువనేల? ఏమని చెప్పుదు? కన్య యందలి దోషమేమో విందును.

చలపతి:—నేనైతే చూడలేదు. ఏదో దోషముమాత్ర ముండెనని వింటిని.

యశో:—అట్టి కన్నె మించినదోష మేమి? తండ్రి పరలోకవాసుఁడగుటయే. వారు మాట ముళ్లల కట్టబెట్టలేకుండుటయే. తప్పొప్పులెన్నుటకు జంకెద రేల? మీపరువు ప్రతిష్ఠల కిదియేమి భంగకరము? నేను నాలుగు మాటలన్న నీచెవిని విని యాచెవి నగురగొట్టుదు. ఇంకను మాటలనిన బెత్తము నకుఁబని చెప్పవచ్చును. స్త్రీజాతి కట్టతో గాని మాట వినదు. ఆ కన్య యందే దోషమున్న లక్ష్మీదేవికి సైతమేదని యుండి యుండు నని నేను గట్టిగ చెప్పఁగలను. మీ యదృష్టము బాగుగా లేదంటియే. కాకున్న నేనేల మీపాలఁ బడుదును.

చల:—ఆమె యిట్లుండె నట్లుండెనని నీకెవరు చెప్పిరి? నీవెవరు చెప్పఁగనో విని నమ్మినట్లే మేమును నమ్మియుంటిమి.

యశో:—నేను విని నమ్మలేదు. కన్నులార చూచితిని. అతి

కరమోక్తి యేల చెప్పవలెగాని యీమెను మించిన
అందకత్తెను నేనెన్నఁడునుఁ జూడ లేదు.

చలపతి వ్యగ్రుడై—ఆమె యిదట నెక్కడనైన నున్నదా? ఆమె నెక్కడ చూచితివో నిజము చెప్పుము. మన యింటికి వచ్చెనా?

యశో:—అవును మన యింటికే వచ్చెను. ఒకసారి కాదు. వందసార్లు వచ్చెను. నేనుకూడ నామె యింటికి పలు సార్లు వెళ్ళియుంటిని. వకీలుగారి భార్యయే వీరు ద్వేషమొనర్చిన కన్య.

చల:—నిజమా?

యశో:—నూటికి నూటపాళ్ళు నిజము. వీరే యీ మహాపురుషులని యీమెకుఁ దెలిసిన నింక నీయింటనైన కాలిడదేమో. అంత సుగుణవతి, గృహనిర్వాహణ చతురలు సౌందర్యవతులు పట్టణమున నొకరిద్దరుందురో లేదో వీరు వన్నెదో పొగడుచుందురు. నేనామె దాసిగ నైనయుండుటకుఁ దగను. ఇంట భగవంతుని దయవలన నంతయుఁ గలదు కాని యీడుజోడు కాని మగనితో నేముండి యేమి లాభము? ఆ ముదుసలి వకీలుతో రోజులు వెళ్ళఁదీయుచున్న యీమె ధైర్య మసామాన్యము. నేనైన నెప్పుడో విషము పుచ్చుకొనియుందును. మనస్సులోని వ్యథ వెళ్ళబోసికొనిన తీరునా? అందుచే నామె నవ్వుచు మెలగుచుండును. నగలు, దుస్తులు

ధరించును. కాని యామెలోని ప్రత్యణువు నిరంతరము విలపించు చుండును.

చల:—వకీలుగారిసిగుఱించి నిత్యముచెప్పి మొత్తుకొనుచేమి!

యఃశో:—ఏల చెప్పను? అతఁడామె భర్తకదా. ప్రపంచమున నామె సర్వస్వ మతఁడేకదా. అతఁడు ముదుసలియైన నేమి? రోగియైననేమి? చేసికొనిన మగఁడు. కుల కాంతలు భర్తల నిందింపరు. అది కులటలపని. ఆమె భర్తను జూచి లోలోన కుమిలి పోవును. కాని నిందింపదు.

చల:—ఇంత వయసుమీరిన పిమ్మట నీవకీలుగారి కీవివాహ మేమో?

యఃశో:—ఇట్టిధర్మాత్ములు లేకున్న బీదలౌ కన్యల నెవరుద్ధరింతురు? మీరును, మీసహచరులును వేల మాటలు ప్రకుమ్మరించిన గానిరారు. పాపమీ కన్యలనెవరు చేపట్టెదరు? మీరామెవల్ల ఘోరాన్యాయ మాచరించితిరి. ఇందుకు మీరు ప్రాయశ్చిత్త మొనరించు కొనవలసియున్నది. దైవమామె కుంకుమను నాల్గు కాలములు నిల్పవలయునే కాని లేకపోయిన నామె సర్వనాశనమై పోవును. నేఁడామె మిక్కిలి యేడ్చు చుండెను. మీజాతి నిజముగ నిర్దయమైనది. నేను నాముఖాకరున కేబీదపిల్లనో పెండ్లి చేసికొందును.

వైద్యునికి చివరమాట వినిపింపలేదు. ఆయన ఘోర

చింతామగ్నుఁడయ్యెను. వకీలుగారి కేమైననైనచో నేమగునని మాటిమాటి కాయన హృదయము వికలమగుచుండెను. నేఁడా తనికి తన స్వార్థము యొక్క భయంకర స్వరూపము గోచర మయ్యెను. నిజమునకిది తన యపరాధమే. తండ్రితో తాసీవివా హామే చేసికొందునని నొక్కి చెప్పియుండినచో నాయన తనకు విరుద్ధముగ చేయఁగలిగి యుండెడివాఁడు కాఁడు.

ఇంతలో యశోధర—"ఏమి రేపు శ్యాములను పిలు వనా మాట్లాడెదవు గాని ఆమెకూడ మీయాకారమును జూచును. ఆమె యేమియు ననదు. కాని మీరెన్నఁటికిని మఱువలేనంత తిరస్కారమును మాత్రము చూపును. ఏమి రేపు పిలువనా? మిమ్ము గుఱించి సంక్షిప్తముగ పరిచయము కూడ చేయుదు న"నెను.

చల:—వద్దు యశోధరా! నీకొక దండము. కొంపతీసి యట్లు చేయకుము సుమా. ఇల్లు విడిచి పాఱిపోవలసివచ్చును.

యశో:—చేసిన పాపఫలము ననుభవింప నింత జంకెద రేల? గొంతుకోసిన దానిని గిలగిల కొట్టుకొనుచుండఁగా కూడ చూడుఁడు. మానాయన నైదు వేలిచ్చెనుకదా! తమ్మునివివాహమునకు మఱి నైదాఱు వేలు లభింపఁ గలవు. పదునొకండు వేలు అమ్మో పదునొకండు వేలే? లెక్కపెట్టుకొనుచు కూర్చుండిన నెలలు పట్టును. పిల్ల లెగురఁగొట్టినను మూఁడుతరములవఱకు సరిపోవును. ఎక్కడనైన సంబంధము మాట్లాడుచుంటిరా?

చలపతి యీ పరిహాసమునకు సిగ్గుపడి తలనైన నెత్త జాలకపోయెను. అతని వాక్చాతుర్య మదృశ్యమయ్యెను. దెబ్బ తగిలిన ముఖమువలె చిన్నపోయెను. ఇంతలో నెవరో బయట నుండి పిలిచిరి 'బ్రతుకుజీవుఁడా' యని యాతఁడు పరుగెత్తెను. స్త్రీలెంత పరిహాసకుశలలో నేఁడాతనికి తెలిసివచ్చెను.

చలపతి రాత్రిశయనింపఁబోవుచు యశోధరతో— 'శ్యామలకెవరైన చెల్లెండ్రున్నారా?' యనెను.

యశో:— ఉన్నారు. నేఁడామెనుగూర్చియే శ్యామల వాపోవు చుండెను. తన కర్మమెట్లో కాలిఁది. ఇఁక చెల్లెలిజీవిత మేమగునోయని కుందుచున్నది. తల్లియొద్ద నిపుడా మాత్రము నైతము లేదు. బలవంతముగ నేముసలివాని మెడనో కట్టుటతప్ప వేఱుపాయము లేదు.

చల:— శ్యామల తనతల్లికి సాయపడవచ్చునుగదా ?

యశోధర తీవ్రస్వరముతో— 'మీరుకూడ నప్పుడప్పుడు బొత్తుగ తెలియనిపిల్లలవలె మాట్లాడుదురు. శ్యామల యీయ దలంచిన నేరెండుమూఁడువందలో యిచ్చునేమో. అంతకన్న నేమిచేయఁగలుగును? వకీలుగారిపరిస్థితి యిట్లున్నది. ఆమెయింక నెంతజీవితముఁ గడపవలెను? పాపమాయన యీయాఱునెలలనుండి కచేరివంకనైనఁ జూడలేదు. రూపాయ లాకసమునుండి కురియవు పది పదునైదువేలున్నను బ్యాంకునందుండును. మనకు నెల్సరి రెండువందలు ఖర్చైన వారికి నాలుగువందలైనఁగావా?

యశోధరకు నిద్రపట్టెను. కాని చలపతికి రాత్రియంతయు కనుకుపట్టలేదు. ఏదో యాలోచనతో లేచి కూర్చుండి యాతఁడు లేఖ వ్రాయఁదొడఁగెను.

---

## చతుర్దశ ప్రకరణము

శ్యామలకు కుమార్తె జన్మించుటయు, విమల వివాహము నిశ్చయమగుటయు, శివరావు గృహము వేలమగుటయు మూఁడు విషయములు నొక్క మాఱుగ సంభవించెను. కుమార్తె జన్మించుట సామాన్యమగు విషయమే, కాని శ్యామలకు మాత్రమది మహత్తర మైనదిగ నుండెను. మిగిలిన రెండు విషయములును నసాధారణములు. విమల సంబంధమింత సంపన్న గృహమందెట్లు నిశ్చయమయ్యెను? ఆమె తల్లి చేత చిల్లిగవ్వయైన లేకుండెను. కట్నము మాట తలఁచుటకైన వీలు లేకుండెను. ఇటు ముదుసలి యగు వరుని తండ్రి అపుడే పింఛను పుచ్చుకొనెనఁట. మహాలోభి అని బంధువులలో పేరుపడి యుండెను. అతఁడింత బీదకుటుంబమున కుమారుని వివాహము చేసికొన నేల తలపెట్టెనో యెవరికిని నవగతము కాకుండెను. అన్నిటికన్న మించిన యాశ్చర్యము వకీలుగారి గృహము వేలమైపోవుట. లోకమాతనని లక్షాధికారి

యనుకొనకున్నను దగినంత ధనికుఁడని తలంచుచుండెను. అతని గృహము వేలమెట్లయ్యెను? జరిగిన విషయ మేమనగ శివరావొక ధనవంతునికడ కొంత సొమ్మప్పు పుచ్చుకొని యొకరి గ్రామమును తాకట్టు పెట్టుకొనెను. ఒకటి రెండు సంవత్సరములలో నప్పు తీర్చెదమని భావించెను. ఏడెనిమిదేండ్లలో గ్రామము తనకు స్వాధీన మగునని యోచించెను. తాకట్టు పెట్టినవాఁడెట్లో అసలుఫాయిదాలను తీర్పజాలఁడు, గ్రామము తనకే దక్కునని యెంచెను అది పెద్ద గ్రామము. సంవత్సరమున కొకటి రెండువేలాదాయము వచ్చుచుండెను. కాని శివరావు మనోరథము లీడేరలేదు. ఎంతమనస్సునకు నచ్చఁ జెప్పుకొనియు శివరావు కచేరికి పోఁజాలకుండెను. వృత్తికొరకు మాతని సేవనియుఁ జేయఁజాలని వాని నొనర్చెను. పుత్రుని ప్రాణముల చేనీతఁ దీసిన హేతంగ్రిడి చిత్తశాంతి ననుభవించు నంత హృదయ శూన్యుఁడుగ నుండఁగలఁడు?

సాహుకారికి సంవత్సరము వఱకు వడ్డిచేరలేదు. ఎన్ని మార్లు కబురంపినను శివరావు పోనైన పోలేదు. "సాహుకారి తన యిష్టము వచ్చినట్లు చేసికొనవచ్చును. మేమాతని నౌకర్లము గాము"ని ధిక్కరించుట సైతము జరుగఁగా అతనికి మిక్కిలి కోపము వచ్చెను. అతఁడు వ్యాజ్యము చేసెను. శివరావు కచేరికైన హాజరు కాలేదు. అందుచే డిక్రీ యయ్యెను. ఇంటియొద్ద ధనము లేకుండెను. శివరావు నార్థిక ప్రతిపత్తి కూడ కొన్నాళ్ళ నుండి తరిగి పోవుచుండెను అందుచే నతఁడు సొమ్ము నేకరింపఁ జాలక పోయెను.

చివరకిల్లు వేలమునకువచ్చెను. శ్యామల పుట్టింట నుండెను. ఈసంగతిని యామె హృదయము క్షోభించెను. జీవితము నందే సుఖము లేకున్నను పూర్వము ధనాభావము మాత్రము లేకుండెను. మానవునకు ధనమే సర్వప్రధానమగు వస్తువు గాకున్నను ముఖ్యమగువానిలో ప్రథమము మాత్రము కాక పోదు. ఇతర అభావములతోపాటు ధనాభావముకూడ నామెను బట్టుకొనెను. ఆమె తన యాభరణములన్నింటిని నమ్మి వేలము గాకుండ నాపవలసినదని దాసిద్వారా భర్తకు గబురుచేసెను. కాని శివరావునకీమాట బొత్తుగ నిష్టము లేకుండెను.

నాటినుండి శివరావు మఱింత చింతాక్రాంతుడై పోయెను. ఏధనమును హాయిగ ననుభవించుట కతడు వివాహ మాడెనో అదే నేడపురూపమై పోయెను. దుఃఖాతిరేకమున కతడు శ్యామల మొగమైనను జూడజాలకుండెను. తానామె పట్ల నాచరించిన అన్యాయమతని కన్నులయెదుట గట్టినట్లుగ వగచుచుండెను. కుమార్తె పుట్టుటతో దుఃఖము పరిపూర్ణ మయ్యెను. తన జీవితమంతయు సర్వనాశమే యైనట్లుండెను.

పండ్రెండవదినమున శ్యామల సూతికాగృహమునుండి నవజాత శిశువును జేతులనిడికొని భర్తకడ కేగెను. ఆ లేమ యందు సైతమామె చింతయే లేనట్లు ప్రసన్నరాలై యుండెను. బాలిక నాలింగన మొనర్చుకొని యామె సకల దుఃఖములను విస్మరించెను. హర్షప్రదీప్తములగు తనకుమార్తె నయనపద్మ ముల నవలోకింపగ నామె హృదయము ప్రఫుల్లమగు చుండెను. మాతృత్వానుభూతి యామెను దుఃఖాతీత నొన

ించెను. కుమార్తెను భర్తయొడిలోనికిచ్చి యామె యానంద మున నోలలాడ నెంచెను. కాని శివరావు కుమార్తెనుజూచి ఝులిగిపడెను. ఒడిలోనికి దీసికొన నాతని హృదయము పొంగ లేదు. అతఁడామె నొకపరి జాలిగ నవలోకించి తలవంచు కొనెను. కుమార్తె నూప మచ్చ్యుగుద్దినట్లుగ భార్గవుఁడు బోలి యుండెను.

శ్యామల యాతని మనోభావము నవేఁటుగఁదలఁచెను. ఆమె కతగునాధికముగ కుమార్తెను ప్రేమ్మన కద్దుకొనెను. అందు మీాకీపిల్ల బరువైనచో నీమె నీడమైన మీాపై బడనీయ నను భావముద్యోతిత మగుచుండెను. తాను ఘోరతవన్ను నావరించి పడసిన యమూర్ఘరత్నమును నిరాదరింపవతని హృదయ మెట్లొప్పినది? పిల్లనొడిలోన నత్తికొని యాతణమే యామె తనగదిలోనికి వెడలిపోయెను. పొంగి పొరలివచ్చు దుఃఖము నాపుకొనలేక వెక్కి వెక్కి యేడ్వఁసాగెను. ఆమె తన పతి యౌదాసీన్యమునకుఁగల కారణము యోజింపనైనఁ బ్రయత్నింప లేదు. లేకున్న నతని సింతకొరునిగ భావించియుండదు. తన భర్తపై పడినంత బాధ్యత న్యాయమున కామెపై నేమిపడినది? ఆమె యాలోచించినచో సమార్థము తెలిసికొనఁజాలక పోయె డిది కాదు.

శివరావునకు తణములో తనపొరపాటు తెలిసివచ్చెను. మాతృహృదయము భవిష్యచ్చింతలను, బాధలను దలంచుకొని భయభీతము కానంత యనురక్తమైయుండును. సకల బాధల నతి గమింపఁగల యొక యలౌకిక శక్తి యామెహృదయమున గర్భి

తమై యుండును. శివరావు పరుగెత్తుకొనిపోయి పిల్లనొడిలోనికిఁ దీసికొనెను. 'నాకిపుడు స్పష్టముగ జ్ఞప్తికివచ్చుచున్నది. ఈమె యచ్చముగ భార్గవునివలెనున్నది. ముమ్మూర్తులనంతియే!'

శ్యామల:—వదినెకూడ నట్లేయున్నది.

శివ:—అచ్చముగ నవే పెద్దపెద్దకన్నులు. అవే యెఱ్ఱపెదవులు.
దైవము నాభార్గవుని నాకీరూపమున తిరిగి ప్రసాదించెను.
అదేతల, అదే మొగము, అదేనోరు, అవే కాలుచేతులు.
దైవమా! నీలీల యద్భుతము.

ఇంతలో వియ్యమ్మవచ్చెను. శివరావును చూడఁగనే 'చూచితివా శివా! అచ్చముగ భార్గవుఁడే కాదఁటరా? వాఁడే పునర్జన్మనందినాఁడు. ఎవరెంత చెప్పినను నామాట మాత్రము ఖాయము. భార్గవుఁడే జన్మించినాఁడు. సంవత్సరముపైఁగా నైనదికదా!'

శివ:—అక్కా! ప్రత్యంగమును భార్గవుని పోలికయే నిజముగ
దైవము నాకు భార్గవుని తిరిగి ప్రసాదించెను. (పిల్లతో)
ఏమే నీవు భార్గవుఁడేనా? తిరిగి పోవనెంచితివా, నిన్నీడ్చి
తీసికొనివత్తును. ఎంతనిష్ఠురుఁడై వీడిపోయెను? చివరకు
బంధించుకొని తెచ్చితిమా లేదా? మముల విడిచివెళ్ళు
మాటనైన తలపెట్టితివా, జాగ్రత్త చూచుమక్కా!
ఎట్లుకన్నార్పకుండ చూచుచున్నదో.

ఆ క్షణమునుండియే శివరావు తిరిగి యాశాభవన నిర్మాణము ప్రారంభించెను. మోహమాతనిఁదిరిగి ప్రపంచమువైపున కీడ్చెను. మానవజీవితమా! నీవెంత క్షణభంగురమవో నీమాయో

వనలంత దీర్ఘాయువులు. విరక్తుఁడై రాత్రిందివములు మృత్యువు నాహ్వానించు శివరావే తిరిగి గద్దెపరక నాధారపఱచుకొని యుద్దునకుఁ జేర కాలు సేతులు కొట్టుకొనుచుండెను.

పరక సాయమున గట్టుచేరఁగలిగిన వారెవరేని కలరా!

---

## పంచదశ ప్రకరణము

శ్యామల తన గృహకృత్యములతోడనే తలమునకలుగా నుండినను విమల వివాహముమాట విని మాత్రమాగఁజాలక పోయెను. తల్లి తప్పక రమ్మని కబురుచేసెను. అన్నిటికన్నను శ్యామల వివాహము మొదట నెచట నిరాకరింపఁ బడియుండెనో అచటనే విమలసంబంధము నిశ్చయింపఁబడుట మిక్కిలి యాశ్చర్యకరముగ నుండెను. వారు కట్నము పుచ్చుకొనకయే వివాహము చేసికొందుమని యొప్పుకొనుట మిక్కిలి యాశ్చర్యము గొల్పుచుండెను శ్యామలకు విమల వివాహ విషయము చాల చింతగానుండెను. విమలకు మంచిసంబంధము లభించుటకుగాను తల్లికి సాయముచేయవలెనని యామెయెంతో అనుకొనుచుండెను. కాని భర్త వకీలువృత్తిని కట్టిపెట్టుటచేతను, సాహుకారి వ్యాజ్యెము చేయుటచేతను, నామె యేమియు చేయ జాలకుండెను. కాన నీశుభవార్త వినఁగనే నామె

మిక్కిలి సంతసించెను. చూచుటకు బయలుదేఱకుండ నుండఁ జాలకపోయెను. శివరామయ్య ప్రేమనువలకు పంపెను. చంటి పిల్లఅనిన నలనికి మిక్కిలి ప్రేమ కదలుట కష్టమై శ్యామల వెంట తానును బయలుదేఱ సిద్ధమయ్యెను కాని వివాహము నెల దినములుండఁగనే బయలుదేఱుట యుచితముకాదని యూగిపోయెను.

శ్యామల తల్లి శోకింతవలకును తనవికత్కథ వెళ్ళ బోయ లేదు జరిగినదానికై యేడ్చి మొత్తుకొని తల్లిని దుఃఖ పెట్టుటవలన ప్రయోజనమేమి? అంచుచే శ్యామల యానంద ముగ నుండెనని తల్లి తలంచుచుండెను. శ్యామల యాకారము చూడఁగనే యామెకుండె చెఱువైపోయెను. ఆఁడపిల్ల లత్తింటి నుండి దిక్కురాక అన్నిసుఖము లనభవించుచున్న శ్యామల యిట్లలనుండవలెనా? ఎంతనుండిపిల్లలు ద్వితీయచంద్రునివలెనేగి పూర్ణచంద్రులవలె రాఁగా తానుచూడలేదు? శ్యామల రంగు తేలి యొడలుసైతమునచ్చి యుండునని యామె మనమున నూహించుకొనుచుండెను. ప్రత్యంగమును నపూర్వశోభలీను చుండునని యనుకొనెను. చూచెనుగదా శ్యామల యిదివఱ కున్నదానిలో సగభాగమైన లేకుండెను. ఆ యౌవన చాంచ ల్యమేది? హృదయ మోహనకరమగు నా కాంతివిలాసమయ జీవనమువలన సంప్రాప్తించు కమనీయతా, వికాసమేది?

సౌకుమార్యము లామెయందు నామ మాత్రమునకైన లేకుండెను. ముగము తెల్లబడి, అంగములన్నియు శిథిలములై

చేష్టలుడిగి పందొమ్మిది వర్షములకే యామె ముసలి యయ్యెను. తల్లి కూతుండ్రేడ్చుట మొత్తుకొనుట లైన తరువాత 'నేమే! నీకచట తిండికి లేదా యేమి? ఇంతకన్న నిచట నుండగనే బాగుంటివే! అచట నీకు కష్టముగ నుండునా?

విమల:—అచట తానే యింటి యజమానురాలుగదా! యజమానురాలికి కష్టములను చింతయుండును. తినుటకైన తీరిక యుండదు.

శ్యా:—లేదమ్మా! నాకచటి నీరు పడలేదు. ఆరోగ్యము సరిగ నుండదు.

తల్లి:—ఆయన పెండ్లికి వచ్చెనుగదా. 'పువ్వువంటి పిల్లనుగొంపోయి ముళ్లు నొనరించితిరేల' యని యడిగెదను. అది అట్లుండనిమ్మా. గాని నీవిచటికి డబ్బేల పంపితివి? నేను నిన్నన్నను అడిగియుండలేదే! లక్షచేసినను కూతురు సొమ్ము తినునంతటి హీనురాలను గాను.

శ్యామల ఆశ్చర్యపడి.—డబ్బెవరు పంపిరి? అమ్మా నేనుమాత్రము పంపలేదు.

తల్లి:— అబద్ధమాడకుము. నీవైదువందల నోట్లు పంపలేదా?

విమల:—పంపకున్న నాకాశమునుండి యూడిపడునా? నీపేరు స్పష్టముగ వ్రాసియుండెను. ముద్రకూడ నచ్చటిదే.

శ్యామల:—అమ్మా నీతోడు. నేను డబ్బుపంపలేదు. ఇదెట్లు జరిగినది?

తల్లి:—అప్పుడే రెండుమూడు నెలలైనది. నీవుపంపకున్న నెవరుపంపిరో.

శ్యామల:—నాకేమి తెలియును! నేనుమాత్రమంపలేదు. చట్టంతి కుమారుడు చనిపోయి నప్పటినుండి యాయన కచేరికే వెళ్ళరు. మాకే చాలకష్టముగనుండగ మీకెట్లు పంపవీలగును!

తల్లి:—అయిన నిదిమిక్కిలి యాశ్చర్యముగ నున్నదే. అక్కడ నీకు కావలసిన వారెవరైన నుండిరా! లేక వకీలు గారే నీకు తెలియకుండ నంపిరేమో!

శ్యా:—లేదమ్మా. నాకు నమ్మకము లేదు.

తల్లి:—దీనిజాడ తీయవలెను. నేనాసొమ్మంతయు విమల వస్త్రభూషణములకై వెచ్చించితిని. పెద్దబెడదయే వచ్చినది.

ఏదో పిల్లలవివాదముతీర్చుటకు విమలపోగానే శ్యామల తల్లితో—'ఈ వివాహముమాటవినగా నాకెంతో యాశ్చర్యము కలిగినది. ఇదెట్లు జరిగినదమ్మా'యనెను.

తల్లి:—ఇచట నెవరువిన్నను నాశ్చర్యపడుచున్నారు. నిశ్చయించుకొనిన సంబంధమునే నాల్గురాళ్ళకై త్రిప్పివేసిన వారు కట్నము లేకుండ పెండ్లి చేసికొనుటకేల యొప్పుకొనిరో తెలియకున్నది. వారే స్వయముగ కబురంపిరి. నాయొద్ద నిచ్చిపుచ్చుకొనుటకు చిల్లిగవ్వయైన లేదనియు, కుశకన్యావివాహమే చేసికొనవలెననియు నేను చెప్పి పంపితిని.

శ్యామల:—దీనికి జవాబురాలేదా!

తల్లి:—శాస్త్రిగారు వర్తమానము తీసికొనివెళ్ళిరి. వారు కట్నములు బొత్తుగ నాశించుటలేదనియు, మునుపు మాటతప్పినదానికే సిగ్గుపడుచుండిరనియు చెప్పిరి పిల్లవాని తండ్రివిషయమెఱుంగనిది కాదుగాని పెద్దకుమారుఁడు చాల చెప్పుకొనఁదగినవాఁడని వింటిమి. ఆతనయే తండ్రి నొప్పించియుండు ననుచున్నారు.

శ్యామల:—అప్పుడాయనకుగూడ మాటలు కావలసివచ్చెనే!

తల్లి:—అవును. ఇపుడు కట్నముమాట నెత్తుటయే గిట్టదఁట. ఇచట వివాహముచేసికొనమికి చింతించుచుండిరఁట కట్నమునకై యీ వివాహము త్రోసివేసెను. కట్నములు మాత్రము విరివిగ పుచ్చుకొనఁగల్గెను. గాని పిల్ల తగినదికాదఁట.

తన్నవమానపఱచి తనచెల్లెలినుద్ధరింపఁ జూచుచున్నవాఁడెవరో చూడవలెనని శ్యామల యూతమునఁ జెందుచుండెను. ప్రాయశ్చిత్తమే యగుఁగాక! చేసినతప్పునకు ప్రాయశ్చిత్తము మాత్ర మెందరుచేసికొందురు? ఆతనితో సంభాషింపవలెనని, మెత్తనిమాటలతో తిరస్కారము చూపింపవలెనని, తనయనుపమసౌందర్యమును జూపి యేడ్పింపవలెనని యూహలపోయుచుండెను. రాత్రి యిద్దరప్పచెల్లెండ్రును నొకగదియందే నిద్రించిరి. తమవీధిలోని యే యేపిల్లలకు వివాహమయ్యెనో, యెవరెవరికి పిల్లలుగలిగిరో, యెవరెవరి వివాహమార్భాటముగ జరిగెనో, యెవరెవరికి తగినవరుఁడు లభించెనో, యెవరికెవరెన్ని నగలుపెట్టిరో యివే విషయములు ప్రొద్దుపోవునంతను చెప్పు

కొనిరి. విమల మాటిమాటికి శ్యామల యింటివిషయములకుఁగ నుత్సహించును. శ్యామల మాత్రమామె కట్టి యవకాశము నీయదు. ఆమె యడుగుమాటలకు తాను తగిన సమాధానము నీయ సంకోచింపవలసివచ్చునని యెఱుంగును. విమలమాత్రము విడువక—'బావగారుకూడ వత్తురా'యని యడిగెను.

శ్యామల:—వత్తుమనియే చెప్పిరి.

విమల:—ఇపుడు నీవన్న నిష్టముగానున్నారా ? లేక యెప్పటి వలెనే యుండిరా ?

రెండవపెండ్లివారు భార్యను ప్రాణసమానముగఁ బ్రేమింతురని విందుము. ఈవిషయము తెలియరాదైనదే. ఇంతకు నీవన్న కోపమెందులకో ?

శ్యా:—ఎవరిమనస్సులోనిమాట యెవరికి తెలియును ?

విమ:—నీవు మొగము ముడుచుకొనుటచూచి యాయనకు కోపమేమో. నీవిచటనుండియే మండిపడుచుపోయితివి. వెళ్లి యామాట యీమాట విదలించియుందువు.

శ్యా:—లేదే విమలా! వారన్న నాకావంతయును కోపము లేదు. ఒట్టు. నాచేతనయినంతగ వారిసేవ చేయుచుంటిని. వారిస్థానమున వారుకాక సాక్షాత్ దేవత యున్నను సంతకంటె నెక్కువగ నేను చేయఁగల్గినది లేదు. వారికిగూడ నేనన్న ప్రేమయే. ఎప్పుడును నావంకఁ జూచుచుందురు. ఉభయులకును వశముతప్పిన దానికి వారేమి చేయఁగలరు! నేనేమి చేయఁగలను ! ఆయన నేఁడు యువకుఁడు కాఁజాలఁడు. నేను మును

పలి సంతోషించుచు కాఁజాలను యౌవన వర్ధకములగు నౌషధములు వారెన్నో పుచ్చుకొనుచుందురు! నేను ముసలి నగుటకు పాలు నేతులను విడిచి పెట్టితిని. బలహీనత చేతనైనను వయోభేదమంతగ నగపడకుండ పోవునని యాశించుచుంటిని. కాని పౌష్టిక పదార్థములవలన వారికిఁగాని, యుపవాసములవలన నాకుఁగాని కోరినపని సమకూరుట లేదు. భార్గవుఁడు మరణించినదాది వారిపని బొత్తుగ క్షీణించినది.

విమ:—భార్గవుని నీవుకూడ చాల ప్రేమించుచుంటివికదా!

శ్యా:—ఆకుఱ్ఱవాఁడే అట్టివాఁడు. చూచినవాఁడెవ్వడైనను ప్రేమింపకుండ నుండఁజాలకుండెను. అంతంత అందమైన విశాలనేత్రములు నేనెక్కడను జూడలేదు. పద్మమువంటి ముఖము. అవసరమగుచో నిప్పునకూడఁ గలుగునంత సాహసికుఁడు. విమలా! నేనాంతర్యమును చెప్పుచున్నాను వినుము. నిజముగ నతఁడువచ్చి దగ్గర కూర్చుండిన నేనొడలు మఱచెడిదానను. అతఁడు నిరంతరమొకచోట కూర్చుండిన చూచుచుండ వలెనని పించెడిది. నామనమునం దణుమంతయు పాపభావము లేకుండెను. ఆతనివంక తీక్ష్ణమైన వాఱ్ఱోక భావముతో చూచియుండిన నాకన్నులు పోయినట్లే. అతనిని సమీపమునఁ గాంచినప్పుడేలొకో హృదయము పల్లవించుచుండెడిది. అందులకే చదువుకొనుట అనెడి నెపము పెట్టితిని. లేకున్న నతఁడింటిలోనికే రాకుం

డెను. నిజముగ నతనిమనమున పాపభావమేయున్నచో నతనికై నేను చేయులేనిది లేదు.

విమ:—చాలు చాలూరకుండుము. ఏమిమాట లనుచుంటివే?

శ్యా:—అవును. వినుటకీ మాటలెంతో చెడ్డగనుండును. నిజముగ చెడ్డయే. కాని మనుష్యస్వభావము నెవరు మార్పఁగలరు? ఏఁబదిసంవత్సరముల ముసనలితో నివివాహమగుచో నీ నేమిచేయుదువో చెప్పుము.

విమ:—నేనైన విషముతిని ప్రాణముల విడెదన శ్యా! నేనాతని మొగమైన కన్నెత్తి చూడలేను.

శ్యా:—అయిన నింకేమి! ఆపిల్లవాఁడు కన్నెత్తియైన నావంక నెన్నఁడు చూడలేదు. కాని ముసలివారికింతో అనుమానము. యీంబావగారతనికి శత్రువైరి. చివరకతని ప్రాణములుతీసి కాని విడువలేదు. తండ్రికి తనపై ననుమానము కలిగెనని తెలిసిన దినమునుండి అతనికి తీవ్ర జ్వరము రాసాగెను, అది నుగణము వఱకు విడువలేదు. పాపమా యంతిమదృశ్యము నుఱతుమన్నను మఱపురాదు. నేనుకూడ నానుఁత్రికి వెళ్ళితిని. జ్వరముతో నతఁడొడలు సుఱచి పడియుండెను. కదలుటకైన నోపిక లేకుండెను. నా అలికిడి వినఁగానే యులికిపడి లేచి కూర్చుండి యమ్మా అమ్మా అని కాళ్ళపైబడి యేడ్వసాగెను. (ఏడ్చి) విమలా! ఆసమయమున నతనికై ప్రాణము లర్పింతుననిపించెను. నా కాళ్ళపై నేయాతఁడు మూర్ఛితుఁడై తిరిగి కన్నులు తెఱవలేదు. వైద్య

డాతని దేహమునకు క్రొత్తరక్తము నెక్కించవలెననఁగా పసుగ త్తికొని పోతిని. రక్తము తీయకముందే యాతని ప్రాణములు పోయినవి.

విమ:—క్రొత్తరక్తమెక్కించిన నాతని ప్రాణములు పోయెడివి కావా?

శ్యా:—ఎవరికెఱుక? నాయంతిను రక్తబిందువుసైతము ధార వోయుటకు నేను సంసిద్ధనైయుంటిని. ఆ సీరవస్థితి యందుఁగూడ నతనిముఖము దీపమువలె ప్రకాశించు చుండెను. నన్నుచూడఁగనే తడఁబడి లేచి వచ్చి నా పాదములపై వ్రాలి ప్రాణముల విడనాడకముందు దేహమున క్రొత్తరక్తము ప్రవేశించినచో నొకవేళ బ్రతికియుండునేమో!

విమ:—అయిన సీవతని వెంటనే యేల పంపుకొనఁ బెట్టలేదు?

శ్యా:—పిచ్చిదానా, నిక సలర్థము కాలేదు. అతఁడు నాపాదము లపై వ్రాలి మాతాపుత్ర సంబంధమును నిరూపించి తన తండ్రి మనమునను సందేహమును బాప సిక్ష్చ యించుకొనెను. అందుకే అతఁడు లేచెను. నాదుఃఖ మును నివారింప నతఁడు ప్రాణముల ధారవోసెను. తనకోర్కె నాతఁడు సఫలమొనరించుకొనెను. నాఁటి నుండి మీబావగారిబుద్ధి కుదుటపడినది. ఇపుడు వారి స్థితిఁజూచిన నాకు జాలి కలుగుచుండును. పుత్రశోకము వారినిమాత్రము బ్రతుకనీయదు. నన్ను సందేహించి నాపట్లనొనరించిన అపరాధమునకు వారు ప్రాయ

శ్చిత్తము నొనరించు కొనుచున్నారు. ఇపుడు వారి యాకృతినిఁజూచి నీవుభయపడిపోదువు. ముసలి తాత మైనారు. నడుముగూడ వంగిపోయినది.

**విమల:**—ముసలివారింత యనుమానపు మనుష్యులగుదు రేల?

**శ్యామల:**—ఈమాట ముసలివారినే యడుగుము.

**విమల:**— వారి మనమును నేనీయువతిని సంతృప్తి పెట్టఁజాలక పోవుచున్నాననను సందేహము నిరంతరము బాధించు చుండును నాయూహా అందుకే వారికి మాటిమాటికి ననుమానము

**శ్యామల:**—తెలిసినదానవు నన్నడిగెద వేల?

**విమల:**—అందుకే పాపము భార్యకులొంగి కూడవుండునను కొందును. మామవారు భార్య నెంత ప్రేమించుచు న్నారో(డనుకొందును.

**శ్యామల:**—నీవీ కొలఁదిదినములలో సిన్నిమాటల నెచట నేర్చు కొంటివి? పోనిమ్మా మాటలకేమిగాని నీకు నీమగఁడు నచ్చెనా? అతనిపటమును చూచితివేమో!

**విమల:**—అవును పటమువచ్చినది. చూచెదవా తీసికొనివత్తును?

క్షణములో విమల పరుగెత్తికొనిపోయి పటమునుదెచ్చి శ్యామలకిచ్చెను.

శ్యామల చిఱునవ్వునవ్వి— 'నీవదృష్టవంతురాలవే' యనెను.

**విమల:**— అమ్మగూడ నట్లేయనెను.

**శ్యామల:**—నీకిష్టమో లేదో చెప్పుము. ఎవరివంగతి యేలాగేల?

విమల:— ముక్కు మొగము తీరు బాగుగనేయున్నది. స్వభావము దైవమునకెఱుక. శాస్త్రిగారుమాత్ర మట్టిగుణవంతుఁడు మఱొకఁడుండఁడని చెప్పిరి.

శ్యామల:—ఇచటనుండి నీపటము సైతము పంపఁబడెనా?

విమల:—ఆ శాస్త్రిగారే తీసికొనిపోయిరి.

శ్యామల:—వారికి నచ్చెనా?

విమల:—ఎవరి మనస్సులో మాట యెవ రెఱుంగుదురు? చూచి మిక్కిలి సంతసించిరని శాస్త్రిగారు మాత్రము చెప్పిరి.

శ్యామల:—సరే. నీకేమి చదివింపవలయునో కోరుకొనుము. ఇప్పుడే చెప్పిన చేయించియుంచెదను.

విమల:—నీకు నచ్చిన దేదోయిమ్ము. వారికి పుస్తకములన్న మిక్కిలి ప్రీతి. మంచిమంచి పుస్తకముల తెప్పించియిమ్ము.

శ్యామల.—వారిమాటకాదు. నీమాట చెప్పుము.

విమల:— చెప్పునది నామాటయే

శ్యామల:—(పటమువంక చూచుచు) గుడ్డలు ఖద్దరువలె నున్న వే!

విమల:—అవును ఖద్దరన్న నెక్కుడు మక్కువయఁట. వీపున ఖద్దరుమూటలు మోయుచు నమ్ముచుందురఁట. ఉపన్యాసములిచ్చుటయందు సైతము ప్రవీణులని విందుము.

శ్యామల:—అట్లైన నీవును ఖద్దరే ధరింపవలసియుండునేమో. నీకు మోటు గుడ్డలన్న చాల కోపముగదా.

విమల:—వారికి మోటు గుడ్డ లిష్టమైనపుడు నాకేల కోపము కల్గును? నేను రాట్నము త్రిప్పుట సైతము నేర్చికొంటిని

శ్యా:—నిజమా? నీవు నూలు వడుకఁగలవా?

విమల:—కొంచెము కొంచెము నేర్చుకొంటిని. ఖద్దరన్న వంత ప్రేమమైనపుడు వారు రాట్నము సైతము వడుకుచుందురు. సేనాపతి నెఱుఁగకున్న సిగ్గు పడవలసి వచ్చును.

అక్క సిల్లెంద్రిళ్లే మాట్లాడుకొనుచు నిద్రించిరి. సుమారు రాత్రి రెండు గంటల వేళ పిల్ల యేడువగ శ్యామలకు మెలకువ వచ్చెను. చూడఁగా విమల ప్రక్క ఖాళీగా నుండెను. ఇంతరాత్రి విమల యెచటకేగెనా యని శ్యామల కాశ్చర్యము కలిగెను. మంచినీటి కొఱకేమైన పోయెనేమో! కాని మంచినీరు తలవైపుననే కలదే. ఇంక నెచటికేగి యుండునో. ఆమె రెండుమూఁడు సార్లు విమల పేరుపెట్టి పిలిచెను. జవాబు లేదు. ఆమెకు తహతహ జనించెను. మనమున వివిధములగు సందేహము లుద్భవించెను. అంతలో తన గది లోనికి పోలేదుగదా యను నాలోచన తట్టెను. పిల్ల నిద్రింపగనే యామె విమల గదియొద్ద కేగెను. ఆమె యనుమానము ధృవమయ్యెను. విమల తన గదియందే యాసీనమై, యిల్లంతయు నిద్రించుచుండ తాను రాట్నము వడుకుచుండెను. అంత తన్మయతతో శ్యామల నాటకమునైన చూచి యెఱుఁగదు. శ్యామల కత్యంతాశ్చర్యము వేసెను. లోపలికేగి 'యిదియేమి రాట్నము వడుకుట కిదియేనా సమయము' నెను.

విమల యులికిపడి లేచెను. సంకోచముతో తలవంచి 'సొకెట్లు మెలకువ వచ్చెను! మంచినీరు మొదలైనవన్నియు తల వైపుననే యుంచితినే!' యనెను.

శ్యా:—రోజంతయు తీరికయే లేదా. అర్ధరాత్రి యంకమ్మ శివములన్నట్లిపుడు రాట్నము వడుక నారంభించితి వేమి!

విమల:—పగలు బొత్తుగ తీరదు.

శ్యా:—(నూలుచూచి) నూలు మిక్కిలి సన్నగానున్నది.

విమల:—ఏమి సన్నమో. ఇప్పటికిని చాల ముదుక యనిపించుచున్నది. సన్నసినూలు వడికి వారికొక ధోవతుల చాపు నేయించవలె ననుకొనుచున్నాను. నా కానుక యిదియే.

శ్యా:—నీయాలోచన బాగుగనే యున్నది. వారిదృష్టి యందింతకంటె విలువగల వస్తువు వేఱొకటుండదు. కాని వడుకుట యిప్పటికిచాలు నిగలెమ్ము లేపు వడుక వచ్చును. ఒంటికేమైన వచ్చిన అన్ని ముచ్చటలు నట్లే యుండిపోవును.

విమల:—సరేగాని నీవు పోయి పరుండుము శ్యా! నేనిదే వత్తును.

శ్యామల యిక పట్టు పట్టక పోయి పరుండెను. కాని నిద్ర పట్టనే లేదు. విమల యుత్సాహోద్వేగము లొక యనను భూతమగు నాకాంక్షతో నామె నాందోలిత నొనర్చెను. ఆహా! విమల హృదయమెంత యానందమున నోలలాడు

చున్నది! అనురాగ మామె నెంత యున్నతి నొనరించినది! ఆమెకు తన వివాహము గుర్తునకు వచ్చెను. పెండ్లికి తరలి వెళ్ళిన నాటినుండి ఆమె యుత్సాహము, సంతోషము నశించి పోయెను. తనగదిలో కూర్చుండి అదృష్టమున కేడ్చుచు చావె ప్పుడు వచ్చునా యని దైవమును ప్రార్థించుచుండెను. అప రాధి తన శిక్షకై యెదురుచూచినట్లామె పెండ్లి దినము నెదురు చూచుచుండెను. ఆవివాహ మామె సకలాభిలాషలను హవన గుండమున కాల్చి మసిచేసి వైచినది.

---

## షోడశ ప్రకరణము

---

నెలదినము లిట్టే గడచిపోయెను. వివాహ శుభము హూర్త మాసన్నమయ్యెను. అతిథులతో నిల్లు నిండిపోయెను. శివరాత్రి రోజుముందే వచ్చెను. ఆయనతో శ్యామల స్నేహి తురాలగు యశోధర సైతము వచ్చియుండెను. శ్యామల యామె నంత బలవంతము చేయుకున్నను నామెయే యుత్సా హపడి వచ్చినది. అన్నిటి కన్నను వరుని పెద్దన్నగారిని చూడ వలెననియు, వీరైన నాతని సద్బుద్ధికి ధన్యవాదము లర్పింప వలెననియు శ్యామల తహతహలాడు చుండెను.

యశోధర:—(నవ్వి) నీవు వారితో మాట్లాడగలుగుదువా? అనెను.

శ్యా:—ఏమి? మాట్లాడుటకేమి? ఇప్పటి బంధుత్వమే వేఱు. ఐనను నేను మాట్లాడఁ జాలకున్న నీవుంటివిగదా.

యశో:—లేదమ్మా. నాచేతకాని పని యది. నేను పరాయి మగవానితో మాట్లాడఁ జాలను ఎటువంటి వాఁడో యేమో యెవరెఱుంగుదురు.

శ్యా:—మానిసి మంచివాఁడని తెలియుచునేయున్నది. ఆపైని నీవాతనిని వివాహమాడవలసిన పని లేదుకదా. మాట్లాడినంత మాత్రమున నీదేమి పోవును? డాక్టరుగారున్న వారి యనుమతి తీసికొని యుందును.

యశో:—హృదయము మంచిదైనంత మాత్రమున ప్రవర్తన మంచిది కావలెనా? అన్యస్త్రీల నదేపనిగఁ జూచుట కాపురుషులును వెనుదీయరు.

శ్యా.—సరే నీవు మాట్లాడకున్న నేనే మాట్లాడెదను. చేతనైనంత యెగాదిగ చూడనిమ్మా ఇపుడు సరిపోయినదా?

ఇంతలో విమల వచ్చి కూర్చుండెను. శ్యామల నవ్వి—'నిజము చెప్పవే విమలా? నీమనమిపుడేల కలవర పడుచున్నది?'

విమల:—చాలు. సరసములు తరువాత నాడవచ్చును. నిన్ను బావగారు పిలుచుచున్నారు. వారికి కోపము వచ్చును. వెంటనే పొమ్మా.

శ్యా—ఎందుకో నీవెఱుఁగ లేదా?

విమల:—ఏదో జబ్బుగానున్నారు. చాల బలహీనమై పోయిరి సుమా.

శ్యా:—అయిన కొంతసేపు వారిదగ్గర కూర్చుండి యుపచారము చేయుఁడాలక పోతివా! ఇచటికేల పరుగెత్తికొని వచ్చితివి! ఏదో దైవకృపవలన బ్రతికిపోయితివి గాని నీకుఁగూడ నట్టివాఁడే లభించెడివాఁడు కొంచెము సేపు కూర్చుండి మాటలాడుము. ముసలివారు మంచి మాటకారులై యుందురు యువకులు వారి ముందు తీసివేఁతయే.

విమల:—లేదక్కా, నీవే పొమ్ము. నేనాయనయొద్ద కూర్చుండ లేను.

శ్యామల వెడలిపోఁగా యశోధర విమలతో-'పెండ్లివారు వచ్చిరి గదా. వరపూజ జరుగదేమి' యనెను.

విమల యదేమో నాకు తెలియదు శాస్త్రిగారిటు నటు పరుగెత్తుచున్నారనెను.

యశో:—పిల్లవాని వదినె చాల కఠినురాలట.

విమల:—మీకెట్లు తెలియును?

యశో:—ఎవరో చెప్పఁగ వింటిని గాన ముందుగ చెప్పితిని. ఎప్పుఁడును తిట్టిపోయు చుండునఁట

విమల:—నాకు జగడమాడు నలవాటు లేదు. నావలన పొరపాటు లేనపుడామె యూరక యేల తిట్టును?

యశో:—ఏమో యూరకనే జగడమాడుచుండునని వింటిని.

విమల:—నేను నూరు మాటల కొకమాటయైన ననను. వినయము రాతినైన కరగించును

ఇంతలో పెండ్లివారి గల్లంతయ్యెను. వారిరువురును కిటికీయొద్దకు పోయి నిలువఁబడిరి. కొంచెము నేపటికి శ్యామల సైతము వచ్చెను.

వరుని పెద్దన్నగారిని చూడవలెనని శ్యామల త్వరపడు చుండెను.

యశో:—పెద్దన్నగారెవరో యెట్లు తెలియును?

శ్యా—శాస్త్రిగారి నడిగినఁ దెలియవచ్చును. ఆయేనుఁగు మీఁద విమల మామగారు. అరే! డాక్టరుగారు కూడ వచ్చిరే యశో! యాగుఱ్ఱము మీఁద కన్పించుట లేదా?

యశో:—అవును వారే.

శ్యా:—వారి స్నేహితులేమో బంధుత్వమేమియు లేదుగదా.

యశో:—ఈసారి యడిగిన తెలిసికొనవలెను? నాకేమియు తెలియదు.

శ్యా:—ఆపల్లకిలో కూర్చున్నవారు వరుని అన్న కాదను కొందును.

యశో:—బొత్తుగ కాదు. ఆ పొట్ట శరీరమంతటను వ్యాపించి యున్నదేమి?

శ్యా:—ఆరెండవ యేనుఁగుమీఁద నెవరో తెలియుట లేదు.

యశో:—ఎవరైనను వరుని అన్నగారుమాత్రము కాదు. అతని వయస్సు చూడరాదా.—నలువదికంటె పైనే యుండును.

శ్యా:—శాస్త్రిగారు వరపూజ తొందరలో నున్నారు. వారి నడిగిన తెలియఁగలదు.

ఇంతలో చాకలివచ్చెను. పెట్టె తాళము చెవులు శ్యామలయొద్ద నుండెను. వరపూజ సందర్భమున కొన్ని రూపాయలు కావలసి తల్లి అతనినిపంపెను. ఈచాకలికూడ పెండ్లి చూపులకు శాస్త్రిగారితో వెళ్ళియుండెను.

శ్యా:—రూపాయలిప్పుడే కావలయునా?

చాకలి:—అవునమ్మగారూ! త్వరగావచ్చి యిండు.

శ్యా:—ఇత్తునుగాని ముందు వరుని పెద్దన్నగారెవరో చెప్పుము. నీకు తెలియునా!

చాక:—నాకెందుకు తెలియదు అకుగో యామెనుటనున్న దాయనగారే.

శ్యా:—ఎక్కడ? నాకు కన్పింపరేమి

చాకలి:—అయ్యో! ఆ గుఱ్ఱముమీఁద కూర్చుండ లేదా. ఆయనయే.

శ్యామల యాశ్చర్యముతో—చాలు చాలు. తెలిసి చెప్పుచుంటివా? నోటికివచ్చినట్లు చెప్పుచుంటివా? అనెను.

చా:—ఇంత యెండలు మఱచిపోవుదునండీ! ఇప్పుడేకదా వారికి ఫలహారములు సైతమిచ్చి వచ్చితిని.

శ్యా:—అరే! ఆయన డాక్టరుగారు. మాపొరుగింటివారే.

చా:—అవును. వారు డాక్టరుగారే.

శ్యామల యశోధరవంకఁజూచి—"చూచితివమ్మా! వీనిమాటలు" వనెను.

యశోధర నవ్వనాపుకొని—'అంతయు నబద్ధ' మనెను.

చా:---నరే అబద్ధమే అనుకొనుడు. మీచే తిట్లనెవరు తిందురు? ఇదిగో శాస్త్రిగారినడిగిన నెవరిమాట అబద్ధమో తెలియుఁగలదు.

చాకలి వచ్చుట యాలస్యము కాఁగా కొండిభొట్లు దొడ్డిలోనికి పరుగెత్తుకొనివచ్చి గోలపెట్టసాగెను. 'ఈయింటి మర్యాద దైవమునకెఱుక. చాకలివచ్చి అఱగంటయైనది. రూపాయలు తేక పోఁగా తిరిగియైన రాఁడు!'

శ్యా:—ఒక్కసారి యిటురండు శాస్త్రిగారూ! ఎన్నిరూపాయలు కావలెను?

కొండిభొట్లు రుసరుసలాడుచు రొప్పుకొనుచు పైకివచ్చి దీర్ఘముగ నుచ్ఛ్వసించి—'ఇదేనా మాటలకు సమయము? వెంటనే రూపాయలు తీసియిమ్ము' నెను.

శ్యా:—ఇదుగో తీయుచుంటినిగదా. నాకును రెండేనా చేతులు? సరేగాని వరుని అన్నయెవరో!

కొండి:—రామ రామ, ఇంతమాత్రపుమాటకు నన్ను పాతాళమునుండి యాకసము నెక్కింపవలెనా? చాకలి నడిగిన సరిపోదా?

శ్యా:—చాకలి నడుగఁగ నాగుఱ్ఱము నెక్కినవారే యనెను.

కొండి:—అవును వారే. మఱెవరని చెప్పవలెను?

చా:—గంటనుండి చెప్పుచున్నను అమ్మగారు నమ్మరు.

శ్యామల యశోధర వంక ప్రేమ, మమత, వినోదము, కృత్రిమ తిరస్కారముగల భావముతో చూచి 'యయిన నిది అంతయు నీనాటకమన్నమాట. నాకు ముందుగ తెలిసిన నిన్ని చటికి పిలువకయే యుందును. ఓహో! యెంతదానవమ్మా! ఎన్నినెలలనుండిరో యీమాట కడుపున దాచుకొనియు నొక్క మాటైన నాతో ననక పోతివి! నేనైన రెండుమూడు రోజులలో బైట పడియుందును' నను

యశో:— నీకు తెలిసినచో మాయింటికేల వత్తువు!

శ్యా:— ఎంతవిచిత్రము! నేను డాక్టరుగారితో నెన్నిసార్లు మాట్లాడలేదు! ఈమాయ అంతయు నీదే. చూచి తివా విమలా! మీతోడుకోడలు చాల మాయలాడి. కనిపెట్టి మెలగవలెను.

విమల:— నేనిట్టి సాధ్వీమణి చరణముల నారాధింతును. వారి దర్శనముననే పవిత్రురాలనైతిని.

శ్యా:— ఇప్పుడు నాకు తెలిసినది. సొమ్ముకూడ నీవేపంపి యుందువు. ఇక తలత్రిప్పిన దెబ్బలే.

యశో:— ఇంటికి పిలిచి యతిథి నవమానింపరాదు.

శ్యా:— సరే. ఇక నీపనిపట్టింతు నుండుము. నేను రవంత రమ్మని వ్రాయగనే యిచటికి వచ్చివేసితివే. ఇంటి వారేమందురు!

యశో:— అందఱకు చెప్పియే వచ్చితిని.

శ్యా:— ఇక మీయింటికి రాను. డాక్టరుగారి యెదుట వడ వద్దనిమైన చెప్పక పోతివే.

యశో:—వారు చూచినంత నేమి మునిఁగిపోవును? చూడకున్న తను దురదృష్టమున కెట్లేడ్తురు? మూట ముల్లెల యాశతో నట్టిరత్నమును పోగొట్టుకొనిరో చూచు కొందురు. ఇపుడయ్యగారు లోలోన నేమ్పుచు పైకే మియు అనరుగాని మనమున నెంతో పొరపడితి మని పశ్చాత్తాపము చెందుదురు.

శ్యా:—ఇఁక మీయింటి కెప్పఁడును రాను.

యశో:—నాకు వీయింటి దారి తెలియకున్నఁగదా!

వరపూజ పూర్తి యయ్యెను. అతిథులు ఫలహారము చేయుచుండిరి. శివరావు ప్రక్కనే డాక్టరుగారు కూర్చుండి యుండిరి. శ్యామల తెరచాటునుండి వారినుభయులను జూచెను. ఆమె గుండె యాగిపోయెను. ఒకరు మూర్తీభవించిన యౌవనము. ఆరోగ్యము. ప్రతిభ వాఙ్మని కూర్చి ముచ్చటించ కుండుటయే మేలు.

శ్యామల యంతకుముందు డాక్టరు నెన్నోమార్లు చూచి యుండెను. కాని యామె హృదయమున నేటి యాలోచన లెన్నఁడును తలయెత్తియుండలేదు. పిలిచి, చీవాట్లుపెట్టి, దెప్పి యేడ్పింపవలెనని యెంతో యాతురతచెందెనుగాని భయపడి యూరకుండెను. పెండ్లివారు విడిదికేగిరి. వంటలు తయారగు చుండెను. శ్యామల వడ్డన సామాను సరుచుండెను. ఇంతలో పరిచారికవచ్చి 'అమ్మా! మిమ్ము యశోధరమ్మగారు రమ్మను చునారు మీగదిలో నున్నా'రని చెప్పెను

శ్యామల యాత్రములో వదివిడిచి గదిపైవునకేగెను. లోన కాలిడంగనే యట్టె యాగిపోయెను. డాక్టరు చలపతి యెదురుగ నిలిచియుండెను.

యశోధరనవ్వి—'ఇదుగో పిలిచితినక్కయ్యా! నీకు చేతనయినంతగ తిట్టుము. నేను తలుపునొద్ద నుందును. వరుగెత్తు కొని పోంజాలరు' నెను.

చలపతి గంభీరముగ—'ఎవరు పరుగెత్తం జూచు చున్నారు? నేను తలవంచుకొని నిలంబడి సిద్ధముగ నున్నాన' నెను.

శ్యామల చేతులెత్తి నమస్కరించి—'ఇట్లే దయతో కాపాడుచుండవలెనని ప్రార్థన. మీ మేలు మఱవను' నెను.

---

## సప్తదశ ప్రకరణము

---

విమలపెండ్లియైనతరువాత యశోధర వెడలిపోయెను గాని శ్యామల పుట్టింటనే యుండెను శివరావినిమ్మూర్లు రమ్మని వ్రాసినను నామె పోలేదు. ఆమెకచటికివెళ్ళుట కష్టముగ నుండెను. తన్నాకర్షింపంగలుగు పరిస్థితులచట నేమియు లేకుండెను. ఇచట మాతృసేవ, పిల్లల లాలనపాలనలతో నామె సమయము సుఖముగం గడచుచుండెను. శివరావు

స్వాయముగవచ్చిన వెళ్ళియుండెడిది. కాని పెండ్లిలో నావీధి పిల్లలందరు పట్టి యేడ్పించుటచే నాతనికా యూరువచ్చు సాహసము లేకుండెను. యశోధరసైత మెన్ని యోమారులు రమ్మని వ్రాసెను. కాని శ్యామల యాకుఁట యీమాటచెప్పచు వెళ్లకుండెను చివరకొకరోజున యశోధర యొకనౌకరును వెంటఁబెట్టుకొని స్వాయముగ వచ్చెను.

కుశల ప్రశ్నలైన తరువాత యశోధర—'నీవచటికి రావేలచుచుంటివివరొ నన్నదే' యనెను.

శ్యా:—నిజమేనమ్మా. నాకు నిజముగ భయమగుచున్నది. పెండ్లయైన మూఁడేండ్లకువచ్చితిని. తిరిగి జీవితమున వత్తునో లేదో. పిలుచువారెవరు? వచ్చువారెవరు?

వచ్చుటకేమి? ఇష్టమున్నపుడెల్ల రావచ్చును. అచట పాపము వకీలుగారు చాలనిబ్బంది పడుచున్నారు.

శ్యా:—అవును. చాల నిబ్బందియే. రాత్రుల నిద్రపట్టుట లేదేమో!

యశో:—అక్కా! నీవుండెడ రాతిదమ్మా వారినిఁజూచిన జాలికలుగుచుండును. ఇంట్లో పలుకరించువారు లేరు. పిల్లలు లేరు పాపలు లేరు. కాలమెట్లు వెళ్ళును? అద్దె యింటికి వెళ్ళినప్పటినుండి మఱింత కష్టముగ నున్నది.

శ్యా:—పిల్లపాపలు లేకేమి. ఒక్కఁడను, కాఁడిద్దరు కుమారులున్నారు.

యశో:—వారినిగూర్చియే మొంతో గోలపడుచుండిరి. కేశవుడు బొత్తుగ మాటవినుట మానినాడు. ఇక చిన్న

కాఁడు వానిబంకే పాపమాయున భార్గవుని తలఁచు
కొని యేడ్చుచుండును.

శ్యా:—కేశవుఁడు మొంగివాఁడు కాఁడే. ఈ యల్లరి యెవుడు
నేర్చెను? నామాట కాదనువాఁడు కాఁడు. చెప్పి ట్లు
నడుచుచుండెడివాఁడు.

యశో:—నాకేమి తెలియునమ్మా? మీరే యన్నను విషము
పెట్టి చంపితిరనునఁట. ఎన్నో మూర్లు నిన్ను వివాహ
మాడినందులకు దెప్పిపొడిచెనఁట. ఎన్నో మాటలని
వారి నేడ్పించునఁట. ఒకరోజున రాతిబండ తీసికొని
నెత్తి పగులఁగొట్ట బయలుదేఱెనఁట.

శ్యామల చింతాక్రాంతయై—"వీఁడొక రాక్షసుఁ
డయ్యెనే! అన్నను వారువిషముపెట్టి చంపిరని వానికెవరు చెప్పిరి?

యశో:—ఏమో. వాఁడుమాత్రము నీవు లేక బాగుపడఁడు.

శ్యామలకు మఱియొక క్రొత్తదిగులు పట్టుకొనెను. కేశ
వుఁడు తండ్రితోడనే యుద్ధమాడుచున్నపుడు తన్నేల మన్నిం
చును. తానతనికొక లెక్క-యా ? ఈవిచారముతో రాత్రి
యంతో నేపామెకు నిద్రపట్టలేదు. ఆమెకు మాటిమాటికిని
భార్గవుఁడు గుర్తువచ్చెను. అతఁడుండినచో జీవితము నిశ్చింతగ
గడచెడిది. తండ్రిమాటయే లక్ష్యము లేని యితఁడు తననేమి
లెక్క-పెట్టును ఇల్లు చేయిఁజాఱి పోయినది. ఎంతోకొంత
అప్పు నెత్తినింకను కలదు. రాబడిసంగతి చెప్పనక్క-అ లేదు.
దైవమేమిచేయఁదలంచెనో. నేఁడు మొట్టమొదటగ శ్యామలకు
తనకుమార్తెను గుఱించిన దుఃఖముకలిగెను. పాపమీ మెగతి

యేమగును! నేను కావలెననుకొన కుండగనే భగవంతుఁడీ భారము నా నెత్తిని వైచెను. పుట్టిన నాఁకధనవంతుని యింటి యందైన పుట్టియుండవలసినది. పిల్లయామెను కౌఁగిలించుకొని నిద్రించుచుండెను. ఎవరో యామెను లాగి కొనిపోవు చున్నట్లు తల్లియామెను మఱింత దగ్గఱకుఁ దీసికొనెను.

శ్యామల ప్రక్కనే యశోధర పరుండియుండెను. శ్యామల చింతాసాగరమునఁ దేలియాడుచుండ యశోధర యానంద తరంగముల నోలలాడుచుండెను. ఆమెకు తనకుమారునిఁ గూర్చి దుఃఖము కలుగునా? మృత్యువునకు పరమౌషధము లేదుగదా. యశోధరకా చింత లేదేమి? ఆమె భవిష్యత్తును గూర్చి దుఃఖ పడదేమి?

ఆకస్మికముగ యశోధరకు మెలఁకువ వచ్చెను. శ్యామల అంతవఱకును నిద్రింపకుండుట చూచి 'అరే సివింకను నిద్రింప లేదా' యని ప్రశ్నించెను.

శ్యా:—నిద్ర బొత్తుగ పట్టుటలేదు.

యశో:—కన్నులు మూసికొనిన నిద్ర యదే వచ్చును. నేను మంచ మెక్కఁగనే యొడలు మఱచుచుందును. ఆయన లేచినను నాకు తెలియదు. నాకింత నిద్ర యేమో తెలియదు. ఇదేమైన జబ్బేమో.

శ్యా:—అవును పెద్దజబ్బే. దీనిని రాజరోగమందురు. మందిమ్మని డాక్టరుగారికి చెప్పుము.

యశో:—పోనిమ్ము మేలుకొని యేమాలోచింపవలెను? ఎప్పుడైన పుట్టినిల్లు జ్ఞప్తికి వచ్చినను వెంటనే నిద్రపట్టును.

శ్యా—డాక్టరుగారు గుర్తురారా?

యశో:—ఎన్నఁడును రాదు. అయినను వారేల గుర్తునకు రావలెను? యిష్టము వచ్చినట్లు చెప్పినను నాకీ, కడుపునిండ తిని పోయిన పరుండియుందురని నాకు తెలియును గదా!

శ్యా:—అమ్మగో సుధాకరుఁడు కూడ లేచెను. నీవు మేలుకొన్న నితఁడేల నిద్రించును?

యశో:—అవునమ్మా. వీనికి దే నిద్రితప్పు టలవాటు. నాతో నిద్రించి నాతో లేచును. పూర్వజన్మమున నేదో యోగియై యుండును. చూడుము వీని నొసట నెట్లు బొట్టున్నదో? తప్పక యేదో యోగియే.

శ్యా:—యోగులు బొట్టు బోనములు పెట్టుకొనరు. పూర్వజన్మమున నితఁడేదో దొంగ పూజారియై యుండును. ఏరా! నీవెక్కడి పూజారివో చెప్పుము.

యశో:—వీనికి నీపిల్లను చేసికొందును.

శ్యా:—చాలునమ్మా తిట్లు చెల్లెలితో నన్నకు పెండ్లి యా?

యశో:—ఏమైనను నేను చేసికొందును. ఇంత అందగత్తె యగు కోడలు నాకింకొకచోట దొరకునా? చూడుము శ్యా—! వీని యొడలు వేడిగ నున్నట్లున్నది. అంతేనా, నాకట్లని పించుచున్నదా?

శ్యామల సుధాకరుని నొసట చేయివైచి చూచి 'అవునమ్మా యొడలు వెచ్చగ నున్నది. ఈజ్వర మెప్పుడు వచ్చినది? పాలు త్రాగుచున్నాఁడు గదా.

యశో:—ఇప్పుడే వరుండునప్పుడొడలు వెచ్చనుండెను. జలుబు చేసినదేమో. మవ్పటికప్పి పరుండబెట్టితిని.

మునకు నయముగును.

ఉదయముగునప్పటికి సుధాకరునిస్థితి మఱింత చెడెను. ముక్కువెంట నొక్కకేసిరు. జ్వరము తీవ్రమయ్యెను. కన్నులుబ్బెను. తల్లి వేఁబడెను. కాళ్ళుచేతు లాడించఁడు. కన్నెత్తియైన చూడఁడు. మంచముపై కదలకుండ పడియుండెను. ఎవరేమి పలుకరించుటయు నతనికిష్టములేనట్లుండెను కొంచెము దగ్గుకూడ నుండెను. యశోధరకు భయముచేసెను. శ్యామలకుఁగూడ డాక్టరుగారిని పిలిపింపవలె ననిపించెను. కాని యామెతల్లి డాక్టర్గవలన నేమియు ప్రయోజనము లేదు. స్పష్టముగ పిల్లవానికి దృష్టిదోషమే తగిలినది. డాక్టరువచ్చి యేమిచేయఁగలుగు' నని వాదించెను.

యశో:—ఇక్కడ దృష్టితగిలించు వారెవరమ్మా! ఇంతవఱకును బైటికైన పోలేదుగదా!

తల్లి:—దృష్టితగులుట కెవరో అక్కఱలేదు, ఒక్కొక్కని కన్నులే మంచివికావు. అట్టివానిదృష్టి తనంతనే తగులును. ఒకప్పుడు తల్లిదండ్రులదృష్టికూడ తగులుచుండును. వచ్చినప్పటినుండి యొక్కసారియైన నేడ్వ లేదు. వండ్లురాని పిల్లలుస్థితి యిట్లేయుండును. కన్నులు చూడు మెట్లున్నవో.

ఉబ్బి పొంగివచ్చినవి. అదేదృష్టి దోషమునకు గుర్తు.

మునలిపరిచారిక పొరుగుననున్న పంతులమ్మయు నీ మాట ననుమోదించిరి. గురువులువచ్చి "అమ్మా యిది దృష్టి దోషమే. మఱేమియు కాదు. కొంచెమాముదమును "గుడ్డ పేలికయుఁ దెప్పింపుఁడు సాయంకాలమునకు దేవుని దయవలన పిల్లవాఁడు పకపక నవ్వగలఁడ" నెను.

ఆముదము, గుడ్డపేలికలు తేఁబడెను. గురువులు పేలికల నొకవుడకగుఁజుట్టి యాముదమునముంచి వెలిఁగించి పిల్లవానిచుట్టును ద్రిప్పెను. మూఁడుసార్లు త్రిప్పి గోడకుఁ గ్రుచ్చెను దీపమునుండి నీటిబొట్లు పడెను. అందఱుస్త్రీలు నీవింతచూచి యాశ్చర్యపడిరి. ఇఁక నవ్వారికిని దృష్టిదోష మనుటకు సందియము లేకుండెను. గురువులు దీపమును మఱల పిల్లవాని చుట్టును ద్రిప్పెను. ఈసారి నీటిబొట్లు రాలలేదు. ఇది దృష్టిదోషము కొంతతగ్గెననుటకు సాక్ష్యమై యుండెను. గురువు లందఱికిని జెప్పి సాయంకాలము వత్తునని చెప్పి వెడలిపోయెను పిల్లవానిస్థితి రోజంతయు మఱింత యుధ్వాన్నముగ నుండెను దగ్గు హెచ్చి పోయెను. గురువులు రాత్రివచ్చి మఱల నాముదపువింత నొనరించెను. స్త్రీలందఱు నిశ్చింతులైరి. కాని రాత్రి యంతయు సుధాకరుఁడు దగ్గుచునే యుండెను. ఎన్నోసార్లు తఁడు కన్నులు తేలవైచెను. యశోధరయు శ్యామలయు దీపములవలె నుదయము వఱకు మేలుకొనియే యుండిరి. ఏదో యారాత్రి గండము తప్పెను. మఱునాఁడు శ్యామల తల్లి క్రొత్త పాట ప్రారంభించెను. 'గురువులు దృష్టిదోషము తప్పింపలేక పోయెను. ఈసారి భూమయ్య యొద్ద మంత్రము వేయింప

వలెను! యశోధర అప్పటికివి భర్తను తెలియఁజేయఁ జాలక పోయెను. పరిచారిక పిల్లవానిపై గుడ్డ కప్పుకొని భూపస్వ్య యొద్ద కేగి మంత్రము పెట్టించెను రాత్రికిఁ గూడ మంత్రము వేయింపఁబడెను. సుధాకరుఁడు కన్నెత్తియైన చూడలేదు. రాత్రి సుఖముగ గడచినచో మఱునాఁడు యశోధర భర్తను పిలిపింప నిశ్చయించుకొనెను.

కాని రాత్రి సుఖముగ గడవలేదు. అర్ధరాత్రమునకు నీకి పిల్లవాఁడూపిరివిడిచెను. యశోధర జీవిత సర్వస్వము చూచు చుండఁగనే అదృశ్యమయ్యెను.

పెండ్లికి ముందు చూచువారందఱికి ముదము గూర్చు చుండిన సుధాకరుఁడే నేఁడింటిలోని వారినందఱి నేడ్పించు చుండెను. ఏ ముగ్ధమోహనరూపము మాతృహృదయమును పల్లవింపఁజేయుచుండెనో అదియే నేఁడామె హృదయమును బ్రద్దలు చేయుచుండెను. అందఱును యశోధర నోదార్చు చుండిరి. కాని యామె యశ్రుధార లాగలేదు. ఎంతకును శాంతి లభింపకుండెను. అన్నిటికన్న భర్తకు తన మోము చూపించు టెట్లాయను చింత యెక్కువయ్యెను. వారికి కబురైన నంపలేదే!

రాత్రికి టెలిగ్రాము నిచ్చిరి. మఱునాఁడు డాక్టరు చల పతి తొమ్మిది గంటలకు సరికి కారుపై వచ్చెను. అతడు వచ్చిన కబురు విని యశోధర మఱింత వెక్కి వెక్కి యేడ్వ సాగెను. డాక్టరుగారెన్నో సార్లు లోనికివచ్చిరి. గాని యశోధర యాతని దరిచేరలేదు. ఆతని ముందు కేట్లగపడెను! మొగ

మెట్లు చూపవలెను? ఆమె తన తెలివి తక్కువచే నాయన జీవన సర్వస్వమును హరించి మట్టిపాలొనరించెను. అతనికడ కేగుట కామె గుండె బ్రద్దలగుచుండెను. తన యొడిలోని బాలకుని చూచి యామెకని కన్నులు మిలమిల మెఱయుచుండెను. పిల్లవాఁడెగిరి తండ్రి యొడిలోనికి దూకుచుండెను. తల్లి తిరిగి పిలువఁగ నతఁడు తండ్రి నంటుకొని పోవుచుండెను. ఎంత లాలించి బుజ్జగించినను తండ్రి యొడి వీడి రాకుండెను. తల్లి వానిని 'తండ్రివలె స్వార్థపరుఁడ'ను చుండెను. నేఁడెవని నొడియందుంచుకొని భర్తకడ కేగును? తన శూన్య హస్తములను జూచి యాయన గొల్లుమని యేడ్చునేమో. భర్త సమ్ముఖమున కేగుట కంటె మృత్యుముఖమున కేగుట యామెకు సులభ మనిపించుచుండెను. భర్త యెదురు పడునేమోయని యామె క్షణమైన శ్యామలను వీడకుండెను.

శ్యా:—సోదరీ! జరిగినదేదో జరిగియే పోయినది. ఎంతకాలమిట్లు వారికి దూరదూరముగ నుందువు? రాత్రికే వెళ్ళెదరని అమ్మచెప్పినది.

యశోధర సజల నేత్రయై—'ఏ మొగముతో నాయన మొగము చూడఁగలను? ఆయన యెదుటికరుగఁగనే కాళ్ళు తేలిపోయి పడిపోవుదునేమో యని భయము కలుగుచున్నది.

శ్యా:— నేనను నీవెంటవత్తును పద. ప్రక్కనే కనిపెట్టుకొని యుందును.

యశో:—నన్ను వదలి పాఱిపోయిరావు గదా!

శ్యా:—లేదు. పరుగెత్తికొని పోవను

యశో:—నాకిప్పటినుండి యేమొ పోవుగ వచ్చుచున్నది. ఇంతటి పిడుగుపడినను నేను బ్రతికియుంటినదే యాశ్చర్యము. సుధాకరుఁడన్న వారికి తగని ప్రేమ అక్కా! వారి హృదయమెల్లనుండునో. నాకు నేనే యేడ్పుదాన నాయన కేమి ధైర్యము చెప్పఁగలను? రాత్రికివెళ్ళెదరా?

శ్యా:—అమ్మ అట్లనుచుండెను. సెలవు తీసికొనలేదఁట.

ఉభయులును మగవారి గదికేగిరి. గది వాకిటికేగి యశోధర శ్యాములను పంపివేసెను ఒంటరిగ గదిలోనికేగెను.

యశోధరుఁ డెట్లుండెనో యని చలపతి యాతురతఁ జెందుచుండెను. మనమున వివిధములగు సందేహములుద్భవించుచుండెను. వెళ్ళవలెననుకొనును గాని వెళ్ళలేకుండెను. జీవితమంతయు శూన్యముగఁ దోఁచుచుండెను. మఱలనింతలో లాగుకొనుటకు దైవమేల నీపుత్రరత్నము నీయవలెనని లోలోన కుములుచుండెను. అతఁడు సంతానమునకై యెన్నఁడును దైవము నర్థించియుండలేదు. జీవితమంతయు నతఁడు సంతానరహితుఁడుగ నుండఁగలఁడు గాని పుట్టిపెరిఁగిన కుమారుని వియోగమతనికి దుర్భరముగ నుండెను. మనుష్యుఁడు నిజముగ నీశ్వరుని యాటబొమ్మయా? మానవ జీవితమింతేనా? పిల్లలు బొమ్మరింటి నిర్మాణమునకును, వినాశమునకును కారణములై నట్లతని జన్మమరణములకు నైతము కారణములు లేవా? పిల్లలకు తమ బొమ్మరిల్లన్నను, తమ కాగితపు పడవలన్నను, తమ కఱ్ఱబొమ్మలన్నను మమతయుండును. మంచి

మంచి బొమ్మలను వారు ప్రాణసమానముగ కాపాడు కొందురు. ఈశ్వరుడు బాలకుడేయైనను విచిత్రబాలకుడు.

దైవము చేసినదైనను బుద్ధి దీనినంతయు స్వీకరింపదు. అనంతవిశ్వమును సృజించిన దైవముద్దండ బాలకుడు కాజాలడు మన బుద్ధికందని సకల గుణముల నాతని కారోపింతుము. కాని యామహాగుణములలో నీయాటకాని తనమును జేర్పజాలము. యామముండగనే బాలకుల ప్రాణము హరించుట యేమిమాట! ఈశ్వరుడింక పైశాచికపుటాటలాడునా!

యశోధర గుట్టు చప్పుడు కాకుండ గదిలో ప్రవేశించెను. చలపతి లేచిసమీపమున కరుదెంచి 'నీవెచ్చట నుంటివి యశోధరా. నేను నీకై వేచియుంటి' ననెను.

యశోధర కన్నులలో గది యీదులాడుచున్నట్లుండెను. భర్త మెడను కౌగిలించుకొని వక్షముపై తన శిరము నుంచి యామె యేడ్వసాగెను. కాని యా యశ్రుప్రవాహముననే యామెకనంత ధైర్యము, వదాన్యమును నౌదార్యము లభించుచుండెను. పతివక్షఃస్థలమునంటియున్న యామె తన హృదయమునందొక విచిత్ర స్ఫూర్తియు బలమును ననుభవించుచుండెను. గాలికి రెపరెప కొట్టుకొను దీపమునకు తెరచాటైన చందమున నామె క్షుబ్ధహృదయము మొకింత ప్రశాంతి నందెను.

అశ్రుసిక్తమగు భార్య కపోలములనంటి చలపతి యశోధరా యింతగ వగచనేల! సుధాకరుడేమిచేయు నన్న

సందేశో యావని ముగించుకొని వెడలిపోయెను. మనకై కూర్చుండి యుండఁగలడా!' యనెను.

"వృక్షము జలఁ ప్రకాశముల సాయమున పెరిగి వృద్ధి చెందిన బలమైన గాలితాకుడునఁగాని సుదృఢము కానట్లు ప్రణయమును దుఃఖాఘాతములు లేనిది వికాసమందదు సుఖమున పాల్గొన నెందఱో మిత్రులరుదెంతురు కాని దుఃఖముఁ దోడ నేడ్చువారే పరమ మిత్రులు. దుఃఖమున కలిసి యేడ్చు నవకాశము లభింపని దంపతులు ప్రేమ నేమెఱుంగుదురు? సుధాకరుని మరణము నేఁడు మన భిన్నత్వమును తొలఁగించెను నేఁడే మన మొకరొకరి నిజస్వరూపమును దర్శించుకొంటిమి.

యశోధర మెల్లఁగా—"నేను దృష్టి తగ్గినదని మోసపోతిని. పాపము మీరాఁ వాని మొగమైన చూడలేక పోయితిరి. ఈమధ్య వానికెట్లు వచ్చినదో తెలిపి నేనేడ్చుచుం డుట చూచి నన్నోదార్చుచుండును. తన కష్టములనైన మఱచి నన్ను సవ్వించును. మూనాళ్ళలో నన్నిముచ్చటలు తీరి పోయినవి మందుమాకులుపైని నేను వేసికొన జాలనైతిని.

యశోధర కన్నులనీరు గిఱ్ఱున తిరిగెను. చలపతి యామె నక్కునఁ జేర్చికొని కరుణార్ద్ర స్వరముతో "ప్రియా! మందు మాకుల లోపము జరిగెనని యింటిలోని వారనుకొన కుండ నేఁటివఱకే వృద్ధుఁడైనను బాలకుఁడైనను నెచ్చటైన మరణించెనా?

యశో:—పాపము శ్యామల యెంతో సాయమొనర్చినది నేనొకటి రెండు కునుకులు నిద్రపోయినను నామె

మాత్రము దీపమువలె నట్లే కూర్చుండెను. రాత్రి యంతయు పిల్లవాని నెత్తుకొని తిరిగెడిది ఆ మెసాయము జన్మలో మఱువరానిది మీరు నేడే వెళ్ళుదురా!

చల:—అవును సెలవుతీసికొనుటకు వీలులేకపోయెను. సివిల్ సర్జన్ వేట్లాడ నేగియుండెను.

యశో:—ఆయన కెప్పుడు తెలయును?

చల:—జమీందార్లు, నుద్యోగస్థు లంతకన్న నేమిచేయుదురు?

యశో:—నేడు మిమ్ము బోనీయను.

చల:—నాకుగూడ సంతగ నిష్టము లేదు.

యశో:—అయిన వెళ్ళనేవలను. తెల్లిగ్రామమునందు రేపు నేనును మీవెంట వత్తును శ్యామలయు నచ్చును.

అచటినుండి వెడలిపోయిన పిమ్మట నామె హృదయ భారము తగ్గినట్లుండెను. భర్త యాడిన ప్రేమార్ద్రములగు మాటలామె శోకసంతాపములను హరించివైచెను. ప్రేమ యందనంత విశ్వాసము, అనంతధైర్యము, అనంతబలముగలవు.

---

## అష్టాదశ ప్రకరణము

ఆపద వచ్చినపుడు కేవల మాదుఃఖమేగాక పరుల విమర్శనవాక్యముల బాధకూడ సహింపవలసి వచ్చుచుండును. జనులందఱకును దెప్పిపొడుచుటకు తగిన యవకాశము లభించును. వారు నిరంతర మేదో యనుచునే యుందురు.

భార్గవుని మరణ మెల్లరకును నట్టినదవ రాశ మొనంగును. లోనిమూల లెవరెఱుంగుదురు! ప్రత్యక్షమునకిది సవతితల్లివనిగా కనుపించుచుండెను. ఎచటచూచిన నచట నిదియేచర్చ. దైవము బిడ్డలను సవతి తల్లులబారినుండి రక్షించుఁగాక. తన కొంపకు తానుగ నిప్పుపెట్టుకొనఁ దలంచువాఁడును, తన మెడకు తానుగ నురిపోసికొనఁగోరువాఁడును. పిల్లలుండఁగ రెండవపెండ్లి చేసికొనవలెను. సవతివచ్చినపిమ్మట పిల్లల సర్వ నాశనము కాకుండుట యసంభవము.

పిల్లలకై ప్రాణములిచ్చు తండ్రియే సవతిరాఁగానే వారికి ఘోరశత్రువై పోవును. అతని మతియే మాఱిపోవును. సవతిపిల్లలను తన పిల్లలను కొనునట్టి దేవియింతవఱకు జనింప లేదు.

లోకుల కింతమాత్రపు విమర్శతో తృప్తిలేకుండెను. కొందఱు సజ్జనులకు కేశవ మాధవులపై నంతులేని ప్రేమ జనించెను. వారిరువురు బాలకులయెడ నంతులేని సహానుభూతి ప్రకటింతురు. ఒకరిద్దరుస్త్రీలు తలపి తల్లి గుణశీలములను దలంచు కొని యప్పుడప్పుడు కన్నీరుకార్చుచుండిరి. అయ్యో! పిల్ల లివ్విధముగు దుస్థితి పాలగుదురని పాపమామె యేమియెఱుం గును! ఇపుడు పాలు వెన్నల నెవ్వరు పెట్టెదరు?

కేశవుఁడు:—" పెట్టకేమి " అనును.

ఏమిపెట్టుట నాయనా! పెట్టుట యనేక విధములుగ నుండును. సీళ్ళపాలు నేరుదుగ్గానికి కొందురు. త్రాగినను,

త్రాగకున్నను నెవరడుగుదురు? లేకున్న నొకరుచే పాలుపితికించి తెప్పింతురు. అపాల మొగము చెప్పకయే చెప్పుచుందును.

అప్పటి పాలే వేరు.

కేశవునకు తన తల్లి నాఁటి పాలరుచి గుర్తే లేదు. అతఁడేమియు అనలేక యూరకుండును. ఆనాఁటి తనయాకృతి సైతమాతని యూహాపథమున లేకుండెను. ఈపాతముల నత్వ భావమాతనిపై పడకుండ నెట్లుండును? అతనికి క్రమముగ తనయింటివారన్న కోపము జనించెను. ఇల్లు వేలమై పోయి యద్దె యింటికి వచ్చినమీఁదట శివరావున కద్దెచింత పట్టుకొనెను. శ్యామల వెన్న కొనుట నాపివేసెను. ఆరాబడిసైతము లేనపుడు ఖర్చెట్లు చేయఁగలుగుదురు? నొకరిద్దరును తీసి వేయఁబడిరి. కేశవునకే నిలుపుదల యంతయు కంటకముగ నుండెను. శ్యామల పుట్టినింటి కరిగిన పిమ్మట శివరావు పాలను సైతమాపివైచెను. క్రొత్తగ జనించిన కుమార్తె చింత వారి నిప్పటినుండి వేధింపసాగెను.

కేశవు డొడలుమండి—పాలాపిననే మీకు భవనములు లభించుచో తిండిని గూడ మానఁగూడదా?

శివ:—పాలు త్రాగవలెనను కోర్కె యంతగనున్నచో పోయి పితికించుకొని తెచ్చుకొనరాదా? నీళ్ళకు నేను సొమ్ము పోయఁజాలను.

కేశ:—పాలు పితికించుకొనఁ బోయినపు డేబడిపిల్లవాఁడైన చూచిన?

శివ:—మూడిననేమి? నాకొఱకే పాలు పితికించుకొనుచుంటి వని చెప్పను. పాలు తెచ్చుకొన్నట దొంగతన మేమియు కాదు.

కేశ:—అవును:— దొంగతనము కాదు. పాలు తెచ్చుచుండగ మిమ్మెవరైన జూచిన మీకు సిగ్గువేయుదా?

శివ:—బొత్తుగ వేయదు. నేను చేతులతో నీళ్ళ కావళ్ళు మోసితిని, ధాన్యపు మూటలు మోసితిని. మాతండ్రి లక్షాధికారి కాడు.

కేశ:—మాతండ్రి గర్భదరిద్రుడు కాడుగదా. నేనేల పాలు పితికించుకొన బోవలెను? అసలు మీరు నాకర్ల నేల తీసివైచితిరి?

శివ:—నాకు పూర్వమువలె నాదాయము రాకుండుట నెఱుంగవా? అంతమాత్రము తెలియని వాడవు కావుగదా.

కేశ:—అసలు మీ యాదాయ మేల తగ్గినది?

శివ:—నీకు బుద్ధిలేకున్న నేనేమి చెప్పగలను? బ్రతుకుపై రోతపుట్టి నేనేడ్చుచుండ వ్యాక్యము లెట్లు గైకొందును? తీసికొన్న నెట్లు చదివి సిద్ధము కాగలను? ఆ యుత్సాహమే లేదు. ఏదో రోజులు గడపుచు చావునకై వేచియున్నాను. కోర్కె లన్నియు భర్త తోనే పోయినవి!

కేశ:—అందుకే చేతులార చంపితిరి!

శివరావు మండిపడి—మూర్ఖుడా! ఇది దైవేచ్ఛ. ఎవ్వడైన తన చేతితో నురిపోసికొనునా?

కేశ:— దైవము నీకా వివాహము చేయ వచ్చునా?

శివరా వాగ్జాలక పోయెను. క్రోధోద్రేకమున వ
కుచు— 'నీవు నేడు యుద్ధము తలపెట్టి నడుముకట్టుకొంటివేమి
నీ యూతయేమో తెలియకున్నది. నాకు నీవేమియు పెట్టి
పోషించుటలేదు. నీవు గంజినీళ్ళు పోయునాడనుము. నీక
నేటివఱకు నాకుపదేశముల నొసంగు నధికారము రాలేదు
కొన్నాళ్ళు వినయము నేర్చుకొనుము. నేనుచేయు ప్రతి కార్య
మునకు నిన్ను సంప్రదించుటకు నీవు నా నలహాదారుడవా
నేను సంపాదించిన సొమ్ము నాయిష్టమువచ్చినట్లు ఖర్చు చే
కొందును. నీవు నోరెత్తుటకైన వీలు లేదు. నీవెన్నడైన మఱ
నిట్లు మూర్ఖముగ బల్కితివా జాగ్రత్త! పరిణామము బాగు
నుండదు. భార్గవునివంటి రత్నమును పోగొట్టుకొన్నను పో
ప్రాణములు నీవు లేవంతమాత్రమున పోవు.

ఇంత గట్టిగ చివాట్లుపెట్టినను కేశవుడు కదలలేదు
నిర్భయముగవయిన నీకారేమి చేసినను సైచిపడి యుండవలెననియ
నీకా భావము? మా కేకష్టము కలిగినను నోరెత్తకూడదా? న
కది చేతగాదు. అన్న వినయమునకు లభించిన బహుమానమ
మాత్రము నాకు వలదు. విషము తిని ప్రాణము లర్పించ
సాహసము నాకు లేదు. ఇట్టి వినయమునకు దూరమునుండిదే
నమస్కారము.

శివ:— నీకీ మాటలనుటకు సిగ్గువేయదా?

కేశ:— పిల్లలు తమ పెద్దలనే యనుకరింతురు.

శివరావు కోపము తగ్గెను. ఇక కేశవుఁడు తన మాట వినఁడని యతఁడు నిశ్చయించుకొనెను. లేచి వ్యాహ్యాళి కేగుచు నిఁక స్వీయింటి సర్వనాశనము దప్పదనుకొనెను.

నాఁటినుండి ప్రతిదినము తండ్రి కొడుకులకేదో జగడము జరుగుచునే యుండెను. శివరావు లొంగినకొలఁది కేశవుఁడు పెచ్చు పెరిఁగిపోవుచుండెనుఁ ఒకరోజున నతఁడు మేనత్తయగు వియ్యమ్మతో— "తండ్రికదాయని యూరకుంచుచున్నాను. లేకున్న నా స్నేహితులకు చెప్పి యొకరోజున మెత్తగ తన్నింపఁ గలము"ని చెప్పెను. ఈవిషయము శివరావునకుఁ దెలిసెను. పైకిమాత్రము లెక్కలేనట్లు ప్రవర్తించినను శివరావునకు లోన జంకు పుట్టెను. సాయఁతనము లందు షికారు మానివేసెను. ఇదొక క్రొత్తచింత నెత్తిపై కడినది. ఆమెనుగూడ నిర్లక్ష్య జడి పించునేమోయని శ్యామల నింతవఱకును తీసికొని రాలేదు. కేశవుఁ డెప్పుడో చాటుగ 'నిఁక నామె యింట కాలెట్టిదునో చూతునుగదా. దూరమునుండియే భీతుని నెట్టివేయకున్న నాపేరు కేశవుఁడు కాదనె'నఁట. ముసలివాఁ డేమిచేయఁగలడు! శివరావుకూడ తానతని నేమియు చేయఁజాలడని యెఱుంగును. బయటివాఁ డెవఁడైన నగుచో పోలీసుల కప్పగించి జైలున బంధింపఁ జేయఁగలఁడు. తన కుమారు నేమిచేయును? కొడుకుల యొద్ద తండ్రియాఁటలు సాగవని నిజమునే చెప్పిరి.

ఒకరోజున డాక్టరు చలపతి కేశవుని పిలిచి బోధింప సాగెను. కేశవున కాయనయన్న గౌరవము. కూర్చుండి నిశ్శబ్ద ముగ వినుచుండెను. అసలు నీకేమికావలయునో చెప్పుమని

డాక్టరు నొక్కి యడుగఁగ— "చెప్పుమనా! మీరేమియు ననుకొనరుగదా" యనెను.

డాక్టరు:— ఏమియు ననుకొనను. మనస్సులోని మాట స్పష్టముగ చెప్పివేయుము.

కేశ:— అయిన వినుఁడు. అన్నయ్య పోయినప్పటినుండి నాకు నాన్న మొగమున్న మంట. ఈతఁడే యన్నను జంపి నసిపించుచుండును. సమయము చూచుకొని మమ్మిద్దరనుగూడ చంపించునని నా యభిప్రాయము. ఆయన యూహా యది కాకున్న వివాహ మేల యాడెదరు?

డాక్టరుగారు నవ్వు నాపుకొని— మిమ్ము చంపుటకు వారు వివాహమేల యాడవలసి వచ్చెనో నాకర్థము కాకున్నది. వివాహము చేసికొనకుండ చంపలేరా?

కేశ:— చంపనేలేరు. అప్పుడు వారి మనస్సే వేరు. మేమన్న ప్రాణమిచ్చుచుండిరి. ఇప్పుడు మొగమైనఁజూడరు. వారిరువురుఁదప్ప యింటియం దితరులెవరును నుండ గూడదని వారియభిప్రాయము. ఇపుడు క్రొత్తగ పుట్టు పిల్లల కడ్డురాకుండ మమ్మిరువురను జంపవలెనని వారిద్దరి సంకల్పము. మమ్ము నానాబాధలుపెట్టి వెడలఁగొట్ట నెంచుచున్నారు అందుకే యిపుడు కచేరికైన పోకున్నారు. మేమిద్దరన్నదమ్ములము నేఁడు మరణించిన నింట పండుగ చేసికొందురు.

డాక్టరు:—మిమ్ము వెడలఁగొట్టనెంచిన మీపై నేదైన నేరము మోపుదురుగదా!

కేశ:—అందుకు నేను సిద్ధముగనే యున్నాను.

డాక్టరు:—ఏమిసిద్ధము చేసితివో చెప్పుము.

కేశ:—సమయము వచ్చినపుడు చూడుఁడు.

కేశవుఁడు వెళ్ళిపోసాగెను. డాక్టరెంత పిలిచినను వెనుకను తిరిగియైన చూడలేదు.

కొన్నాళ్ళతరువాత డాక్టరు కేశవుని మరల కలిసికొనెను. డాక్టరుకు సినిమాలన్న ప్రీతి. కేశవునకిఁక సినిమాలే ప్రాణము. డాక్టరు సినిమాప్రసంగముతో కేశవుసింటికి గొని వచ్చెను. సమయముకాఁగా నిరువురును భోజనమునకు లేచిరి. కేశవునకు భోజనము మిక్కిలిరుచించెను. 'మాయింట వంటవానిని తీసివైచినప్పటినుండి సరియైన భోజనమే లేదు. అత్తయ్యా వంట విధిలేక తినుటయేగాని కన్నెత్తియైన చూచబుద్ధి పుట్టదనెను.

డాక్టరు:—మాయింటివారు వండినపుడు భోజనమింతకన్నను రుచిగానుండును. మీ మేనత్త యుల్లిపాయల ముట్టదేమో.

కేశ:—బొత్తుగా ముట్టదు. ఉడికించి యుప్పుకారము మాత్రము చల్లును. నాకన్న కవరు తిన్నను తినకున్నను లెక్కలేదు. అందుకే వారువంటవానిని తీసివేసిరి. అంతడబ్బు లేని వారు రోజును నగలెట్లు చేయింతురో !

డాక్టరు:—అదికాదు కేశవా ! వారికిబొత్తుగ రాబడితగ్గిపోయి నది నీవు వారినెంతో యిబ్బంది పెట్టుచున్నావు.

కేశ:—(నవ్వి) నేనిబ్బంది పెట్టుచుంటినా? నేను వారితో నోరువిప్పి మాట్లాడిననొట్టు. నన్నప్రతిష్ఠ పాలుచేయుటయే వారిపని. ఎవ్వరును నన్నేమో అనుచుందురు. నా స్నేహితులన్నను వారికిమంటయే. ప్రాణస్నేహితులనువిడిచి యెట్లు బ్రతుకఁగలమో మీరేచెప్పుఁడు. నేను మష్టులతో స్నేహము చేయుటకంత మూర్ఖుఁడనా? మీవంటి వారిస్నేహము చేయుచున్నందుకే వారు నన్నేడ్పించుచుందురు. నా స్నేహితులు నాయింటికి రాకతప్పదు. ఎవరికెట్లున్నను నరేయని నిన్న ఖండితముగ చెప్పివైచితిని. అయ్యో! యెంతమంచి వాఁడైనను నిరంతరముపెట్టుపోరు నెట్లుభరించగలఁడు?

డాక్టరు:—అబ్బాయీ! వారన్న నాకు జాలికలుగు చుండును? న్యాయమునకు వారీయీడున సుఖముగ కాలుమీఁద కాలువైచుకొని బ్రతుకవలసినది. ఒకటి మునలితనము రెండవది చెట్టంతకొడుకు మరణించినదుఃఖము. పైఁగా నారోగ్యము సరిగనుండదు. అట్టివాఁడేమి చేయగలఁడు? ఎంతతక్కువచేసినను గొప్పయే యనవచ్చును. నీవేమిచేయఁజాలకున్నను వారిని నీసత్ప్రవర్తనవలన సంతోషపెట్టవలసినది. ముసలివానిని సంతోష పెట్టుటంత కష్టము కాదు. నీవు నవ్వుచు పలుకరించిననే వారికి కొండ లభించినట్లుండును. నాన్నా! మీ

యారోగ్య మెట్లున్నదని యడుగునంతలో నీకగు ఖర్మేమి! నీయుద్దండతను జూచి వారు లోలోన కుములుచుందురు. నేను నీకునిజము చెప్పుచున్నాను. వారు నాయెదుట నెన్నో మార్లేడ్చిరి. వివాహము చేసికొనుట పొరపాటే యనుకొనుము. దానిని వారొప్పుకొందురు. కాని నీకర్తవ్యమును నీవేల విస్మరింపవలెను! తండ్రిగాన వారిని నీవు సేవింపవలెను. వారి మనస్సునకు కష్టము కలిగించు నొక్కమాటేని నీవు పలుకరాదు. అందఱును నా సొమ్ము తినువారేగాని నన్ను పలుకరించు వారైన లేరని వారేల యనుకొనవలెను! కేశవా! నాయన్న నీకంటె చాల నెక్కువ. నేనింత వఱకు తండ్రిమాట కెన్నడు నెదురాడలేదు. వారు నేఁటికిని నన్ను కోపపడుచుందురు. నేను తలవంచుకొని వినుచుందును వారేమి చెప్పినను నా మంచి కొఱకే యని యెఱుంగుదును. తల్లిదండ్రుల కన్న మన హితైషు లన్యులెవ్వరుందురు? వారి ఋణమునుండి యెవరు విముక్తి నందఁగలరు?

కేశవుఁడు కూర్చుండి యేడ్వసాగెను. అతనిలో నింకను సద్భావములు లుప్తము కాలేదు. తన దౌర్జన్య మాతనికి కన్నులకుఁ గట్టినట్లగపడుచుండెను. ఎన్ని దినములనుండి యో యాతనికి యాలోచనయే కలుగలేదు. ఏడ్చుచు డాక్టరుగారితో-'నాకు చాల సిగ్గువేయుచున్నది. ఇతరుల మాటలను విని మోసపోతిని ఇఁకనుండి మీరు నన్నుగూర్చి యిట్టిమాటల

వినరు. మీరు నాన్నతో చెప్పి నాయపరాధములకు క్షమింపు మనుఁడు. నేను నిజముగ దురదృష్టవంతుఁడను. వారినెంతో బాధపెట్టితిని. నాయపరాధలను విస్మరించి క్షమింపుఁడని వారికి చెప్పుఁడు. లేకున్న నెటకేని లేచి పోవుటో, యేనూతనో పడి చచ్చుటో యుక్తము.

డాక్టరు తన యుపదేశ కుశలతకు మిక్కిలి సంతసించెను. కేశవుని కౌఁగిలించుకొని పంపివైచెను.

కేశవుఁడింటికి వచ్చుసరికి పదునొకండు గంటలయ్యెను. శివరావు భోజన మాచరించి యప్పుడే బయటికి వచ్చెను. అతనిని చూడఁగనే—'ఎన్ని గంటలైనదో తెలియునా? పన్నెండు సుమారైనది' నెను

కేశవుఁడు మిక్కిలి నమ్రతతో—డాక్టరు చలపతిగారు కలిసిరి. వారితో వారింటివఱకు వెళ్ళితిని. భోజనము చేయుమని బలవంత పెట్టుటచే నాగిపోవలసి వచ్చెను. అందుచే నాలస్యమైనది.

శివ:—డాక్టరు గారితో చెప్పకొని యేప్పుటకు వెళ్ళితివంతియే గదా? మఱేమైన పనియుండెనా?

కేశవుని వినయమునందు చతుర్థాంశ మిగిరిపోయెను— 'నాకితరులయొద్ద నేప్పుట మొత్తుకొనుట' యలవాటు లేదు.

శివ:—అవును, బొత్తుగ లేదు. నీనోట నాలుకయే లేదు. నాకు నీమాటలు చెప్పవారందఱును కల్పించియే చెప్పచుందురేమో!

కేశ:—అన్నిరోజుల విషయము కాదుగాని నేఁడు మాత్రము డాక్టరుగారి యొద్ద నేనట్టిమాట లేమియు నాడలేదు. వారి ముందాడిన మాటలన్నియు మీ మెుుండు నిర్భయముగ నాడుటకు సందేహింప నక్కఱలేదు.

శివ:—చాల సంతోషము. ఇఁక నేమి? నేఁటినుండి గురుదీక్ష గైకొంటివా? కేశవుని విషయము మఱొక చతుర్థాంశము మాయ మయ్యెను—శివదొంత్రి—'మానవుఁడు గురుదీక్ష గైకొనకుండగనే తన దుష్కర్మములకు లజ్జితుఁడు కాఁగలుగును. సంస్కరించుకొనఁ దలచినపుడు గురు మంత్రమే యవసరము లేదు.

శివ:—ఇఁక నుండి యింట తుచ్ఛులు ప్రోగుకారు గదా?

కేశ:—మీ రెవరెట్టివారో తెలిసికొనకుండ తుచ్ఛులను కొనుటకు తగిన కారణమేమియు లేదు.

శివ:—నీ స్నేహితులందఱును తుచ్ఛులే. నీచులే. ఒక్కఁడు గూడ మంచివాఁడు లేఁడు ఇంట వారిని ప్రోగుచేయ వలదని నేనెన్నో మార్లు నీతో చెప్పియుంటిని. నీవు విన లేదు. నేనిదే చివరిసారి చెప్పుచున్నాను వినుము. నీ వా పోకిరివారి నిఁక ముందింటఁ జేర్చితివో పోలీసు సాయము తీసికొనవలసి వచ్చును. జాగ్రత్త.

కేశవుని విషయ మింకొక చతుర్థాంశ మదృశ్య మయ్యెను-అదడిపడి-నరే అట్లే కానిండు. పోలీసులనే పిలిపింపుఁడు. వారేమి చేయఁగలరో యదియును జూచెదను. మా స్నేహితులలో పలువురు పెద్దపెద్ద పోలీసుద్యోగస్థుల కుమా

రులే. మీయంత మీరే నన్ను బాగుచేయఁ దలంచుచో నేనేల కష్టపడవలెను?

కేశవుఁడు విదలించుకొని గదిలోనికి వెడలిపోయెను. క్షణములో లోననుండి హార్మోనియము ధ్వని వినిపింపసాగెను.

సౌహృదయము వెలిగించిన దీపము వ్యంగ్యపు గాలి తాకుడున నిట్టే యారిపోయెను. మొండికి వేసిన గుఱ్ఱము బుజ్జగించఁగ కదలెను. కొరఁడాదెబ్బ పడుటతో తిరిగి బండిని వెనుకకు నెట్టసాగెను.

---

## ఏకోనవింశతి ప్రకరణము

యశోధరతో శ్యామల వచ్చివేయక తప్పలేదు. ఆమె పుట్టినింట మఱికొన్నినాళ్ళుండఁ దలచెను. కాని శోకాతుర యగు యశోధర యొంటరిగ నెట్లుండఁగలదు? ఆమెకొఱకే బయలుదేఱవలసివచ్చెను. వియ్యమ్మ సుబ్బితో 'చూచితివఁటే. అమ్మగారెంత యొత్తరిమై వచ్చెనో!' యనెను.

సుబ్బి:—అమ్మా! తల్లిపెట్టినపెట్టు వృథాయగునా?

వియ్యమ్మ:—అవునే సుబ్బి. పెట్టిన తల్లియే పెట్టవలెను.

శ్యామలకు తనరాక యెవరికిని సంతోషప్రదము కాదని తెలియును. శివరావు తనసంతస మెంత వెలిబుచ్చినను హృదయ

గతమును చింతలను మాత్రము దామకొనఁ జాలకపోయెను. శ్యామల పిల్లకు జ్యోతి యని పేరుపెట్టెను. నిజముగ నామెయే తన యాశాజ్యోతివలె నుండెను పిల్లనుచూచి యామె తన చింతలనన్నిటిని మఱచుచుండెను. శివరావు పిల్లను తన యొడిలోనికిఁ దీసికొనఁబోఁగా నామె యేడ్చి పరుగెత్తికొని పోయి తల్లిని కౌఁగిలించుకొనెను. తండ్రినామె గుర్తెపట్టలేదు. శివరావు మిఠాయిచూపి యాశపెట్టఁదలంచెను. ఇంటియందుండవ దును నౌకరులేఁడు. వెళ్ళి యొకబేడ మిఠాయితెమ్మని మాధవుని౯ంపెను. కేశవుఁడచటనే కూర్చుండియుండెను. 'మాకేశవు దును మిఠాయి యక్కఱలేదుగదా!' అనెను.

శివరావు చీదలించుకొని—'మీరు చంటిపిల్లలా యేమిటి' అనెను.

కేశ:—కాదు. మునసబ్బు మీ. మిఠాయి తెప్పించిచూడుఁడు. పిల్లలమో పెద్దలమో తెలియఁగలదు. మఱొకసారులా బైటికిఁదీయుడు. జ్యోతిపుణ్యమాయని మానోరుకూడ తియ్యవడును.

శివ:—నాయొద్ద నిపుడు పైకము లేదు. పోరామాధవా— త్వరగా రమ్మి.

కేశ:— మాధవుఁడుపోఁడు. వాడెవ్వరికిని నౌకరుకాఁడు. జ్యోతి తనతండ్రికికుమార్తయైన వాఁడుకూడ తన తండ్రికి కుమారుఁడే.

శివ:—ఎందుకిట్లు పిచ్చిగా వాగెదవు? చంటిపిల్లతో పోటీపడు
పడుటకు నీకు సిగ్గువేయుట లేదా ? పోరా మాధవా !
ఇందుగో డబ్బు.

కేశ:—పోవద్దు మాధవా! నీవెవ్వరికిని నాకరువుగాను.

మాధవుఁడు సందేహమునఁ బడెను. ఎవరిమాట విన వలెను? చివరకతఁడు కేశవుని మాటవినుటకే నిశ్చయించు కొనెను. తండ్రి అంతగా కష్టముకలిగిన నాలుగుచీవాట్లుపెట్టి యూరకుండును కాని కేశవుఁడు కొట్టిచంపును. ఇఁక తానెవ రితో చెప్పుకొనఁగలుగును ? అందుచేనతఁడు పోననెను.

శివరావు గద్దించి—'సరే నాకడ కేవస్తువైనను కావలె ననిరమ్ము చూతు' మనెను.

శివరావు తానే బజారునకేగి యొకరూపాయి మిఠాయి తెచ్చెను. రెండణాల మిఠాయినడుగుట కతనికి సిగ్గువేసెను. ఎఱిఁగియున్న దుకాణదారుఁ డేమనుకొనునో !

మిఠాయితీసికొని శివరావింటికి వచ్చెను. మాధవుఁడు పెద్దపొట్లముచూచి తండ్రిమాట నొప్పుకొననందులకుఁ జింతించెను. ఇపుడు తానేమొగముతో నింటిలోనికేగును ? ఎంత పొరపాటైనది! అతఁడు లోలోనఁ గేశవుని దెబ్బల చుఱుకును మిఠాయి తియ్యఁదనమును పోల్చుకొన సాగెను.

ఇంతలో సుబ్బి రెండు పళ్ళెరములతో మిఠాయి గొని వచ్చి పిల్లలిద్దరిముందు నిడెను. కేశవుఁడు మండిపడి—'నాకు వద్దు తీసికొనిపొమ్మ' నెను.

సుబ్బి:—కోపమెందుకు బాబూ! మిఠాయి మీకురుచింపదా?

కేశ:—మిఠాయి జ్యోతిక్కై తేఁబడినది మాకొఱకుఁగాదు. తీసికొనిపో. లేనిచో వీధిలో పాఱవైచెదను. మాకు దమ్మిడివైన దొరకనిది రూపాయి యెటనుండివచ్చెనో.

సుబ్బి:—మాధవయ్యగారూ! మీరైన తీసికొనుఁడు. వీరు తీసికొనకున్న నేమి?

మాధవుఁడు భయపడుచు చేయిచాచెను. కేశవుఁడు కన్నులెఱ్ఱచేసి—"మిఠాయి ముట్టవద్దు. చేయి విఱుగఁగొట్టెదను పినాసివాఁడా!" అనెను.

మాధవుఁడుజడిసి యూరకుండెను. మిఠాయి తీసికొను సాహసమతనికి లేకుండెను. శ్యామల యిద్దరను బుజ్జగింపఁబోఁగా శివరావు వద్దని యానపెట్టెను.

శ్యా:—మీకు తెలియదీ కోపమంతయు నామీఁదనే.

శివ:—ఏమైనఁజేసిన సవతిపిల్లలను వేధించుచున్నాఁడని అందురని యూరకుండుచున్న కొలఁది నెత్తికెక్కుచున్నారు లేకున్న నొక్కక్షణములో వీరిరోగము కుదుర్పఁగలను?

శ్యా:—నాకును నదేయప్రతిష్ఠ వచ్చునని భయము.

శివ:—ఇఁక నేను జంకను. ఎవరేమనుకొన్నను సరే.

శ్యా:—ఇదివఱకితఁడీ మూర్ఖత నెఱుంగఁడు.

శివ:—వాఁడు నన్నే పిల్లలుండఁగ నేలవివాహమాడితి రనుచున్నాఁడు. మీరే భార్గవుని విషముపెట్టి చంపితిరను

టకుఁగూడ వాఁడు వేసుదీయుచున్నాఁడు. వీఁడు కడుపున బుట్టిన కొడుకుగాదు. గర్భశత్రువు.

కేశవుఁడు మిఠాయినిగూర్చి భార్యాభర్తలేమనుకొందురో వినుటకై తలుపుచాటున నక్కియుండెను. శివరావు చివరిమాటవిని యూరకుండలేకపోయెను. 'శత్రువుగాకున్న నావెంట నేలపడెదరు? మీరీనాఁడు క్రొత్తగాఁ జెప్పనక్కరలేదు. నాకేనాఁడో తెలియును. అన్నయ్యకు తెలియఁదేమో మోసపోయెను. నాయొద్ద మీపప్పులుడకవు. లోకమంతయు మీరే విషముపెట్టి యన్నను జంపితిరని వేనోళ్ళ ఘోషించుచున్నది. నేననినచో మీకేల కోపము?

శ్యామల నిస్తబ్ధ యయ్యెను. తన దేహము నెవరో అగ్నియందు పారవైచినట్లుండెను. శివరావు కేశవుని కసరి నోరు మూయించవలె ననుకొనెను. కాని అతఁడు దెబ్బకు రెండు దెబ్బలతో సమాధాన మిచ్చుచుండెను. చివరకు శ్యామలకుఁ గూడ నాతనిపై కోపము వచ్చెను. చిన్న పుట్టి కుట్టివాఁడు కన్నులెఱ్ఱఁజేసి యింటిలోని వారందఱిని జడిపించునా? తాను దమ్మునికి కొఱగాఁడు. అందఱికిని పెట్టి పోషించువానికైన తగదే. ఆమె కోపోద్రిక్తయై-'చాలు నిఁక కట్టిపెట్టు కేశవా! నీమంచితనము తెలిసివచ్చినది బయటికి నడువుము.'

శివరా వింతవఱకును జంకుచున్నవాఁడు శ్యామల యూతగొని యుద్ధృతత్వము వహించి పండ్లు పటపట కొఱుకుచు కేశవునిపై కురికెను. శ్యామల యడ్డు పడకముందే ఫెళ్ళున

దెబ్బ పడెను. ఆదెబ్బ యస్థానపడిన శ్యామల చెంపకుఁ దాకెను. ఆమె తల గిఱ్ఱునఁ దిరిగిపోయెను. నడలిన శివరావు చేతులలో నింత శక్తి యుండెనని యామె కంతవఱకు దెలియదు. తల పట్టుకొని కూర్చుండెను. శివరావు కోపతీవ్రత తగ్గలేదు. మఱొక సారి పిడికిటితో గ్రుద్దుటకు సన్నద్ధుఁడు కాఁగా కేశవుఁడతని చేయి పట్టుకొని వెనుకకు నెట్టెను. 'దూరమునుండి మాట్లాడుము. అనవసరముగ నేల అగౌరవము కొని తెచ్చుకొందువు? అమ్మను జూచి యూరకుంటివి. లేకున్న సిరోజాన అటో ఇటో తేల్చివైచి యుందును.'

కేశవుఁడు బయటికి వెడలిపోయెను. శివరావచేతనుఁడై నిలిచియుండెను. ఆక్షణమున కేశవునిపై దైవికముగ పిడుగు పడి అతని తల వేయిచెక్కలైన శివరావు హృదయమునకు పరమానందముగ నుండెడిది. తనయొడి యుండెత్తుకొని యేకుమారునల్లారు ముద్దుగ పెంచెనో అతనిఁగూర్చియే నాఁడతని మనమున అనేకములగు దుస్సంకల్పములు జనించుచుండెను.

విద్యమ్మ యింతవఱకును తన గదియందే కూర్చుండి యుండెను బయటికరుదెంచి "కొడుకు తన యంతవాఁడైన విమ్మట చేయి చేసికొనుట కూడద"నెను.

శివరావు పెదవులు బిగించి—'నేను వీని నింటినుండి వెడలఁగొట్టెదను. ముష్టి యెత్తుకొనని నిమ్ము. కన్నములు వేయనిమ్ము. నాకవసరము లేదు.

విద్యమ్మ:—అప్రతిష్ఠ యెవరికి ?

శివరావు:—నాకాలెక్కలేదు.

శ్యామల:—నాతో సీతుపాను సైతము వచ్చునని యెఱింగిన రాకయే యుందును. ఇప్పుడైననేమి. నన్ను పంపి వేయుఁడు. ఈయింట నేనుండఁజాలను.

విద్యా:—నీవన్ననే అతనికి కొంతగౌరవము. లేకున్న నేఁడే మయ్యెడిదో!

శ్యా:—ఇంకేమి కావలెనువదినే! ఎంతజాగ్రత్తవహించి నడచుకొనుచుండినను రావలసిన అప్రతిష్ఠ తప్పనేతప్పుట లేదు. ఇంటనడుగుపెట్టి క్షణమైనఁ గాకముందే యింత పనియైనదిగదా! దైవేచ్ఛ యెట్లున్నదో!

రాత్రి భోజనమునకెవరును లేవలేదు. శివరావొక్కఁడు మాత్రము తినెను. ఇఁక నీజీవితమెట్లు వెళ్ళునా అనుచింత శ్యామల నేడ్పింపసాగెను. తనకదుపొక్కటేమైన నంతదిగులు లేదు. ఈపిల్లగతి యేమికానున్నదో!

---

## వింశతిప్రకరణము

దుఃఖములందు నిద్దరసైతము సాయమువీడును. శ్యామల మంచముపై నటునిటు మసలుచుండెను. నిద్రవచ్చిన బాగుగానుండునని యెంతో యనుకొనెను. రానని నిద్రకూడ పతినపట్టినట్లుండెను. దీపము తీసివైచి కిటికిరెక్కలు తెఱచెను.

టికుటిక్కుమను గడియారమునుగూడ తీసికొనిపోయి అవతలిగదియందుంచి వచ్చెను. కాని నిద్రఅనుమాట రాకుండెను. ఆలోచించినమాటలనే తిరిగి తిరిగి యాలోచించెను. ఇంక పట్టిమాటలుగూడ నైపోయెను. అప్పటికిని కునుకు రాలేదు. మరల దీపము వెలిగించి యేదోపుస్తకము చదువనారంభించెను. నాలుగైదు పుటలు చదువునప్పటికి నిద్దురవచ్చెను. పుస్తకమట్టే తెఱచియుండి పోయెను.

అంతలో కేశవుఁడు గదిలోన కాలిడెను. అతని కాళ్ళు గడగడ వణఁకుచుండెను. అతఁడు గదినంతయు కలయఁజూచెను శ్యామల నిద్రించుచుండెను. ఆమె తలవైపున కూటికుండొక యిత్తడిపెట్టె యుండెను. కేశవుఁడు పిల్లివలె గుట్టుచప్పుడు కాకుండ నేగి నెమ్మదిగ పెట్టెతీసికొని గదినుండి శీఘ్రముగ వెడలిపోయెను ఆక్షణముననే శ్యామల కన్నులు తెఱచెను. ఉలికిపడి లేచి నిలబడెను. గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. అతఁడు కేశవుఁడు కాఁడుగదా? నాగదిలోని కేమిచేయవచ్చెను? నాకే భ్రమ కలిగెనేమో! వదిన గదిలోనుండి వచ్చెనేమో! అతని కిచట నేమిపని? నాతో నేమైన చెప్పవచ్చెనేమో. అయినను నీసమయమున చెప్పుటకేముండును? అతని యుద్దేశమేమైయుండును? ఆమె హృదయము కంపించిపోయెను.

శివరావు డాబామీఁద నిద్రించుచుండెను. పోయి యతనిని మేల్కొల్పవలె ననుకొనెను. కాని సాహసము చాల లేదు. వట్టి అనుమానపు మనుష్యులు. ఏమనుకొని యేమిచేయ సిద్ధమౌదురో! తిరిగి వచ్చి యాపుస్తకమునే చదువ నారం

భించెను. ఉదయమున నడిగిన వచ్చియు తెలుపు. నేనే భ్రమ పడితినేమో! నిద్రయందప్పు డప్పుడిట్టి భ్రమ కలుగుచుండుట కద్దు. ఉదయమున నడుగుదమని నిశ్చయించుకొన్నను నాకెంతకు నిద్దుర పట్టలేదు.

ఉదయమున నామె స్వయముగ కేశవునకు ఫలహారము గొంపోవ నామెను జూచి యతండులికి పడెను, ప్రతి దినము నుబ్బి వచ్చుచుండగ నేడీమె యేల వచ్చినది! ఆమె వంక జూచుట కతనికి ధైర్యము చాలకుండెను.

శ్యామల యతని నాదర పూర్వకముగ జూచి 'రాత్రి నీవు నాగదిలోనికి వచ్చితివా' యని అడిగెను.

కేశవుం డాశ్చర్యము నభినయించి—'నేనా! రాత్రి మీగదికా! నా కేమిపని యున్నదట! ఎవడైన వచ్చెనా?

శ్యామల యతని మాటల విశ్వసించినట్లుగ—'అవు నెవరో వచ్చి గదినుండి యీవలి కేగినట్లు భ్రమ కలిగెను. నేనా తని మొగము మాత్రము చూడలేదు. నీవుమాత్రము చూచి నీవేమైన వచ్చితివేమో యనుకొంటిని. ఎవడు వచ్చెనో యెట్లు తెలుపు! ఎవడో మాత్రము తప్పక వచ్చెను. ఇందు సందేహ మావంతయు లేదు.

కేశవుడు తాను నిరపరాధి యని నమ్మకము కల్గింప ప్రయత్నించుచు-'నేను రాత్రి సినిమా చూడనేగితిని. చూచి యటనుండియే యొక మిత్రునింట పరుండ బోతిని. ఇప్పుడే వచ్చి క్షణము సేపైనది. నావెంట నెంతోమంది స్నేహితులు

సైతముండిరి. ఎవరినైన నడిగి చూడుఁడు నాకుమాత్రము సుహాభయము. ఏదైన వస్తువు పోయిన నామీఁదికి వచ్చి పోవునేమో యని నిరంతరము జాగ్రత్తగ నుందును. దొంగ నవరును బట్టజాలరు. ఇఁక నేరము నానెత్తిని బడును. నాన్నను మీరెఱుంగుదురు గదా, నన్నుఁ జంపవచ్చునను.

శ్యామల:—నీమీఁది కేల వచ్చును? నిజముగ నీవే తీసినను నిన్నెవరును దొంగ యనఁజాలరు. పరుల వస్తువైన దొంగిలింపవలసి యుండును. తన వస్తువే యైనపుడు దొంగతనమేల చేయవలయును?

ఇంతవఱకును శ్యామలదృష్టి తన యిత్తడిపెట్టె పైకి పోలేదు. ఆమె వంటచేయసాగెను. శివరావు కచేరికి పోయిన పిమ్మట నామె యశోధరను కలియఁబోయెను. చాలకాలము నుండి యామెను చూడలేదు. పైఁగా రాత్రిజరిగిన దామెతో చెప్పి యావిషయము మాట్లాడవలెను. సుబ్బితో—'గదిలో నుండి పెట్టెతీసికొనిరావే' అనెను.

సుబ్బి తిరిగివచ్చి—'అక్కడ పెట్టెలేదు. ఎక్కడపెట్టిరో యేమో!' అనెను.

శ్యామల కోపముతో—'ఒక్కసారిగ నీచేతనే పనియు కాదు. అక్కడకాక మఱెక్కడ నుండును? బీరువాలో చూచితివా?

సుబ్బి:—లేదమ్మగారు! అబద్ధమేల యాడవలెను. చూడలేదు

శ్యామల పక్కన నవ్వెను. 'పోయి చూచిరాపో' అనెను.

సుబ్బి క్షణములో వట్టిచేతుల్తో తిరిగివచ్చెను. 'బీరు వాలో కూడ లేదు, ఇంక మీరెక్కడ చూచుకునిన వక్కడ చూతు' ననెను.

శ్యామల యదరిపడిలేచి—ఏ కీశ్వరుండు కన్నులేల యిచ్చెనో తెలియదు. నీవు చూచుచుండఁగనే యాగదివంది తెత్తునో లేదో చూచుమనెను.

సుబ్బికూడ వెంటగదిలోనికేగెను. శ్యామల గూటి వంకఁజూచెను. బీరువాఅంతయు గాలించెను. మంచము క్రింద తొంగిచూచెను. పెద్దపెట్టె తెఱచివెదకెను, నగలపెట్టె యొచ్చ టను కనుపింపలేదు. పెట్టెయేమైనదాఅని యాశ్చర్యమంద సాగెను.

అంతలో రాత్రిజరిగిన సంఘటనము మెఱుపువలె కన్నులముందు మెఱసెను. హృదయము దద్దరిల్లెను. ఇంత వఱకును నిశ్చింతగ వెదకుచున్న యామె కాకస్మికముగ నొడలంతయు తీవ్రజ్వరము వచ్చినట్లుండెను. వెదకఁదగినచోట తగనిచోట నన్నితావులయందును మూటి మూటికిని గాలించెను. ఎక్కడను పెట్టెలేదు. అంతపెద్దపెట్టె పఱపుక్రింద నెట్లుండును! అయినను పఱపుక్రిందసైతము చూచెను. క్షణక్షణమునకు మొగము కళ దప్పుచుండెను. ప్రాణములు క్రుంగిపోవు చుండెను. చివరకు నిరాశాపాత్రమై గుండెబాదుకొని యేడ్వ సాగెను.

స్త్రీకి సర్వస్వము నగలే. తనభర్త యాస్తిపాస్తులయం దధికారములపై నామె కధికారముండదు. ఆమెకు నగలబలమే బలము. అదే గౌరవము. శ్యామలకు నైదారువేలరూపాయల నగలుండెను. ఆనగలనన్నింటి నలంకరించుకొని బయటికేగిన యొక్కక్షణమునకైన నామె యుల్లాసము నందుచుండెను. ఒక్కొక్కనగ యొక్కొక్క మహావిపత్తునుండి రక్షింపఁగల దివ్యాస్త్రమువలె నుండెను. దైవానుగ్రహమున్న నామె యితరులయెదుట చేయిచాపనవసరములేదు. ఈనగలనే నాశ నొనరించుకొని తానును తనపిల్లయు దుఃఖసాగరము తరింపఁగలరు. తనకేదింతయు నవసరము లేదు. ఏదియెటుపోయినను నగలను మాత్ర మెవరును లాగికొనలేరు. నేఁడివి శృంగారములు. రేపటి కాధారములగును. ఈయాలోచనలతో నామె యెంత సంబరమందుచుండెను! ఆసంపదయే నేఁడామె చేయి దాటిపోయెను! ఇపుడామె నిరాధార. ప్రపంచమునందామెకే యాలంబనమును లేదు. ఏసాయమును లేదు. ఆమె యాశలన్నియు భగ్నమై పోయెను. దైవమా! ఇంతమాత్రమైనచూడలేక పోతివా! ఇదివఱకే కాలుసేతులు విరిగి కూర్చున్న నా కన్నను సైతము పెఱికి వైచితివా! ఇపుడామె యెవరిని యాచించును? ఎవరి వాకిట భిక్షమెత్తును? ఆమె యొడలంతయు చెమ్మటలు గ్రమ్మెను. ఏడ్చి యేడ్చి కన్నులు వాచి పోయెను. శ్యామల తలవంచుకొని యేడ్చుచుండ వియ్యమ్మ ధైర్యము చెప్పుచుండెను. కాని యామె యశ్రువులు శోకజ్వాల నార్పఁజాలక పోయెను.

మూఁడు గంటలకు కేశవుఁడు బడినుండి తిరిగి వచ్చెను అతనిరాక నెఱింగి శ్యామల విక్షిప్తయై లేచి గది వాకిటకేగి 'నాయనా! పరిహాసమునకుఁ దీసిన నిచ్చివేయుము. అనకే యేడ్పుడి వన్నేడ్పించిన నీకేమి లాభ'మనెను.

కేశవుఁడొక్క క్షణము కాతరుఁడయ్యెను. చోరవిద్య యందతఁ డింకను ప్రవీణత నందలేదు. ఇతరుల బాధ పెట్టి యానందించు నంత కఠోరత యాతని కింకను నలవడలేదు. పెట్టె యాతని యొద్దనే యుండి, తిరిగి గూటిలో పెట్టు నవకాశమతనికి లభించి యుండిన నతఁడట్లే చేసియుండెడివాఁడు. కాని పెట్టె అప్పటికే యాతని చేయి దాటిపోయినది. స్నేహితులా పెట్టెను దుకాణమునకుఁ జేరవేసి కానికి ముగ్గానికి నమ్మివేసిరి. దొంగల కట్టడమే శరణ్యము! 'అమ్మా! మీతో నాకు పరిహాసమా? మీరింకను నన్ను శంకించుచున్నారా? నేను రాత్రి యింటియొద్ద లేనని చెప్పినను మీకు విశ్వాస మొదవుటలేదు. నన్ను మీరింత నీచునిగ భావించుట నాకర్మ మనె'ను.

శ్యామల కన్నీరు తుడుచుకొనుచు—'నేను నిన్ను శంకింపను నాయనా! నీకు దొంగతన మాపాదించుటకుఁగాదు. పరిహాసమునకు తీసితివేమో యని అడిగితి' ననెను.

కేశవుని దొంగయని యామె యెట్లు సందేహింపఁ గలదు! లోకము తల్లిలేని పిల్లఁడు గాన దొంగతన మారోపించి రనును. తిరిగి అదియు తన కప్రతిష్ఠయే యగును.

కేశవుఁడోదార్చుచు—'పోయి చూచెదము రండు ఏలెవరెత్తుకొని పోయిరి! దొంగ అసలే త్రోవను వచ్చెనో!' యనెను.

సుబ్బి:—దొంగలు వచ్చుటకేమి కావలెను? ఎలుక కన్నముల నుండి గూడ దూరివత్తురు. ఈయింట నెచట చూచి నను కిటికీలే గదా!

కేశ:—బాగుగ వెదకితిరా?

శ్యా:—ఇల్లంతయు గాలించి వైచితిమి. ఇంకెక్కడని వెదకఁగలము?

కేశ:—మీరందఱు కుంభకర్ణులవలె నిద్రపోదురు... ఎవరు వచ్చిన మీకేమి తెలియఁగలదు?

నాలుగు గంటలకు శివరావు కచేరినుండి వచ్చెను. శ్యామలను చూడఁగనే యాశ్చర్యపడి యారోగ్యము బాగుండ లేదా' యని అడిగెను. ఏమియు బాధలేదు గదా యనుచు నతఁడు జ్యోతి నాఁడిలోనికిఁ దీసికొనెను.

శ్యామల జవాబేమియు చెప్పఁజాలక యేడ్వసాగెను.

సుబ్బి కల్పించుకొని—ఇట్లిన్నాఁడును జరుగలేదు. నా బ్రతుకంతయు నీయింటనే గడచినది. నేటివఱకొక్క కాసైన పోయి యెఱుఁగము. లోకమంతయు సుబ్బి తీసినదనును. ఆ దైవకృప యెట్లున్నదో!' అనెను.

శివరావు తనతోటు బొత్తాములు విప్పుకొనుచున్న వాఁడు తిరిగి బిగించుకొనుచు—'ఏమైనది? ఏమైన దొంగతనము జరిగినదా?' యనెను.

సుబ్బి:—అమ్మగారి నగలన్నియు మాయమైనవి.
శివ:—ఎక్కడ పెట్టిరి?

శ్యామల వెక్కిళ్ళు నాపుకొనుచు రాత్రి జరిగినదంతయు వర్ణించి చెప్పెను. కాని కేశవుని వంటి వాడొకడు తనగదిలోనికి వచ్చి వెళ్ళిన యుదంతము మాత్రము చెప్ప లేదు. శివరావు నిట్టూర్చి 'దైవము కూడ మిక్కిలి కఠినుఁడు వచ్చిన వారినే చంపును. మనకు చెడు దినములు వచ్చినవి. అయినను దొంగ యెటనుండి వచ్చెను? కన్న మెచటను లేదే. వచ్చు త్రోవ యెంకెచటను లేదు. నేనేమి పాప మొనర్చితినో యీ విధముగ శిక్ష ననుభవించు చున్నాను. నగలపెట్టె గూటిలో పెట్టవద్దని యెన్నిసార్లు చెప్పితిని. విను వారెవరు!'

శ్యా:—ఇట్లు పిడుగు పడునని నాకేమి తెలియును!
శివ:—రోజులన్నియు నొకతీరున గడవవని మాత్ర మెఱుంగుదువుగదా. నేఁడు చేయింపనెంచిన పదివేలకు తక్కువగావు. నేఁటి మనగతి నీకు తెలియనిదా? ఇల్లు గడచుటయే దుష్కరముగ నున్నది. నగలు చేయించుట దైవ మెఱుంగును. పోయి పోలీసులకు తెలిపి వచ్చెదను. కాని దొరకుట మాత్ర మసంభవము.

శ్యామల నివారించుచు—'దొరకవని తెలిసినప్పుడింక పోలీసుల కేల తెలుపవలెను?

శివ:—మన సెట్లొప్పుకొనును? ఇంత సొమ్ము పోయినపుడు మాటాడకుండ నూరకుండఁ గలమా?

శ్యా:—దొరకవలసి యుండిన నేలపోవును? అదృష్టము లేనపు డెట్లాగును?

శివ:—వ్రాసిపెట్టియున్నచో దొరకును. లేకున్న పోనే పోయి నవిగదా.

శివరావు గదినుండి బయటికి వెడలెను. శ్యామల యాతని చేయిపట్టుకొని—'నామాటవిని యూరకుండుము. వచ్చు టకుబదులు పై పెచ్చువారికే యీయవలసి వచ్చునేమో' యనెను.

శివరావు చేయి విడలించుకొని—'నీవును పిల్లలవలె ముందికివేయుచుందువు. పదివేలరూపాయలను ప్రయత్నించ కుండఁగనే వదలిపెట్టఁగలమా? నే నందుకేడ్చి మొత్తుకొనుట లేదు. కాని నా మానసికబాధ నైదవమెట్టుంగును. ఈదెబ్బ నూటిగ నాగుండెకుఁ దగిలినది. శివరావా పై మాట్లాడఁజాలక పోయెను. కంఠము రుద్ధమయ్యెను. వేగముగ గదినుండివెడలి సూటిగనతఁడు పోలీసుస్టేషనుకు చేరెను. సబ్ యిన్స్పెక్టరున కతఁడన్న మొగమోట ముండెను. అతనిని శివరావొకపరి లంచగొండితనపు నేరమునుండి శిక్షపడకుండ రక్షించి యుండెను. అతఁడు శివరావు వెనువెంటనే యాచూకి తీయ వచ్చెను. పేరు సమ్నాసాహెబ్

సాయంకాలమయ్యెను. సమ్నా యింటిచుట్టును తిరిగి కలయఁజూచెను. లోనికేగి శ్యామలగది పరికించెను. పైకిపోవు

మెట్లు పరీక్షించెను. ఆవీధిలోని నలుగురైదుగురు పెద్ద మనుష్యులతో గుసగుసలాడెను. శివరావుతో అయ్యా! అల్లాపై నొట్టు. ఇదిమాత్రము పైవారుచేసిన పనికాదు. ఎవరైన బయటివాఁడు చేసినట్లు తేలినచో నాయుద్యోగమానాఁటి నుండి మానివేసెదను. అల్లాపైనొట్టు. ఇంటిలో నెవరిపైనైన మీకనుమానమున్నదా ?

శివ:—ఇంటిలో దాసియొక్కతెమాత్రమే పరాయిదున్నది.

నన్హా:—అచ్ఛే అదిపిచ్చిదండీ. ఇది యూరితేరినవాని పని గాని వేఱుగాదు. అల్లాయొట్టు.

శివ:—అయిన నింట మఱెవరుకలరు ? నాకుమారులిద్ద రున్నారు. భార్యయున్నది అక్కయున్నది. ఇందులో నెవరినని సందేహింపఁదగును ?

నన్హా:—ఇది యింటివానిపనియే. ఎవరైననేమి యింటివారే యైయుండవలెను. నాఁలుగైదురోజులలో పూర్తిగా దీని యాచూకి తీసియీయఁగలను. వస్తువులన్నియు దొరకునని చెప్పలేనుగాని దొంగనుమాత్రము తప్పక పట్టియిచ్చెదను.

నన్హా వెడలిపోయెను. శివరావు శ్యామల కతఁడన్న మాటలన్నియు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. శ్యామల కంపించి పోయెను. 'మీరిన్స్పెక్టరుగారితో నాచూకి తీయవలదని చెప్పుఁడు. మీకాళ్ళవేళ్ళఁబడి బ్రతిమాలుకొందును. దయ యుంచి యావిచారణ మాన్పింపుఁడ'ని ప్రార్థించెను.

శివ:—ఎందుకని ?

శ్యా:—ఎందుకో చెప్పవలెనా? ఇంటి వారిపనియే యని యతఁడు చెప్పుచుండెనుగదా ?

శివ:— వానిని వాగనిమ్ము.

కేశవుఁడు తన గదియందు కూర్చుండి భగవన్నామము స్మరించుకొనుచుండెను. వాని ప్రాణములు పైనెగిరిపోవుచుండెను పోలీసువారు మొగముచూచియే తెలిసికొందురఁట. అతనికి బైటికేగుటకుసైతము ధైర్యము లేకుండెను. తండ్రియు నిన్స్పెక్టరును నేమి మాట్లాడుకొనుచుండిరో వినుట కాతఁ డాత్రమునఁ జెందుచుండెను. ఇన్స్పెక్టరు వెళ్ళఁగనే సుబ్బి బయటికిరాగా 'సుబ్బీ! అతఁడేమనుచుండెనే?' యని యడిగెను. సుబ్బి సమీపమునకు వచ్చి— 'ఇంటి వారి పనియేగాని బైటివారు చేసినది కాదనుచుండె' ననెను.

కేశ:— నాన్నగారేమియు ననలేదా ?

సుబ్బి:— ఏమియు ననలేదు నిలఁబడి యూకొట్టుచుండిరి. ఇంటిలో పరాయిది సుబ్బి యొక్కతెయేగదా! మిగిలినవారందరు తనవారే.

కేశ:— నీవొక్కతెవే యననేల? నేనుమాత్రము పరాయివాఁడనుకానా ?

సుబ్బి:— నీవు పరాయివాఁడ వెట్లగుదువు బాబూ!

కేశ:— ఇంటిలో నెవరిపైని తమ సందేహములేనట్లు నాన్నగారు చెప్పలేదా ?

సుబ్బి:— చెప్పఁగామాత్రము వినలేదు. పాపమా యిన్స్పెక్టరుగారు మాత్ర మాయన తల్లికడుపు చల్లగ—

'సుబ్బి కేమి తెలియును. పిచ్చిద'నిరి. అయ్యగారు నా గొంతుక కురిపోయ సిద్ధపడుచుండ నాయనగారే రక్షించిరి.

కేశ:— అయిన నీవును బ్రతికిపోయితివి. ఇంక నేనే కలను. ఓసీ నీవు నన్నా రోజున సింటం జూచితివంటే ?

సుబ్బి:— లేదు నాయనా. నీవు సినిమాకు పోయితివికదా.

కేశ:— నీవే సాక్ష్యము చెప్పవలయునుసుమా.

సుబ్బి:— అట్లంను వేమి బాబూ. అమ్మగా రాచూచికినే యూహించి వేయుదురంట.

కేశ:— నిజమా ?

సుబ్బి:— నిజమే ఆచూకి వలదని యూమె మాటిమాటి కనుచున్నది. నగలు పోయినవేమో పోయినవని యెంత చెప్పినను వినా నాన్నగారే యొప్పుకొనకున్నారు.

నాలుగైదురోజులు కేశవుడు కడుపునిండ భోజన మాచరింపలేదు. ఒకసారి నాలుగు ముద్దలు తినిన మఱొకసారి యూంకలి లేదనును. అతని మొగమున కత్తివేటువైచినను నెత్తురుచుక్క లేకుండెను. రాత్రులు నిద్రపట్టకుండెను. ప్రతి క్షణమును పోలీసుల భయము వెన్నాడుచుండెను. విషయ మింతవఱకు వచ్చునని యెఱింగిన నాతడీపని చేయకయే పోవును. ఏ దొంగయో తీసెసనుకొందురని యతం మూహించెను. తన విషయ మెవరికిని పట్టదనుకొనెను కాని రహస్య మంతయు బైటపడునట్లగపడుచుండెను. నన్నా చేయు నాచూకిని బట్టి కేశవుని సంశయము మఱింత బలపడుచుండెను.

ఏడవ రోజున సాయంకాలము కేశవుఁ డింటికి వచ్చి నప్పుడు మిక్కిలి చింతాక్రాంతుఁడై యుండెను. నేటివఱకు తప్పిపోవచ్చునను నాశచే నతనికి ధైర్యముగ నుండెను. సొమ్ము బైట పడునను భీతి యతనికి లేకుండెను. కాని నేఁడది బట్ట బయలైనది. ప్రతి క్షణము నన్ను పోలీసులను వెంటఁ గొని వచ్చుచునే యుండవచ్చు ననిపించుచుండెను. ఇఁక తప్పించు కొను నుపాయములేదు. నన్ను లంచము గైకొనుట సంభవమే. పైకము కూడ చేతిలో నుండనే యున్నది. కాని మాట మాత్రము బైటికి రాక తప్పదు. సొమ్ము బైట పడకుండనే కొడుకే యపహరించినాఁడని పట్టణమంతయు గగ్గోలుగ నున్నది. ఇఁక సొమ్ము బైట పడిన పిమ్మట సందుసందునకు నీవార్త వ్యాపింపదా? తానెవరికిని మొగమైన చూపింపఁ జాలఁడు.

కచేరినుండి వచ్చుసరికి శివరావు గాబరా పడుచుండెను. తల పట్టుకొని వచ్చినవాఁడు వచ్చినట్లు మంచముపై కూల బడెను.

శ్యా:—గుడ్డలు విప్పరేమి? రోజుకంటె నేఁడాలస్యమైనదే?
శివ:—ఏమి గుడ్డలు విడుచుటో! నీవీ సంగతి వింటివా?
శ్యా:—ఏమిది? నేనేమియు వినలేదే!
శివ:—సొమ్ము బైట పడినది. ఇఁక కేశవుఁడు బైట పడుట యసంభవము.

శ్యామల కాశ్చర్యము కలుగలేదు. ఈమాట తాను మున్నే యెఱుఁగుదు నన్నట్లామె 'నేను పోలీసు వారికి తెలు

పవలదని చెప్పియుండ లేదా! అనెను.

శివ:—నీకు కేశవునిపై ననుమానముండెనా!

శ్యా:—లేకేమి! నేనాతనిని గదిలోనుండి వచ్చుచుండఁగ చూచితిని.

శివ:—నాతో నేల చెప్పవైతివి!

శ్యా:—ఆమాట నేను చెప్పఁదగినదేనా? ఈర్ష్యావశమున నేనట్లు చెప్పితినని మీమనమున ననుకొనరా? నిజముగ మీకాభావము కలుగునో లేదో చెప్పుఁడు. అబద్ధమాడకుఁడు.

శివ:—సంభవమే. నేను నిరాకరింపఁజాలను. కాని యాస్థితిలో నీవు నాకుఁ జెప్పియుండవలసినది. నేను రిపోర్టుచేసెడివాఁడనుకాను. నీవు స్వప్రతిష్ట కాపాడుకొంటివి గాని పరిణామమేమగునో రవంతయు యోజింపలేదు. నే నిపుడే స్టేషనుకేగెదను. నన్నూ వచ్చుచునే యుండవచ్చును.

శ్యామల హతాశురాలై 'ఇప్పుడేమి చేయువలె' ననెను.

శివరావాకసమువంకఁ జూచుచు—'దైవేచ్ఛ యెట్లున్నదో! ఒకటిరెండువేలు లంచముపోసినచో కేసు మాపు చేయింపవచ్చును. కాని నానేఁటి పరిస్థితులు నీవెఱుంగనివి కావు. ఇంతకు నాయదృష్టము మంచిది గాదు. పాపములు చేసిన వాఁడననుభవింపక తీరునా! ఒకపిల్లవాఁడట్లయ్యెను. మఱొకసంగతి యిట్లువచ్చినది. అనర్థుఁడే, మూర్ఖుఁడే, తుంట

రిమేకాని కన్నుగొడుకుగదా. ఒకనాటికిగాకున్న మరియొక నాటికైన బుద్ధిరాకుండెనిదా! ఈబాధ యింక దుర్భరము.

శ్యామల:— ఏమైననిచ్చి తప్పించుకొన వీలున్నచో నేను పైకము సంగతి యోచింతును.

శివ:— తేఁగలవా ? ఎంత తేఁగలవు ?

శ్యామల:— ఎంత కావలెను ?

శివ:— ఒక వేయికి తక్కువ యనలు వీలులేదు. నేనొక న్యాయవాది యుద్ధ నొక వేయి పుచ్చుకొంటిని. నేఁడతఁడది గుంజుకొనకమానఁడు.

శ్యామల:— ఆమాత్రము నే నేర్పాటుచేసెదను. పోయిరండు.

పోలీసుస్టేషనునందు శివరావునకు చాల నాలస్యమయ్యెను. ఏకాంతముగ మాట్లాడుటకెంతసేపటికిని నవకాశమే చిక్కకుండెను. ఇన్స్పెక్టరు ఘటికుఁడు. తేలికగా నొప్పుకొనకుండెను చివరకు మొగమాటముతో నైదు వందల కొప్పుకొనెను. అంతటితో పని పూర్తి యయ్యెను. ఉత్సాహముగ నింటి కరుదెంచి 'పని యైపోయినది, పైకము నీవిచ్చిన పని నా మాటయే చెల్లించినది. ఎంతసేపటికిని వాఁడు చోటుపెట్టకుండెను. చివర కెట్లో చెప్పి యొప్పించితిని. కేశవుఁడు భోజనము చేసెనా' యనెను.

శ్యామల:— అతఁడింకను బయటనుండి తిరిగి రాలేదే!

శివ:— పన్నెండు గంటలు సుమారైనదిగదా!

శ్యామల:— పోయి యెన్నోసార్లు గది చూచి వచ్చితిని. అంతయు నంధకారమయముగ నున్నది.

శివ:— మాధవుఁడో ?

శ్యామల:— అతఁ డన్నము తిని నిద్రించినాఁడు.

శివ:— కేశవుఁ డెక్కడికేగెనో యతని నడుగ లేదా ?

శ్యామల:— అతఁడు నాతో చెప్పి వెళ్ళలేదనెను.

శివరావునకు సందేహము కలిగెను. మాధవుని పిల్చి 'నీతో నన్న యెచ్చటికేగునది చెప్పిపో లేదా ? ఎప్పుడు వచ్చునో.' మాధవుఁడు కన్నులు నలుపుకొనుచు, తలగోకి కొనుచు—నాతో నేమియు చెప్పలేదనెను.

శివ:—దుస్తులు ధరించుకొని యేగెనా ?

మాధ:— లేదు. లాగుచొక్కా మాత్రము కట్టుకొనెను.

శివ:—వెళ్ళునపుడు సంతసముగ నుండెనా ?

మాధ:—అంత సంతోషముగ కన్పింపలేదు. ఎన్నోసార్లు లోపలికి రానెంచియు బయటనుండియే వెడలిపోయెను. కొన్నినిమిషములు బయట చావడిలో నిలిచి యుండెను. వెళ్ళునపుడు కన్నులొత్తుకొనుచు నుండెను. కొన్నాళ్ళనుండి నిరంతర మేడ్చుచునే యుండెను.

తన జీవితమంతయు భగ్నమై పోయినట్లు శివరావు దీర్ఘముగ నిశ్వసించెను. శ్యామలతో—'నీవు మంచి చేయున

కాని చేసితివిగాని శత్రువుకూడ నాకింతకంటె మించినయపకార మాచరింపజాలఁడు. కేశవుని తల్లియగుచో నింతసంకోచించ దగదా? ఎన్నఁడును నట్లుచేయుద'నెను.

శ్యా:—కొంచెము డాక్టరుగారింటికి పోయిచూడరాదా? అక్కడ కూర్చుండియుందురేమో. ప్రతిదినము నెంతో మందిపిల్లలు వచ్చుచుందురు. వారినడిగిన జాడ తెలియునేమో! ఎంతజాగ్రత్తగ బ్రదికినను రావలసిన యపయశము రానేవచ్చినది.

శివరావు గోడలతో చెప్పినట్లు 'అవును. పోక యిఁక నేమిచేయఁ గలన'ని అనుకొని బయటికివెడలెను. బయట కాలిడనో లేదో యెదురుగ డాక్టరు చలపతినిఁ జూచెను. ఉలికిపడి—'మీరెంత సేపటినుండి యిచటనుండి' రనెను.

డాక్టరు:—నేనిప్పుడే వచ్చితిని. మీరీ నిశీథమున నెక్కడికి? పండ్రెండు గంటలపైఁగానైనది.

శివ:—మీయింటివైపునకే వచ్చుచుంటిని. కేశవుఁడింకను నింటికి రాలేదు. మీయొద్దకు వచ్చెనేమోయని......

డాక్టరు శివరావు రెండుచేతులు పట్టుకొని 'మీరిఁక ధైర్యముగ.........' నని యేమో చెప్పఁబోవుచుండఁగనే శివరావు తుపాకిదెబ్బతినిన చందమున నేలఁగూలెను.

# ఏకవింశతి ప్రకరణము



వియ్యమ్మ కోపావేశముతో 'అయిన పిల్లవానిని పట్టికాళ్ళతో బడికిపంపెదవా' అనెను.

శ్యామల పిల్లతల దిక్కుతీయుచు 'నేనేమిచేయఁగలను ? నాయొద్ద సొమ్ములేద'ని జవాబిచ్చెను.

వియ్యమ్మ:—అవును. నగలు చేయించుకొనుటకు మాత్రము సొమ్ముండును. పిల్లల చెప్పులకొఱకైనచో సొమ్ము మండిపోవును. ఇద్దరు పోనేపోయిరి. మూఁడవవాని యునురుఁగూడ పోసికొని పొట్టను బెట్టుకొందువా?

శ్యామల నిట్టూర్పువిడచి—ఆయువున్నవాఁడు బ్రతుకును, చావువ్రాసి పెట్టియుండిన నేను తప్పింపఁగలనా ?

ప్రతిదినము నట్లే వియ్యమ్మకు శ్యామలకునేదో జగడము జరుగుచుండెను. నగలు పోయినప్పటినుండి శ్యామలస్వభావము విచిత్రముగ మాఱెను. ఆమె పైనపైపకును పెనుగులాడఁ జొచ్చెను మాధవుఁడేడ్చి మొత్తుకొని ప్రాణములుపోఁగొట్టుకొనినను దమ్మిడినైన నిచ్చెడిదికాదు. మాధవుని విషయమే కాదు. తన వ్యయముకూడ నామె అట్లే నిర్దయగ కోసివేసికొనెను. చీరచిరిగి పీలికలైనను క్రొత్తచీరకొనదు. తలనూనె నెలలకొలఁది తెప్పింపదు తములపాకులు నిత్యముచేసికొను నట్టిది వానిమాటనే యెత్తదు. చంటిపిల్లకు పాలనైన తెప్పిం

వదు. కన్నులు తెఱువని పిల్లభవిష్యత్తు విరాడ్రూపముధరించి యామెను కలవరపెట్టుచుండెను.

శివరావు సంపూర్ణముగ శ్యామల చెప్పుచేతలలోనికి వచ్చెను. ఆమె యేమిచేసినను కాదనఁడు. ఆమె యన్న అతనికేలాగో భయము. అతఁడు ప్రతిదినము విడువకుండ కచేరి కేగుచుండెను. తన చిన్నతనము నందైన చేయునంత పరిశ్రమ చేయును. కన్నులు చెడిపోయెను. వైద్యుఁడు రాత్రులు చదువుట, వ్రాయుట వలదని నిషేధించెను. అతని యరుగుదల యంతకు మునుపే బలహీనముగ నుండెను. ఇపుడు బొత్తుగ చెడిపోయెను. శ్వాసకోశము కూడ చెడెను. కాని అతఁడు మాత్ర మర్ధరాత్రము వఱకును పనిచేయుచునే యుండును. ఆరోగ్యము సరిగ నున్నను, లేకున్నను, ఇష్టమైనను, కాకున్నను పనిచేసి తీరవలసినదే. శ్యామల కతనిపై రవంతయు జాలిలేదు. భీషణమగు భవిష్యచ్చింత యామె సద్భావముల నన్నింటిని సమూల నాశనమొనరించెను. బిచ్చగాని యలికిడి వినిననామె అదరిపడును. చిన్న గవ్వయైన వ్యయపడుట యామెకు గిట్టదు.

ఒక దినమున శ్యామల నెయ్యి తెమ్మని మాధవుని బజారు కంపెను సుబ్బి నామె విశ్వసింపదు. ఆమెచే నే వెచ్చమును తెప్పింపదు. మాధవునకు డబ్బు మిగుల్చుకొను దురలవాటులేదు. కాని వెచ్చమున కర్ధణా చెప్పుటతెఱుఁగఁడు. బజారు పని యంతయు అతఁడే చూడవలసి వచ్చుచుండెను. శ్యామల ప్రతివస్తువును తూచును. రవ్వంత తూకమున తగ్గినను వస్తువుల త్రిప్పికొట్టును. మాధవుని సమయమంతయును

తెచ్చుట, త్రిప్పియిచ్చుటలతోనే పోవుచుండెను. బజారులో నెవరును సులభముగ నాతనికి వెచ్చము నియకుండిరి. నేడు గూడ అట్టిదే సంఘటనమయ్యెను. మాధవుడు దుకాణ లన్నియు వెదకి తనకు నచ్చిన నెయ్యి తీసుకొనివచ్చెను. శ్యామల దానిని వాసన చూచి 'నెయ్యి మురిగినది. త్రిప్పి యిచ్చివేయు' మనెను. మాధవుడు విసుగుకొని—'ఇంతకంటె మంచి నెయ్యి బజారునందే లేదు. నేనన్ని కొట్టులందును చూచి పరీక్షించి తెచ్చితి'ననెను.

శ్యా:—అయిన నేబద్ధమాడు చుంటివా?

మాధ:—అనూటని నేననలేదు. కాని కోమటి నెయ్యి ముప్పుడు తిరిగి తీసికొనడు. నీవిక్కడే బాగుగ పరీక్షించి చూచుకొనుమని అతడు నాతో గట్టిగ చెప్పెను. ముందుగ బోణీ బేరము. వెచ్చము తిరిగి పుచ్చుకొననని కూడ ఖండితముగ పల్కెను. నేను వాసన చూచి నాలుకపై వైచుకొని రుచిగూడ చూచితిని. ఇపుడే మొగమాటతో త్రిప్పి యీయగలను.

శ్యామల పండ్లు పటపట కొఱుకుచు—'నేతిలో స్పష్ట ముగ కొవ్వు కలిసియున్నది నీవేమో బాగుగానున్న దందువు. నేను దీనిని వంటయింటి లోనికైన గొంపోవను. నీయిష్ట మున్న త్రిప్పి యిమ్ము లేకున్న నీవే త్రాగుము.

నేతిగిన్నె నచటనే విడిచి శ్యామల వెడలిపోయెను. మాధవుడు కోపభయములతో కంపించిపోయెను. అతడే

మొగములో నెట్లు త్రిప్పి చూడఁగలఁడు? నేను పుట్టకొనప్పని కోమటి స్పష్టముగ చెప్పివేయును. అప్పుడు తానేమి చేయును? బజారున పోవు మనుష్యులందఱు అట మూగెదరు. వటిలోను తనకవమానము జరుగును. సాధారణముగ తనకవ్వరును వెచ్చమునే యియ్యరు. ఏదుకాణమునొద్ద నైనను తాను గంటల కొలఁది వేచియుండవలసి వచ్చుచుండెను. 'నేయి యేమైనను సరే. నేను మాత్రము పోనని మాధవుఁడు నిశ్చయించుకొనెను.

ప్రపంచమున తల్లిలేని పిల్లలకంటె దీనులు మఱెవ్వరునుండరు. ఇతరులందఱును దుఃఖముల విస్మరింతురు. పిల్లనికి తల్లి జ్ఞాపకము వచ్చెను. అమ్మయే యుండిన నేఁడు తనకీ గతి పట్టునా? అన్న చనిపోయెను. కేశవుఁడు కూడ వెడలిపోయెను. ఈకష్టము లన్నిటి ననుభవింప తానేల బ్రతికియుండెను? మాధవుని కన్నులవెంట అశ్రువును ప్రవహింప సాగెను. అతని శోకార్త కంఠమునుండి దీర్ఘనిశ్వాసముతో పాటు 'అమ్మా! నీవుకూడ నన్ను మఱచితివా? నీవెంటనైన గొంపోవరాదా? యనెడు మాటలు బయల్వెడలెను.

శ్యామల యింతలో గదివైపున కేగెను. మాధవుఁడు వెళ్ళియుండుననిి యామె తలచెను ఆతనిని చూడఁగనే వండి పడి—'నీవింకను నిచటనే కూర్చుండిన అన్న మెప్పుడు వండఁగలనని' గద్దించెను.

మాధవుఁడు కన్నులు తుడుచుకొనుచు' నాకు బడివేళ యైనదనెను.

శ్యా:—ఒకరోజా లన్యమైనంత మాత్రమున కొంప మునుఁగదు. ఇదిమాత్ర మింటి పనియేగదా!

మాధ:—ప్రతి దినమిదే పని యుండుటచే నేరోజాననుబడికి సరియైన సమయమున పోవీలు పడుటలేదు. ఇంటి వద్ద చదువుటకును తీరిక లేదు. ఏ పెచ్చమును నాలుగైదు సార్లు త్రిప్పి కొట్టనిది పుచ్చుకొనరు. నేను చీవాట్లు చెప్పదెబ్బలు తినవలయును. పలుగురిలో నాకవమాన మగును ఎవరికేమి పట్టినది?

శ్యా:—అవును నాకేమి? నేను మీశత్రువనుగదా? నావారైన గదా దుఃఖింతురు. నీకు చదువు సంధ్య లబ్బవలద నియే దైవమునకు నాప్రార్థన నాలో నశ్నియు చెను గులే. మీతప్పు లేమియు నుండదు. సవతి తల్లి యనఁగ పేరే విషము కన్నతల్లి విషముపెట్టినను అమృతమే. సవతి అమృతము కుడువఁ బెట్టినను విషమే. మీవలన నాజీవిత మంతయు నట్టిపాలైనది. ఏడ్చుచు రోజులు గడపవలసివచ్చినది. నేనేమో బాధపడుకొనుచుంటినని మీర నుకొందురు. మిమ్ము బాధించుటే నా కానందమని మీరు భావింతురు. దైవము నాకు చావు వ్రాసిపెట్టి యుండలేదు. లేకున్న నాకింత మొండిప్రాణ మేల!

శ్యామల కన్నులనీరు గిఱ్ఱునతిరిగెను. ఆమె వెంటనే లోనికివెడలిపోయెను. శ్యామల యేడ్చుచుండుటగాంచి మాధవుఁడు భయకంపితు డయ్యెను. అతనికి సుఖము కలుగలేదు కాని కొట్టించునేమో అను శంక కలిగెను. గుట్టుచప్పుడు

గాకుండ నాగిన్నను తీసికొని క్రొత్త గ్రామమునకేగు కుక్కవలె తిప్పి యిచ్చుటకు బయలుదేరెను. ఆతని ప్రత్యంగమునుండి మనోవేదన యుట్టిపడుచుండెను. ఎంత తెలియనివాఁడైనను నాతని వాలకము చూచి అనాథబాలుఁ డని యెఱుంగ వచ్చును.

మాధవుఁ డేగుచున్నకొలఁది రానున్న భీషణసంగ్రామ కల్పనచే భయకంపితు డగుచుండెను. గుండెలు దడదడ కొట్టుకొనుచుండెను. కోమటి నేతిని తీసికొననిచో నచటనే విడిచి రావలెనని అతఁడు నిశ్చయించుకొనెను. విధిలేక యతఁడే తనను పిలుచును. కోమటిని కోపపడుట కతఁడు మాటలనుసైత మూహించుకొనెను 'ఏమయ్యా! సెట్టీ! చూచుచుండఁగనే కన్నులలో దుమ్ముగొట్టుదువా! మంచి సరకు చూపించి యీ క్రుళ్ళుసరకు నిత్తువా?' యని తానుగద్దించును. ఈనిశ్చయ మొనరించుకొనినపిదప సైత మాతని అడుగు ముందుకుపడ కుండెను. తానచటికేగుచుండుట సెట్టి చూడరాదని అతని సంకల్పము. హఠాత్తుగ తాను దుకాణమునొద్ద ప్రత్యక్షము కావలెనని యాతని యుద్దేశము. అందు కాతడు సందులో నుండి చుట్టుతిరిగి దుకాణమునొద్ద కేగెను.

సెట్టి అతనిని చూడఁగనే—'వెచ్చము తిరిగి పుచ్చుకొనవని నేను ముందుగనే చెప్పితిని. చెప్పితినా లేదా చెప్పు మ'నెను.

మాధవుఁడు కోపము తెచ్చుకొని—'నీవు నాకు చూపించిన నేతి నిచ్చితివా యేమి? చూపించిన దొకటి తూచి

యిచ్చిన ద్రోహి. ఎందుకు తీసికొనవు. ఇది దారిదోపిడి
సొమ్ము కాదు.

సెట్టి:—ఇంతకంటె మంచినేయి యీ బజారున లభించుచో
నేను జుల్మానా యిచ్చుకొందును. గిన్నె తీసుకొనిపోయి
నాలుగైదు దుకాణములు చూచుకొనుము.

మాధ:—మాకింత తీరిక లేదు. నీ నెయ్యి నీవు తీసికొనుము.

సెట్టి:—నెయ్యి ముమ్మాటికి పుచ్చుకొనను.

దుకాణముమీదనొక జటాధారియగు సన్యాసి కూర్చుండి యీ వింత చూచుచుండెను. అతఁడు లేచి మాధవునియొద్దకేగి గిన్నెలోని నేయి నాఘ్రాణించి 'బిడ్డా! నెయ్యిమాత్రము బాగుగనే యున్న' దనెను.

సెట్టికి నూతిలభించెను. అతఁడు 'స్వామీ! మే మెవ్వడును వీరికి రెండవరకము సరకు నీయము. తెలిసి యున్నచోట చెడ్డవస్తువు నిచ్చుట వ్యాపారధర్మమా?' అనెను.

సాధు:—నెయ్యి బాగుగనే యున్నది. తీసికొని పొమ్ము బిడ్డా!

మాధవుఁ డేడ్వసాగెను. నేతిని చెడ్డదని నిరూపించుట కతనియొద్ద మఱేమియు సాధనము లేకుండెను. 'నెయ్యి బాగుగ లేదని యామెయే త్రిప్పికొట్టినది. మంచిదే అని నేనెంత చెప్పినను వినద'ని యింకను వెక్కి వెక్కి యేడ్వసాగెను.

సాధు:—మంచిది కాదన్న దెవరు?

సెట్టి:—వీరి తల్లి కావచ్చును. వారి కేసరకును నచ్చదు.
పాపము పిల్లని పరుగెత్తించి చంపును. సవతితల్లిగదా!
కన్నతల్లి యిట్లు చేయఁగలుగునా!

సాధువు మాధవునిపై సదయవీక్షణములఁ బఱపెను. అతని నుద్ధరింప నాత్రముఁజెందుచున్నట్లాతని దృష్టులు చెప్పక చెప్పుచుండెను. అతఁడు కరుణాస్వరముతో—'నీతల్లి మరణించి యెన్నాళ్ళయినది నాయనా?' అనెను.

మాధ:—ఆఱవయేఁడు.

సాధు:—అయిన నీవప్పుడు చాల చిన్నవాడవై యుందువు. దైవలీల యెంతవిచిత్రము! ఈచంటిపిల్లవానిని మాతృవిహీను నొనరించితివా? ఏమి యనర్థము? అఱువత్సరముల పిల్లవాఁడు రాక్షసి యగు సవతిపాలఁబడవలెనా? ఆహా! యేసు దయాంధివయ్యా? సెట్టీ! పిల్లవానిని కరుణింపుము. నేతిసి తిరిగి పుచ్చుకొనుము. లేకున్న సవతితల్లి వీనిని బ్రతుకనీయదు. దైవకృపవలనను, నా యాశీర్వాదమునను నీకెన్నఁ డెట్టి యనిష్టకము కాగలదు.

సెట్టి పైకము త్రిప్పి యీయలేదు. పిల్లవాఁడు నేతికై యొట్లును తిరిగి వచ్చునుగదా! రోజు కెన్నిసార్లు తిరుగవలెనో! తన దుకాణమునను్న అన్నిటికన్న మంచి నేతిని మాధవునకు పోసి పంపెను. మాధవుఁడు సాధువు సంచితమును పొగడు కొనసాగెను. ఎంత దయగలవాఁడు? నిజముగ నతఁడే చెప్ప కున్న సెట్టి నేతిని పుచ్చుకొననే పుచ్చుకొనఁడు.

సాధువుకూడ మాధవునివెంట నేగుచు తియ్యనిమాటలాడసాగెను.

'నాయనా ! మాతల్లియు నామూఁడవ యేటనే పరమ పదించినది. అందుకే తల్లి లేని పిల్లలనుజూచిన నాగుండెలు బ్రద్దలగుచుండును !

మాధవుడు:—మీతండ్రికూడ రెండవపెండ్లి చేసికొనెనా?

సాధు:—లేకున్న నేనేల నేఁడు సాధువుగ నుందును? మొదట నాతండ్రి వివాహముమాటయే తలపెట్టలేదు. నేనన్న వారికెంతో ప్రేమగనుండెను. మనస్సెందుకుమారెనో తరువాత పెండ్లి చేసికొనెను. సాధువునుగాన కఠినముగ మాటలాడఁగూడదు కాని సవతి యెంతఅందకత్తెయో యంతకఠినురాలు. రాక్షసియే నాకు రోజంతయు తిండి పెట్టెడిదికాదు. నేనేడ్చినచో కొట్టెడిది. మాతండ్రి కూడ నాపట్ల విముఖుఁడయ్యెను. అయనకు నన్ను చూచిన నేవగింపుకలిగి యేమ్ఫ్రవిసిననన్నే బాదుచుండెను. చివరకు నేనిల్లువీడి వెడలిపోతిని.

మాధవునకుఁగూడ పెక్కుసార్లిల్లు విడిచి పోవలెనని పించెను. నిజమున కప్పుడుగూడ నతఁడదియే యోజించు చుండెను. చాల నుత్సాహముగ—'ఇల్లువిడిచి ముందుగ మీరెటకేగితిరి' యని ప్రశ్నించెను.

సాధువనివ్వె—"నాఁడునుండి నాకష్టములంతరించినవి. మోహబంధము తెగి మనమువనుండి భయముతొలఁగిననాఁడే నేనుద్ధరింపఁబడితిని. పగలెల్ల నేనొకవంతెనక్రింద కూర్చుండి యుంటిని. సాయంకాల మగుసరికి నాకొక మహాత్ముఁడు కని పించెను. వారిశుభనామము పరమానందస్వామి ఆయన కాల

బ్రహ్మచారి. నామీద వారికి దయకలిగెను. వెంటపెట్టుకొని నన్ను వారు దేశదేశాంతరములఁ ద్రిప్పిరి. వారు సిద్ధులగు యోగులగుటచే నాకుఁగూడ యోగవిద్య నుపదేశించిరి ఇపుడు తల్లిని దర్శించునంతటి యోగసిద్ధి నాకు లభించినది. వారితో నప్పుడప్పుడు మాట్లడుచుందునుగూడ' ననెను.

మాధవుఁడు విస్ఫారితనేత్రుడై—'మీతల్లి మరణించెనుగదా!' యనెను.

సాధు:—అయిననేమి నాయనా! యోగవిద్యయందు మరణించినవారిని దర్శించుశక్తికలదు. ఎవరినికోరిన వారిని పిలిపించుకొనవచ్చును.

మాధ:—నేను యోగవిద్య నభ్యసించి మాతల్లినిఁ జూడవచ్చునా?

సాధు:—తప్పక అభ్యాసమువలన నన్నియును నమకూరును. కాని యోగ్యుఁడగు గురువుమాత్రము కావలెను. యోగమువలన గొప్ప గొప్ప సిద్ధులు లభించును. ఎంతకావలెనన్న నంతధనము క్షణములో ప్రాప్తించును. ఎంతకుదురని రోగమునకైన నిట్టె యౌషధము కనిపెట్టవచ్చును.

మాధ:—మీనివాస మెక్కడ?

సాధు:— నాయనా! నాకు నివాసమేమి? దేశదేశాంతరముల తిరుగుచుందును. ఇఁక నీవేగుము నేనొక్కింత స్నానసంధ్యల నాచరింపవలెను.

మాధ:—నేనుగూడ నటే వచ్చుచున్నాను పదుండు. మీా దర్శన భాగ్యమున నాజన్మ ధన్యమైనది.

సాధు:—కాదు నాయనా! నిబడి కాలన్యమగును. నీవేగుము.

మాధ:—తిరిగి మీాదర్శన మెప్పుడు లభించును!

సాధు:—ఎప్పుడో రేయి నవ్వి వేగుదెంతును. మీా యిల్లెక్కడ?

మాధవుఁడు సంతసించి—మాాయింటికి రండు చాల సమీపముననే యున్నది. దయచేయుఁడనెను

మాధవుఁ డానందమున నోలలాడుచు ముందు నడుచు చుండెను. అతనికి బంగరు కొండ లభించినట్లుండెను. ఇంటి ముందాగి రండు. కొంచెము సేపు కూర్చుండుఁడని పిలిచెను.

సాధు:—కూర్చుండను నాయనా! రేపో యెల్లుండియో తిరిగి వచ్చెదను. మీా యిల్లిదియే కదా.

మాధ:—రేపే వేళకు వచ్చెదరు?

సాధు:—నిశ్చయముగ చెప్పజాలను. ఏదో సమయమున తప్పక వత్తును.

కొంతదూర మరుగఁగనే యా సాధువునకు మఱొక సాధువు కలిసెను. ఆయన పేరు హరిహరానందస్వామి.

పరమానంద:—ఎక్కడెక్కడ తిరిగితివి? జంతువేదైన పడెనా?

హరి:—ఈ పక్క నేమియు పడలేదు. ఒకరిద్దరు కనుపించినను నన్నే గేలిచేయుచు సాగిరి.

పర:—నాకొకఁడు దొరకు ననిపించుచున్నది. చిక్కెనా నా సామీా..

హరి:—నీవెప్పుడు వల్లె యందువు ఎవఁడు వచ్చినను నొకటి రెండు దినములలో పాఱిపోవుచుందురు.

పర:—వీఁడు పరుగెత్తఁడు. చూచు యీసారి వీనితల్లి మరణించినది. తండ్రి రెండవపెండ్లి చేసికొనెను. సవతి యేడ్పించుకొని తినుచుండును. ఇల్లన్న నతనికి మొగము మొత్తినది.

హర:—అట్లైన తప్పక చిక్కును. వలవైచితివి గదా-...

పర:—చాల బాగుగ వేసితివి. ఈయుపాయము బాగున్నది. మొదట బజారున నెంతమంది తల్లి లేని పిల్లలుండిరో, యెందరిండ్లలో సవతు లున్నారో తెలిసికొనుట, వల వేయుట మంచిది.

---

## ద్వావింశతి ప్రకరణము

---

శ్యామల గద్దించి-'ఇంతవఱకెచట నుంటివని' అడిగెను. మాధవుఁడు నిర్లక్ష్యముగ—'తోవలోపడి నిద్రించితి' ననెను.

శ్యా:—నేనట్లంటినా ? ఎన్నిగంటలైనదో తెలియునా ? పదియొన్నఁడో యైనది. బజారు సమీపముననే యుండెను గదా!

మాధ:—అవును ఇంటిప్రక్క నే యున్నది.

శ్యా:—నూటికి మాట్లాడవేమి? అంతయూ నాపనియేమైనట్లు నిర్లక్ష్యముగ జవాబు చెప్పెదవేమి

మాధ:—అట్లైన మీరెందుకు వ్యర్థముగ మొండివాదను చేయవలెను? తెచ్చినవచ్చము త్రిప్పియిచ్చుట అంత సులభమగు పనియనుకొంటిరా? గంటలతరబడి పెట్టిని ప్రార్థింపవలసివచ్చెను. అతఁడు మొదట తీసికొనననే యనెను. కాని యాయనదయవలన నొకసాధువు చెప్పి యిప్పించెను త్రోవలో నొక్క నిముషమైన నాగకుండ వచ్చివేసితిని

శ్యా:—నేతికరిగి పదునొకండు గంటలకు తిరిగి వచ్చితివి. ఇపుడు కట్టెలకొఱకేగుచో సాయంకాలమువఱకు చేయుదువు. మీనాన్నగారు తిండితినకయే కచేరికి పోయిరి ఇంతయాలస్యము చేయవలసియున్న మొదటనే నీవేల చెప్పవైతివి ? కట్టెలకొఱకేగెదవా ?

మాధవుఁడిక సహింపఁజాలకపోయెను — మంచిదని-- కట్టెలింకెవరిచేతనైనఁ దెప్పింపుఁడు. నేను బడికిపోవలె' ననెను.

శ్యా:—అన్నముతినవా ?

మాధ:—తినను.

శ్యా:—నేనన్నము వండఁగలను. కట్టెలుమాత్రము తేలేను.

మాధ:—సుబ్బిని పంపరాదా ?

శ్యా:—సుబ్బి తెచ్చినబేరము నీవిప్పుడును చూడలేదా ?

మాధ:—నేనిపుడు పోలేను.

శ్లో:—అప్రియ నాదోషము లేదు,

మాధవుఁడెన్నో దినములనుండి బడికేగ లేదు. బజారు పరుగులతో నాతనికి చదువుటకు తీరిక లేకుండెను. బడికేగిన చివాట్లు, బల్లపైనెక్కుట, గోడకుర్చీవేయుటకన్న నింకేమి లాభము? అతఁడు పుస్తకములుతీసికొని యింటినుండి బయలు దేరి పట్టణముబయటికేగి యేచెట్టుసీడనో కాలముపుచ్చును. లేదా, కవాతుచేయు పోలీసులవంకఁ జూచుచుండును. మూఁడు గంటలకింటికి తిరిగివచ్చును. నేఁడింటినుండి బయలుదేరెను గాని పోయి కూర్చుండుటకు మనసొప్పలేదు. పైఁగా కడుపు కాలుచుండెను. ఆహా! అన్నముకూడ కఱవగురోజులు సంప్రాప్తించినవి. పదిగంటలకు వంట తయారు కాదా? సరే నాన్నగారు వెడలిపోయిరనుకొన్నను నింట తిన రొట్టె రెండ ణాలైన లేవా? అమ్మ రేయున్న సిట్లు తిండి తిప్పలు లేకుండ నండునా? నాకు 'నా'యను వారెవరున్నారు?

మాధవుఁడు సాధుదర్శనమునకై వ్యగ్రుఁడగుచుండెను. 'ఆయన యెక్కడ లభించును? ఎచటికేగి చూడవలెను? ఆహా! యేమా మనోహరవాణి! ఏమా యుత్సాహప్రదమ నోదార్పు అతని యున్ని లక్షణములును మాధవు నాకర్షించుచుండెను. తా నతని వెంటనే యరుగనలసినది. ఇంటియొద్ద తనకున్న దెవరు?

అతఁడింటి కేగక నేతి బజారుమువైపునకు పోయెను. సాధువచట కనఁబడునేమో యనుకొనెను. ఎంతసేపు లేచినిలు

వఁబడినను సాధు దర్శనము కాలేదు. విసిగి చివరికింటికి తిరిగి వచ్చెను.

ఇంటికి వచ్చి కూర్చుండెనో లేదో శ్యామల అనుదెంచి 'నేఁడెచ్చట కాలము వెళ్ళపుచ్చితివి? ఉదయము వండలేదు. ఈపూట కూడ నుపవాసమేనా? పోయి యేదైన కూర తెమ్ము' అనెను.

మాధవునకొడలు మండెను—రోజంతయు తిండి లేక మాడి యింటికి రాగా త్రాగుటకు నీళ్లైన నీయవు. పైగా బజారునుండి కూర తెమ్మని యాజ్ఞాపించు చున్నావు. నేను బజారునకు పోను, నేనెవరికిని నౌకరును గాను. కడుపునకింత అన్నమేనా! బంగారము పెట్టుచుంటివా? ఈమాత్రము తిండి ఎచట చాకిరి చేసిన నచటనే లభించును. నౌకరి తప్పనప్పు డెచటనైన చేయుదునుగాని మీనౌకరి చేయను. నాకొఱకన్నము వండ వలసినపని లేదు,

శ్యామల నోట మాటరాలేదు. పిల్లవానికి నేడేదో పట్టినది. ఇదివఱకేపని చెప్పినను నెదురాడక చేయుచుండు వాఁడు నేడెదిరింప సాగెను. అప్పటికిని మాధవునకేమైన నిచ్చి కొనుక్కొని తినుమని చెప్పాదమని శ్యామల కనిపింపలేదు. ఆమె స్వభావ మంత కృపణమై పోయెను. మాధవునితో— 'ఇంటిపని చేయుట నౌకరి యనిపించుకొనదు. ఇట్లే నేనును వంట చేయునని, మీనాన్నగారు కచేరికి పోనని యున్నచో నేమగును? పోకున్న పోననుము. నుబ్బినే పంపి తెప్పించెదను. నీకు బజారున కేగుట యిష్టముండదని నాకేమి తెలియును!

దమ్మిడి వస్తువు కానికి వచ్చినను సుబ్బి చేతనే తెప్పింతును. నాది మాత్రమేమి పోవును. ఇదుగో నేఁటినుండి నిన్ను బజారున కేగుమన్న నొట్టు' నెను.

మాధవుఁడు మనమున లజ్జితుఁడయ్యెను. కాని బజారున కేగలేదు. అతని దృష్టి యంతయు సాధువుపై నుండెను. తన దుఃఖములన్నియు నాతని యాశీర్వచనమువలన తొలఁగును. తన జీవితాశలన్నియు నాతని కరుణచే సఫలములగును. తన నిరర్థకజీవిత మాతని సాహచర్యమున సార్థకమగును సాయంకాలమగునరి కాతఁడింక వేచియుండజాలక పోయెను. బజారంతయు కలయఁదిరిగెను సాధుదర్శనము కాలేదు. క్షుధాపీడితుఁడగు నాయబోధబాలకుఁడు దుఃఖితహృదయముతో నాశానిరాశల మూర్తిధరించిన రూపమువోలె తన దుస్సహాజీవితమునకే సూత్రాధారముగ కన్పించిన సాధువును దర్శించుటకై సందులగొందులబడి తిరుగుచుండెను. ఒకచోట నొక దేవాలయమునొద్ద అతని కాతఁడు సాధువు కన్పడెను. అతఁడే యనుకొనెను. హృదయము సంతోషమున వల్లవించెను పరుగెత్తుకొనిపోయి సాధువున కెదురుగ నిలిచెను. పరికించి చూడఁగ నతఁడు మఱొకఁడవఁడో యయ్యెను. హతాశుఁడై అతఁడు వెనుకకు మఱలెను.

నెమ్మదినెమ్మదిగ వీధులన్నియు నిశ్శబ్దమయ్యెను. ఇండ్లతలుపులు మూయబడుచుండెను. అరుగులమీఁదను, మంచపుకుర్చీలమీఁదను, గోనెసంచులమీఁదను భారత ప్రజ శయనించుచుండెను. మాధవుఁ డింటికి తిరిగిరాలేదు. అన్యథా

శరణ్యము లేక పరునివలె, అనాథునివలె తనను ప్రేమింపని యింట పడియుండుట అతని కిష్టము లేకుండెను. అతని మనస్సు విఱిగిపోయెను. అతఁ డంతవఱ కింటి కేగకున్నను నెవరు విచారింతురు? నాన్నగారు భోజనముచేసి పండుకొనియుందురు. అమ్మకూడ నిద్రించియుండును. ఎవరును గదివంక తొంగియైన చూచియుండరు. అత్తయ్యమాత్ర మాతురతఁ జెందును నాకై యామెయే నిరీక్షించుచుండునేమో. నేనేగునంతవఱ కామెయే భోజన మాచరింపదు

వియ్యమ్మ గుర్తు రాఁగానే మాధవుఁ డింటివైపున కేగెను. ఆమె యేమిచేయ లేకున్నను కోపసమతని నోడియందు కూర్చుండఁబెట్టుకొని యేడ్చుచుండును. ఆ యోద్పునం దెంత యోదార్పుండును? బయటనుండి వచ్చినపు డామె కాళ్ళు చేతులు కడుగుకొన నీరిచ్చును. ప్రపంచమునందు దండఱుపిల్లలు బంగారపుముద్ద లే ప్రేమింగుదురా! కడుపునిండ నన్నము లేనివారెందరో. కాని యిల్లన్న విరక్తి మాతృవిహీనులకే జనించును.

మాధవుఁ డింటికి బయలుదేఱఁగనే సాధు పరమానందుఁ డొకపందునుండి వచ్చుచు కనఁబడెను. మాధవుఁ డేగి సాధువు చేయి పట్టుకొనెను. పరమానందుఁ డులికిపడి—'నాయనా! నీవిచటనుంటివేమి' యని ప్రశ్నించెను.

మాధవుఁడు మాటలల్లి—'ఒక స్నేహితు డింటికివచ్చితిని. మీరుండుచోటిచటి కెంతదూరము?

పర:—మేమీరోజున నిచటనుండి పోవుచున్నాము. హరిద్వార మేగెదము.

మాధవుఁడు మహోత్సాహుఁడై— 'నేఁడే వెళ్ళెదరా' యనెను.

పర:—అవును నాయనా! మఱల వచ్చినపుడు దర్శన మొసంగెదను.

మాధవుఁడు భయాతురుఁడై—'మఱల వచ్చినపుడా?' అనెను.

పర:—త్వరలోనే వత్తును నాయనా!

మాధవుఁడు దీనముగ—నేనుకూడ మీతో వచ్చెదను.

పర:—నాతోనా! మీయింటివారు వెళ్ళనిత్తురా!

మాధవుఁడు వారికి నావిషయము పట్టినదా' అనెను' ఆపైనాతఁడు చెప్పలేకపోయెను. అతని యశ్రుపూరిత నేత్రము లాతని కరుణాగాథను మాటలకన్న నెక్కుడుగ వర్ణించిచెప్పెను.

పరమానందుఁడు బాలకుని కౌఁగిలించుకొని—'వరే నాయనా! నీయిష్టమున్నన్నప్లేరమ్ము. సాధు సాంగత్యఫలము ననుభవింపుము. దైవానుగ్రహమువలన నీకోర్కెలు ఫలించు న'నెను.

ఎఱపైఁ దిరుగాడు పక్షి చివరకు దానిపైఁ వ్రాలెను. వలలోనే ప్రాణములు వీడునో, బోయవాని కత్తివ్రేటున నఱకఁబడునో యెవరెఱుఁగుదురు!

## త్రయోవింశతి ప్రకరణము



శివరావు మూడుగంటలకు కచేరీనుండివచ్చి మంచముపై కూలఁబడెను. అసలే ముసలి. అందులో నతనికి దినమెల్లను భోజనము లేకుండెను. మొగము వాడిపోయెను. ఆరోజున నేమియు లభింపలేదని యాతని మొగముచూచియే శ్యామల గ్రహింపఁగల్గెను.

శ్యామల నేఁడేమియు దొరకలేదా అని ప్రశ్నించెను.

దినమెల్ల వేసారినను నెట్టిదియుగాని లభింపలేదని శివరావనెను.

శ్యా:—క్రిమినల్ కేసేమైనది?

శివ:—నాపార్టీకి శిక్షపడినది.

శ్యా:—ఆశాస్త్రీగారి వ్యాజ్యెమో?

శివ:—శాస్త్రిగారిమీఁద డిక్రీయైనది.

శ్యా:—దావా కొట్టివేయఁబడునంటిరే!

శివ:—అన్నమాట వాస్తవమే. దావా కొట్టివేయఁబడ వలసినదని యిప్పటికిని వాదింపవచ్చును. కాని యెవరు బుఱ్ఱ పగులఁగొట్టుకొందురు!

శ్యా:—మఱి వారసత్వపు తగాదా యేమైనది?

శివ:—అందునను అపజయమే యైనది.

శ్యా:—నేఁడే దురదృష్టవంతుని మొగముచూచి లేచితిరో.

శివరావిపుడు బొత్తుగ పనిచేయఁ జాలకుండెను. అతని యొద్దకు సాధారణముగ కేసులే రాకుండెను. వచ్చిన వైననుచెడి పోవుచుండెను. కాని యతఁడా యపజయముల నన్నింటిని శ్యామలకు చెప్పక దాచుచుండెను. ఏమియు లభింపని దిన మున నెవవినుండియైన నాలుగు రూపాయ లప్పుపుచ్చుకొని వచ్చి శ్యామల కిచ్చుచుండెను. దాదాపందఱు మిత్రులయొద్ద నుండియు అప్పు తీసికొనుట పూర్తియైనది. నేడడియు సాధ్యము కాలేదు.

శ్యామల చింతాక్రాంతయై—గాఁబడి యిట్లున్న నిఁక నిల్లు గడచుట యెట్లో దైవమెఱుంగును. కుఱ్ఱవాఁడు చూడఁ బోయిన నీతిరు. బజారున కిగుటయే యతనికి దుర్భరము. అన్నిపనులను సుబ్బిచేతనే చేయించరాదా యనుకొనును. నేయి తెమ్మని పంపఁగా పదునొకండు గంటలకు గాని యిల్లు చేరలేదు కట్టెలు తెమ్మని యెంత మొత్తుకొన్నను వినవైన లేదు.

శివ:—అయిప నన్నము వండలేదా.

శ్యా:—ఇదుగో యిందుకే మీరు వ్యాజ్యములలో నోడి పోవుచుందురు. కట్టెలు లేకుండ నెవరైన నన్నము వండఁ గలరా?

శివ:—వాఁడేమియు తినకుండగనే వెళ్ళిపోయెనా?

శ్యా:—పెట్టుట కింటి యందేమున్నది గనుక?

శివరావు భయపడుచు—'ఏమైన డబ్బు నీయలేక పోతివా? యనెను. శ్యామల కనుబొమలు ముడిచివైచి—

"అవు నింటియొద్ద డబ్బులు కాయునుగదా!"

శివరావు జవాబీయలేదు. ఫలహార మేమైన లభించునేమో యని కొంతతడవు వేచియుండెను. కాని శ్యామల దాహమైన నడుగలేదు. అతఁడు నిరాశతో బయటికి వెడలిపోయెను. మాధవుని కష్టముల నూహించుకొని యాతని హృదయము కంపించెను దినమెల్ల పిల్లఁడు పాప మువవాసమే. గదిలోపడి యేడ్చుచుండునేమో. కట్టెలొకసారి సుబ్బిచేత తెప్పించినంత మాత్రమున నేమి మునిగి పోవును! ఇంటిలోని వారందఱి నుపవాసము చేయించు టిప్పుడువరి తనమేల! రెండుమూఁడణాలయిన దొరకునేమో యని అతఁడు తనపెట్టె తెఱచి గాలించసాగెను. లోని కాగితముల నన్నింటిని దీసి బయటవైచెను ప్రత్యంగుళము వెదకెను కాని యొక్క పైసైన లభింపలేదు. శ్యామల పెట్టెలో డబ్బులుం కాయదవుడు తనపెట్టెలో పూవయిన పూయకుండెను. సంతోగవశమున కాగితమునుండి యొక పావలా బిళ్ళ రాలెను. శివరావు సంతసమున నుప్పొంగెను. అతఁ డెన్నెన్నివేలనో సంపాదించి ఖర్చుపెట్టెను. కాని యెన్నఁడును నింత యానంద మనుభవింపలేదు. పావలా తీసికొని అతఁడు మాధవుని గదియొద్ద కేతెంచి మాధవా అని పేరుపెట్టి పిలిచెను ఏమియు జవాబులేదు. గదిలోని కేగి చూచెను. మాధవుని జాడ లేకుండెను. ఇంకను బడినుండి రాలేదా! మనమున నీప్రశ్న జనింపఁగనే యింటిలోని కేగి సుబ్బి నడిగెను. బడినుండి తిరిగి వచ్చెనని తెలిపెను.

శివరా వతఁ డేమైన తినెనా యని ప్రశ్నించెను. సుబ్బి జాబీయక ముక్కు, మూతి బిగించుకొనెను.

శివరావు నెమ్మదినెమ్మదిగ తనగదిలోనికేగి కూర్చుండెను. నేఁడు ప్రథమముగ నతనికి శ్యామలపై కోపమువచ్చెను. క్షణములో నాకోపము తనమీఁదకే ప్రసరించెను. ఆచీఁకటి గదియం దొంటరిగ గచ్చునేలపై పరుండి పుత్రునియెడ నంత యౌదాసీన్యము వహించిన తనను దా నిందించుకొనసాగెను. పగలంతయు నలసిసొలసి యుండుటచే క్షణములో నిద్రపట్టెను.

సుబ్బివచ్చి వంటయైనదని కేకపెట్టెను. శివరా వులికిపడి లేచి కూర్చుండెను. గదిలో దీపము వెలుఁగుచుండెను.

శివ:—ఎన్ని గంటలైనదే సుబ్బీ? నాకు నిద్రపట్టిపోయినది.

సుబ్బి:—ఠాణాలో తొమ్మిది గంటలు కొట్టిరి. ఆపై నెన్ని గంట లయ్యెనో నాకు తెలియదు.

శివ:—మాధవుఁడు వచ్చెనా?

సుబ్బి:—వచ్చిన నింటియుం దుండఁడరా?

శివరావు విదలించుకొని—వచ్చెరా లేదా అని నేనడుగుచుండ యేమేమో వాగెదవేమే?

సుబ్బి:—నేనుమాత్రము చూడ లేదు. అబద్ధమేలయాడవలెను.

శివరావఱగంటవఱకు వాకిటివైపుచూచుచు నిరీక్షించుచుండెను. పిమ్మట బయటికరుదెంచి కుడివైపుగ సుమారు రెండుఫర్లాంగు లేగెను. తిరిగియింటికి వచ్చి—'మాధవుఁడు వచ్చెనా' యని అడిగెను

లేదని యింటనుండి కేక వినవచ్చెను.

శివరావడమువైపున సందుచివఱకేగెను. మాధవుఁ డెక్కడకనుపింపలేదు. అచటినుండి తిరిగివచ్చి ద్వారమునొద్ద నిలిచి 'మాధవుఁడువచ్చెనా' అని అడిగెను.

లోనుండి లేదని జవాబువచ్చెను.

ఠాణాలో పదిగంటలు మ్రోగెను.

శివరావు వేగముగ పార్కునకు కరిగెను. అచటికి సాయంకాలము తిరుగనేగి గడ్డిపైనుండి యుల్లసించెనేమో! పార్కు నలువైపుల కలయఁజూచెను బల్లబల్లకు తిరిగి వెదకెను గడ్డిపైనేకులు పరుండియుండిరి. కాని మాధవుఁడు కానరాలేదు. అతఁడు పేరుపెట్టి మాధవా అని బిగ్గఱగ నఱచెను. ఎటనుండియు జవాబు రాలేదు.

అతనికి బడియందేమైన వినోదము జరుగుచుండెనేమో అను తలంపుకలిగెను. బడిఅచటికి మైలున్నర నెక్కుడే దూరముండెను. అతఁడు బడివైపునకు బయలుదేఱెను. కాని నగము త్రోవనుండియే తిరిగివచ్చెను అచ్చటికే వీధిమాటు మణఁగెను. బడియందింత రాత్రివఱకు వినోదము జరుగుట యసంభవము. తానింటికేగునప్పటికి మాధవుఁ డరుదెంచియుండునని యీతని కాశజనించెను. వాకిటియొద్దకురాఁగానే 'మాధవుఁడు వచ్చెనా' అని కేకవేసెను. తలుపులు మూసియుండెను. జవాబురాలేదు. అతఁడు తిరిగి బిగ్గరగపిలిచెను. సుబ్బి తలుపుతెఱచి 'ఇంకనురాలేదే' యనెను శివరావు సుబ్బిని

నెమ్మదిగ దగ్గఱికి పిలిచి కరుణాస్వరముతో 'నీవింటి విషయము లన్నియు నెఱుఁగుదువు. నేఁడేమిజరిగెనో చెప్పుము.'

సుబ్బి:—బాబూ! అబద్ధము నేనాడలేను. అమ్మవారు తీసికొని వచ్చిన ప్రారంభమున దనకు పుట్టిన పిల్లలనెవరైన నిట్లాడి పెట్టదురా? ఎప్పుడేపనియున్నను పూటపూటకి బజారునకు తోలుటయేనా? రోజంతయు వాళ్ళనుగూర్చి తిరుగుటయే? నేఁడు కట్టెలు తెచ్చుట కేగననంట ఇంటపన్నమే యుడక లేదు. అమాట నేననిన మొగము ముడుచుకొందురు మీరు కేయతని విషయము పట్టనపు డెవరికైన నేలపట్టును?' లేచి భోజనమున కరుగుఁడు. అమ్మగారెప్పటినుండియో వేచియున్నారు.

శివ:—ఈపూట తినరని చెప్పుము

శివరావు తనగదిలోనికేగి దీర్ఘముగ నిట్టూర్పువిడిచెను. వేదనాభరితముగ 'సిశ్వరా! ఇంకను శిక్షపూర్తికాలేదా? ఈ గ్రుడ్డివాని చేతికఱ్ఱను సైతము లాగుకొందువా?' యని యప్రయత్నముగ అనెను.

శ్యామలవచ్చి—మాధవుఁడు నేఁడింకను రాలేదు 'అన్నముడుకుచున్నది. తిని పొమ్మ'ని చెప్పుచునేయుంటిని ఎప్పుడు లేచి వెళ్ళెనో తెలియదు. ఎచట త్రిమ్మరుచుండెనో యేమో! మాటవినుట యనునది లేదుకదా. ఎంతని వేచి యుండఁగలను? మీరు వచ్చి భోజనము చేయుఁడు. అతనికి తీసియుంచెదన'నెను.

శివరావు శ్యామలవంక గడియారము గాంచి—'ఇప్పు డెన్ని గంటలగున'నను.

**శ్యా:**—నేనే మెఱుంగుదును? పదిగంటలగు నేమో?

**శివ:**—కాదండి! పండ్రెండు గంటలైనది.

**శ్యా:**—పండ్రెండే! అప్పుడే! ఇంత యాలస్య మెవ్వాడును చేయఁడే అయిన నింక నెంతవఱ కతని కొఱకు వేచి యుందురు? మధ్యాహ్నము కూడ నేమియు తినలేదు. ఇట్టి రాక్షసి పిల్లల నెచటను జూడలేదు.

**శివ:**—అవును. నిన్ను చాల నిబ్బంది పెట్టుచుండును!

**శ్యా:**—చూడుఁడు. ఇంత రాత్రియైనను నిల్లు పట్టకున్నాఁడు.

**శివ:**—ఇది కట్టకడపటి నేరమేమో!

**శ్యా:**—ఏమి మాటలందురండీ! ఇంతకు నెచటికేగును? ఏస్నేహితుని యింటనో పడి నిద్రించుచుండును.

**శివ:**—దైవకృపవలన అంతే యగుచో బ్రతికిపోదుము.

**శ్యా:**—ఉదయమువచ్చిన కొంచెము బుద్ధిచెప్పుఁడు.

**శివ:**—కొంచెమేమి? బాగుగనే చెప్పెదను.

**శ్యా:**—రండు. చాల నాలస్యమైనది. భోజనముచేయుదురు గాని.

**శివ:**—ఉదయము వానికి బుద్ధిచెప్పి యాపిమ్మట భోజనమా చరింతును. రాక్షసన్న నీకు నమ్మకమైన నాకెక్కడ లభించును?

శ్యామల గింజుకొని—'అయిన నేనే వెడలగొట్టితినా?' యనెను.

శివ:—అయ్యో! ఆమాట యెవరనిరి? నీవెందుకు వెడల గొట్టుదువు? నీవని చేయుచుండెదవుగదా. చేసిచేసివానికే ప్రాణము విసిగెనేమో.

శ్యామల యాపై నోరెత్తలేదు. విషయము ముదురు నని జంకి యూరకుండెను. నిద్రింపుడని యైన చెప్పకుండ లోనికి వెడలిపోయెను. కొంత సేపటికి నుబ్బి తలుపులు కూడ మూసివైచెను.

శివరావున కెట్లు నిద్దురపట్టును? ముగ్గురు కొడుకులలో నొకఁడు మిగిలియుండెను. అతఁడుగూడ చేతినుండి జారిపోయిన నిఁక నేమిగతి యగును? జీవితమునం దంధకారముకాక యేమి మిగులును? పేరు తలంచువాఁడుసైత ముండఁడు. ఆహా! మెట్టిరత్నములు చేయిజాఱిపోయెను? శివరావు కన్నులనుండి నిరంతరాశ్రుధార ప్రవహించుచుండిన నందేమి యాశ్చర్యము కలదు? అంధకారాకృతంబైన తన జీవితాకాశమునం దతఁ డొక యాశాజ్యోతియై వెలుఁగొందుచుండెను. పశ్చాత్తాప తప్తమైన తన దుఃఖజీవితమున కతఁడొక మందమలయానిలము. ఆజ్యోతి యాఱిపోయిన, నాశీతలానిలస్పర్శ అంతరించిన, తన గతి యేమగునో! ఆనుస్థితి యూహాతీతము.

శివరావున కెన్నోసార్లు కునుకుపట్టెను. కాని యే రవంత యలికిడియైనను మాధవుఁడు వచ్చెనేమో అని యులికి పడుచుండెను.

ఉదయము కాగానే శివరావు మఱల మాధవు నన్వేషింప బైలుదేఱెను. ఎవరినైనఁనడుగుటకా సిగ్గువేయుచుండెను.

ఏ మొగము పెట్టుకొని అడుగును? ఏవరికిని తనవట్ల సానుభూతి యుండదని అతని అభిప్రాయము. పైకనకున్నను చేసిన కర్మ మనుభవించుచున్నానని లోననుకొందును. దిన మంతయు అతడు పాతశాలపైనానములందును, తోటలయందును, దొడ్లయందును గలయదిరిగెను. రెండు రోజులనుండి తిండి లేకున్నను నతని కింత శక్తి యెట్లు లభించెనో యూహాతీతము.

రాత్రి పండ్రెండుగంటలకు శివరావింటికి దిరిగివచ్చెను. వాకిట దీపము వెలుగుచుండెను. శ్యామల మంచిగమునొద్ద నిలిచియుండెను. శివరావును జూచి "చెప్పనైనలే దెప్పుడేగితిరో? ఏమైనా జాడ తెలిసెనా?" అని అడిగెను.

శివరావు వగ్నికురియు నేత్రములతో నామె వంకఁ జూచుచు నిట్లనెను—"నాయెదుటనుండి తొలఁగుము. నేనిపుడు మానిసినిగాను. ఇదంతయు నీవు చేసినదే. నీవలననే నేడు నాకీ దుర్గతి పట్టినది. ఆఱు సంవత్సరముల క్రిందట నీ యింటి పరిస్థితి యిట్లే యుండెనా? నీవు నాయిల్లు కూల్చి మట్టము చేసితివి. నానందనోద్యానమును ధ్వంసము గావించితివి. ఒకే యొక మొక్క మిగిలియుండ దానినిగూడ పెఱికి వైచినగాని నీకు తృప్తి కలుగలేదు. నేను నిన్ను వంశనాశమునకై తెచ్చుకొనలేదు. సుఖమయజీవితమును సుఖకర మొనరించుకొనఁదలంచి వివాహమాడితిని. తగిన ప్రాయశ్చిత్తమైనది. తమలపాకులవలె పెంచుకొనుచున్న పిల్లలను నీవు నౌకర్లకన్న హీనముగాఁ జూచితివి, నేను నిన్ను ఉంచితిని

సంధుఁడనై ప్రవర్తించితిని. పొమ్ము. నాకుఁగూడనింతవిషము పెట్టుము. ఆమిగిలిన రవంతలోపము కూడ పూర్తియగును.

శ్యామల భోరునయేడ్చుచు—'నేను దురదృష్టవంతు రాలఁనని నాకే తెలియును. వేఱొకరామాట తెలియఁజెప్ప నక్కఱలేదు. నన్నె భగవంతుఁడేల పుట్టించెనో యెఱుఁగను. ఐనను మాధవుఁడిక తిరిగిరాఁడని మీరెట్లు నిశ్చయించుకొంటి రనెను.

శివ:—నన్ను మండింపకుము. పోయి మనసార నానందింపుము. నీఅభీష్టము నేఁటికి నెఱవేరినది.

---

## చతుర్వింశతి ప్రకరణము

---

శ్యామల రాత్రియంతయు నేడ్చుచునే యుండెను. ఇంతభీషణ కలంకమా! కేశవుఁడు నగలపెట్టె నెత్తుకొనిపోవు చుండుట కన్నులారచూచియు తాను పొక్కలేదు. కారణ మేమి! ఆబద్ధపునేరము నారోపించి నవతిబిడ్డలను నతితము సాధించుచున్నదని నలుగురును ననిపోవుదురనికదా! నేఁడు తన మూకీభావమే మహాపరాధముగ నెత్తిపై మోపఁబడు చున్నది. తాను కేశవునప్పుడే అడ్డగించిన నతఁడవమానము భరింపఁజాలక యెచటికైన వెడలిపోయిన నేమందురు! అపుడు మాత్రము నేరము తనపై మోపఁబడకుండునా!

మాధవునివల్లమాత్రము తానొనరించిన అపచారమేమి గలదు? తక్కువగ వెచ్చించుచు కొంతకూడఁబెట్టఁ దలంచినదే గదా తాను మాధవునిచే నగలు తెప్పించుచుండెను! కూడఁబెట్టి తాను బంగారు తొడుగు వేయించుకొనునా? రాబడి లేనపుడింట పొదుపుగ వాడుకొనుటకంటె కూడఁబెట్టుట కన్యమార్గ మేమున్నది? వయస్సునున్నవారి విషయమే నమ్మకములేనపుడు ముదుసలుల జీవితముల నేమివిశ్వసింపగలము! పిల్లల పెండ్లిండ్లకై తానెవరిని యాచింపఁగలదు? పిల్లభారము తనయొక్క శిరముపైనే లేదుగదా! పతిసాలభ్యముననేగదా తాను నాల్గురాళ్ళు కూడఁబెట్టుట! పతియే అననేల? ఆయన తరువాత మాధవుఁడింటి యజమానికాఁడా? చెల్లెలి వివాహ మాతని బాధ్యత కాదా? ఈపొదుపరితనమంతయు శ్యామల పతిపుత్రుల మేలునకే చేయుచుండెను. ఈపరిస్థితులలో పిల్లపెండ్లిసిముగు వచుట వంటిదిగదా తన సానత్కార్యమునకుగూడ శ్యామల కపటమే ప్రాయఁబడియుండెను.

మధ్యాహ్నమైనను నాఁడు పొయ్యిరాజ లేదు. భోజనమూ జీవితమున నొక ముఖ్యాంశమని యాయింటివారు గుర్తించినట్లే లేదు. శివరావు నిర్జీవుఁడై బైటపడియుండెను. శ్యామల యింటిలో మణగియుండెను. పిల్ల లోనికి బైటికి తిరుగుచుండెను. ఆమెతో మాటాడు వారు లేకుండిరి. మాటిమాటికి మాధవుని గదికడకేగి యన్నా అన్నా యని పిలుచుచు జవాబిచ్చునన్న యున్నగదా!

సాయంకాలము శివరావు శ్యామలకడ కరుదెంచి—'నీయొద్ద నేమైన ధనమున్నదా' అని ప్రశ్నించెను.

శ్యామల యులికిపడి—'ఏమిచేసెదర'నెను.

శివ:—నేనడిగినదానికి జవాబిమ్ము.

శ్యా:—మీకు తెలియదా? ఇచ్చువారు మీరేగదా.

శివ:—నీయొద్ద నేమైన గలదా? లేదా? ఉన్నచో నిమ్ము లేకున్న లేదని చెప్పుము.

శ్యామల యప్పటికిని సూటిగ జవాబు నీయలేదు—'ఉన్నచో నింటనే యుండును. నేను పరాయిచోటి కెచటికి పంపలేదనెను.

శివరావు బయటికి వెడలిపోయెను. శ్యామలయొద్ద పైకముండెనని అతనికి తెలియును. నిజముగ నుండెను కూడ. శ్యామల లేదనిగాని యున్నదనిగాని సైతము చెప్పియుండ లేదు. కాని యామె మాటల వలన నామె కిచ్చుట కిష్టము లేదని స్పష్టముగ తెల్లమగుచుండెను.

రాత్రి తొమ్మిది గంటలకు శివరావరుదెంచి వియ్యమ్మతో 'అక్కా! నేను గ్రామాంతరము పోవుచున్నాను. కొంచము సుబ్బితో చెప్పి పడకను, పెట్టెలో కొన్నిదుస్తులను సర్దించుమ'ని చెప్పెను.

వియ్యమ్మ అన్నము వండుచు—'అమె గదిలో నున్నదిగదా. చెప్పి సర్దించుకొనరాదా? అసలు ప్రయాణ మెక్కడికి'ని అడిగెను.

శివ:—నేను నీతో చెప్పుచున్నాను. ఆమెతో చెప్పవలసి యుండిన నీకేల చెప్పుదును? నేఁడు నీవేల వండుచున్నావు?

వియ్యమ్మ:—యెవరు వండుదురు? ఆమెకు తలనొప్పి. అయినను ఈసమయమున నీవెచటికేగెదవు? ప్రొద్దుననే పోరాదా?

శివ:—ఇట్లే వాయిదాలతో మూఁడు రోజులు గతించినవి. మాధవుఁడెచటనైనఁ గనఁబడునేమో దేశము తిరిగి చూచెదను. ఎవరో సాధువుతో మాట్లాడుచుండెనని కొందఱు చెప్పిరి. వాఁడే బహుశః మోసగించి వెంటఁ గొంపోయి యుండును.

వియ్యమ్మ:—అయినఁ దిరిగి యెప్పుడు వత్తువు?

శివ:—చెప్పఁజాలను. వారమే యగునో నెలరోజులే యగునో!

వియ్య:—నేఁడేమిదినమో! శాస్త్రిగారినడిగి పంచాంగము చూపించుకొనరాదా, ప్రయాణమునకు మంచిదగునేమో?

శివరావు భోజనమునకుఁ గూర్చుండెను. శ్యామలకాతనిపై నాసమయమున నెంతో జాలికలిగెను. ఆమెకోపమంతయు చల్లారెను. ఆమె న్యాయముగ పలుకరింపఁజాలక బిడ్డను ముద్దాడుచు—'చూడవే మీనాయనగారెచటికేగుచున్నారో అడుగు'మని బుజ్జగించెను. పిల్ల తలుపుచాటుననుండి తొంగి చూచుచు 'నాన్నా యెక్కడికి వెళ్ళుచున్నా' వనెను.

శివ:—మీఅన్నయ్యను వెతికితెచ్చుటకు పోవుచున్నానమ్మా

పిల్ల అచ్చటనే నిలువఁబడి—'మేముకూడ వచ్చెద' మనెను.

శివ:—చాలదూరము వెళ్ళుచున్నానుతల్లీ! నీకేమైన తెచ్చి పెట్టెదను. ఇటు నాయొద్దకురమ్మా.

పిల్ల చిఱునవ్వునవ్వి తలుపుచాటునకేగెను. తిరిగి బయటికివచ్చి 'మేముకూడ వచ్చెద' మనెను.

శివ:—మేము వెంటతీసికొని వెళ్ళము.

పిల్ల:—నన్నెందుకు తీసికొని వెళ్ళరు?

శివ:—నీవు నాయొద్దకు రావుగా.

పిల్ల రయ్యాయ్యాగముగా నడుచుచువచ్చి తండ్రియొడిలో నొదిగెను. ఆమె బాలక్రీడతో కొంతతడవు శివరావు తన యంతర్వేదనను విస్మరింపఁగలిగెను.

శివరావు భోజనమాచరించి బయటికేగెను. శ్యామల చూచుచు నిలువఁబడెను మీరారువ్యర్థముగ పోవుచుంటిరని అనవలె ననుకొనెను. గాని అనఁజాలకుండెను. కొంతపైకము తెచ్చి యీయవలెనని అనుకొనెనుగాని యీయఁజాలక పోయెను.

చివరకు పట్టజాలక విద్యమ్మతో—'వదినే! మీరైన చెప్పరాదా! ఎచటికేగుచుండిరో యేమో! నేనేమియన్నను కోపగేయగును. అందులకని మాట్లాడకుండ నుండఁజాలను. ఎక్కడనున్నది తెలియకుండ నెచటని వెదకెదరు? వృథాగా త్రిప్పటయగును.'

వియ్యమ్మ జాలిగాఁజూచి తనగదిలోనికి వెడలిపోయెను.

బయటికేగుటకుముందు జ్యోతిషిఁ జూచుటకైన తన యొద్దకరుగుదెంతురని శ్యామల తలంచెను. కాని యామె యాశవిఫలమయ్యెను. శివరావు పడకమూటను దీసికొని స్వాయి బండిలోఁ గూర్చుండెను.

శ్యామల హృదయము క్షోభింపసాగెను. మరల ప్రియుని దర్శనము తనకగునా యను సంశయము మిలోలోనో యామెను బాధించుచుండెను. ఆమె యాతురతతో శివరావు నావుటకు బయటికరిగెను. అంతలోననే బండి వీధిమలుపును దాటి పోయెను.

---

## పంచవింశతి ప్రకరణము

దినములు గతింపసాగెను. ఒకనెల గడచినను శివరావు తిరిగి రాలేదు. జాబైన వ్రాయలేదు. ఆయన తిరిగి రాకుండిన నేమగునా యనుచింత యామెను నిరంతరము వేధింపఁ దొడగెను. ఆయన యెచటెచట తిరుగుచుండెనో, దేహారోగ్య మెట్లుండెనో యేబాములు పడుచుండెనో యనునదామె కంతగ పట్టలేదు. ఆమెకు తనను గూర్చియు, అంతకన్న నెక్కువగ తన కుమార్తెను గూర్చియు విచారము. ఇల్లు గడచుట యెట్లు! పిల్ల యేమగును! దైవకృప యెట్లున్నదో! ఎట్లో పోవు

పుగ వాడి తాను కొంత ధనముం గూడ పెట్టెను. కాని ప్రతిదిన ము దేకొంత మోకర్చుగుచుండెను. శ్యామల కాసాము్యనుండి యొక్కొక్క మాప్యమును వెచ్చించుచుండ తన శరీరమునుండి కొంత రక్తము ధారవోయుచు న్నట్లుండెను. ఆమె మాట మాటికి శివరావుపై విసుగుకొనును. పిల్లయేమైన గావలెనన యేడ్చిన అదృష్టహీనరాని తిట్టి పోయును. అంతే కాదు వియ్యమ్మ యింటనుండుట సైతమామెకు కష్టముగ నుండెను. ఆమె తనసెత్తి నున్న శ్లో భారమనిపించుచుండెను. హృదయము మండునపుడు మాటలు నిప్పులు గ్రక్కుచుండును శ్యామల స్వభావసిద్ధముగ మృదుభాషిణియై యుండెను. కాని యిపు డామె గయ్యాళిగంపలలో నొకతెగ నెన్నదగు విలుగనుం డెను దినమంతయు నామె యేవో కఠినమగు మాటలు పల్కుచునేయుండును. ఆమె మాటలలోని కోమలత్వములకో అంతరించి పోయెను. భావములలో మాధుర్యమే లేదు. సుబ్బ యాయింట నెంతకాలమునుండియో పని చేయుచుండెను. ఆమె చాలనోర్పుగలదే కాని యవాచ్యశములు శ్యామలపెట్టు గారపిడికి నోర్వజాలక యామె యింటిదారి పట్టెను. ప్రాణ నమానముగ ప్రేమించు పిల్ల విషయమై కూడ శ్యామలకు చిరాకే మాటిమాటికి కోపగించి పిల్లను కొట్టుచుండును. వియ్యమ్మ పిల్లనోదార్చి బుజ్జగించును. ఆ యనాధ కామె యొక్కతెయే యాశ్రయమై యుండెను.

శ్యామలకు యశోధరతో నంభాషించుట యొక శ్రే మానంద ప్రదమగు విషయమై యుండెను. వారింటి కేగుట

కేదో వ్యాజముతో నామె యెదురు చూచుచుండును. పిల్లను వెంటతీసికొని పోవుట యిపుడామెకు రుచింపకుండెను. తినుట కన్న తినుబండారము నింట లభించుచున్నపుడు పిల్ల వారింట నానందముగ నాడుకొనుచుండెను. ఇపుడచటి కేగిన నామె కాకలి వేయును శ్యామల యెంత కసరినను, గ్రుడ్లురిమినను పిల్లయాకలి యని యేడ్చుట మానదు. అందుచే శ్యామల పిల్లను తనవెంటఁ గొంపోవదు. యశోధర యొద్ద కూర్చుండినప్పుడు తానొక వ్యక్తి ననిపించును. అంతసేపు మాత్ర మామె తన చింత లన్నింటి విస్మరించుచుండెను. కల్లుత్రాగువానికి మత్తుననే దుఃఖములు గుర్తుండనట్లు యశోధర యెదుట నామె కేమియు స్మరణకు రాదు. ఆమె నింటియొద్దఁ జూచువారిచట వరికించినచో విస్మయమందక మానరు. అతిట్టులమారి గయ్యాళిగంపయే యిట వినోదములకు మధురభావనములకు నాకరమైయుండెను. తనయింటియొద్ద పరాప్తమై యదృశ్యమైన స్వాభావిక యౌవన భావములిట పొంగిపొరలుచుండెను. ఏమెరుపు దుస్తులో,నగలో ధరించి తన విపత్కథను మనమందే అణచుకొని ఆమె యిట కరుదెంచును. ఆమె యిట కేడ్చుటకుగాక ఆనందించుటకే వచ్చుచుండెను

ఆమె యదృష్టమున, నాయానందముకూడ ప్రాయః బడియుండలేదేమో! శ్యామల మామూలుగ నెడ మధ్యాహ్నమపుడు యశోధర యింటికేగుచుండెను. ఒకరోజున మన ఇంటో దిగాలుగ నుండుటచే నుదయముననే అచటి కేగెను.

యశోధర పడీస్నానమున కరిగి యుండెను. చలపతి అనువృత్తికై దుస్తులు ధరించుచుండెను. పనికత్తె తన పనిపాటలలో మగ్నమై యుండెను. శ్యామల తన నెచ్చెలి గదిలోని కరిగి నిశ్చింతగఁ గూర్చుండెను. యశోధర యేదో పని చేసికొనుచుండును. అప్పుడే రాగలదని యామె తలంచెను. రెండు మూఁడు నిమిషములు వేచియుండి యామె రాకుండుటచే బీరువాలోనుండి యేదో పటముఁదీసి దానినిఁ బరికించుచు ముక్తకేశయై మంచముపై పరుండెను. ఇంతలో నేదో అవసరమై చలపతి ఆగదిలోనికి రావలసివచ్చెను. తన సులోచనములు వెదకికొనుచు నేమో హఠాత్తుగ గదిలోన కాలిడెను. శ్యామల వాకిలి తలవైపుగ విరియఁబోసిన జుట్టుతో పరుండి యుండెను. డాక్టరును జూచి యులికిపడి లేచి జుట్టు ముడిచివైచుకొనుచు నామె మంచముపైనుండి క్రిందికి దిగెను. డాక్టరు తిరిగి వెళ్ళుచు గోడచాటున నిలువఁబడి 'క్షమించు శ్యామలా! నీవిచట నుంటివని యెఱుంగను. సులోచనములు నా గదిలో కన్పింపలేదు. ఎచట మఱచితినో యేమో. ఇక్కడ నున్నవేమో అనుకొంటి' ననెను.

శ్యామల తలవైపునఁ జూడఁగ గూటియందు సులోచనముల పెట్టె కనంబడెను. ఆమె ముందుకరిగి పెట్టె తీసికొనెను. తల వంచికొని యొడలు కుంచించి, యొదిగి యొదిగి సంశయభయములతో డాక్టరువైపునకు చేయి చాచెను. డాక్టరామె నదివఱలో నొకటి రెండుసార్లు చూచినను నాఁడువచ్చిన భావములు మున్నెన్నఁడు నాతనికి రాలేదు. సంవత్సరములుగఁ

దన హృదయమునఁ గప్పిపెట్టి యుంచికొనిన యగ్ని నాఁడు గాలితాఁకుడున ప్రజ్వరిల్లెను. కన్నులజోడుఁగొఱకు చాచినయాతని హస్తము కంపించుచుండెను. జోడుఁదీసికొని సైతము కదలక యాతఁడట్లే బొమ్మవలె నిలిచియుండెను ఆపకాంతయున భయపడి శ్యామల 'యశోధర యెచటికైన నేగివదా' అని ప్రశ్నించెను. డాక్టరు తలవంచుకొనియే 'అవును స్నానము చేయనేగివద'ని ప్రత్యుత్తర మొసంగెను

డాక్టరింకను బయటికరుగక అచటనే నిలిచియుండెను శ్యామల ! తిరిగి యెప్పుడువచ్చునో ! అని మఱల ప్రశ్నించెను. డాక్టరు తలవంచుకొనియే' వచ్చుచునే యుండవచ్చున'నెను.

అతఁడింకను బయటికరుగలేదు. ' అతని హృదయమున భయంకరద్వంద్వయుద్ధము జరుగుచుండెను. తగునా తగదా అను ఔచిత్యబంధనము కాక పిఱికితనమను నూలుపోగొకటి నడ్డియుండెను.

శ్యామల మఱలనిట్లనెను. 'ఆమె యెచటికైన వాహ్యాళి కరిగినదేమో నేనునుపోయి తిరిగివచ్చెదను.'

పిఱికితనపు నూలుపోగు సైతము తెగిపోయెను. వెన్నిచ్చి పాఱిపోవు సైన్యమును నదియడ్డుకొనినచో మొండిసాహసము వచ్చును డాక్టరు కన్నెత్తి శ్యామలవంకఁజూచి అనురాగభరిత స్వరముతో 'పోవచ్చునలెమ్ము అదివచ్చుచునే యుండును. ఇప్పుడే నీవుపోవలదు. ప్రతిదినమామెకై వేచియుండుదానవు నేను నాకై యుండుము. ఎంతదనుక నీమద నాగ్నిచే తపింపఁజేయుదువు ? నిజముగ శ్యామలా .'అనెను.

శ్యామల యామెపై వినఁజాలక పోయెను. భూమియంతయు గిఱ్ఱున తిరిగిపోవుచున్నట్లు, తనపై పిడుగు లొక్కుమ్మడి కూలినట్లామె కంపించెను. నోటనొక్కమాటైన పలుకకయే యామె గదినుండి శీఘ్రముగ వెడలిపోయెను. డాక్టరు బిక్కమొగము వైచుకొని అచటనే నిలిచియుండెను. ఆమెనాపుటకు గాని, యేమైననను టకుగాని అతనికి సాహసము లేకపోయెను.

ద్వారమునొద్ద కరుగఁగనే శ్యామలకు బండిదిగుచున్న యశోధర కనిపించెను. యశోధర యామెను జూడఁగనే పోయి పలుకరింపవలెనని ముందుకేగెను. కాని శ్యామల యామెకా యవకాశము నీయకయే విక్షిప్తశరమువలె దూసికొని వెడలి పోయెను యశోధర విస్మితయై యొక్కక్షణము నిలువఁబడెను. విషయమేమో యామె కవగతము కాలేదు. ఆమె ఆతురతఁ జెంది గబగబ యింటిలోని కేగెను. ఇంటనేమి జరిగినదేయని దాసి నడిగెను. క్రిందటిరోజున నెవరో నామె నేదో యని నట్లు తెలిసెను. అపరాధి యెవరో గట్టిగ తెలిసికొని యున్న వానినున్నట్లు నౌకరినుండి తొలఁగింపవలెనని యామె నిశ్చయించుకొనెను చరచర తనగదిలోని కేగెను లోన కాలిడగనే బిక్కమొగముతో కూర్చుండియున్న డాక్టరగుపడెను. 'శ్యామల యిటకు వచ్చెనా'యని యశోధర యతని నడిగెను.

డాక్టరు తలగోకికొనుచు—'అవు నామె వచ్చియుండె' ననెను

యశో:—ఆమె నెవరైన నేమైన ననిరా? నన్ను జూచియు పలుకరింపకుండ చరచర వెడలిపోయినది.

డాక్టరు మొగము తెల్లపోయెను. ఆమె నెవ్వరును నేమియు ననలేదే అనెను.

యశో:—ఎవ్వరైన నేమైన ననినట్లు తెలిసినా యున్న వారి నున్నట్లు తీసివైచెదను. వారిపాట్లు దైవమున కెఱుక. డాక్టరు కడఁబడుచు—నేను మాత్ర మెవ్వరి నను చుండ చూడలేదు. నిన్నామె చూడనేలేదేమో.

యశో:—బాగుబాగు నన్ను చూడకపోవుటేమి? ఆమెయుండే గదా నేను బండిదిగితిని. ఆమె నావంకఁజూచియు పలుక రింపలేదు ఈగదిలోనికామె వచ్చియుండెనా?

డాక్టరు పైప్రాణములు పైకెగిరిపోవుచుండెను. వెనుక ముందాడుచు 'గదిలోనికి రాలేదు' యనెను.

యశో:—మిమ్మిచటఁజూచి వెళ్ళిపోయినదేమో. ఏదాసియో ఏమైన ననియుండును. నీచజాతి పరువుప్రతిష్ఠలు తెలి సినఁగదా. ఒసీ వెంకీ యిటురావే

డాక్టరు—దానినేల పిలిచెదవు? ఆమె సూటిగ తలుపు కడ కేగనేగాని యెవ్వరితోడ నేమియు మాటాడలేదు.

యశో:—అయిన మీరేయామెనేమో యని యుందురు. డాక్టరు గుండె కొట్టుకొనసాగెను—'నేనేమందును? అంత మూర్ఖుఁడనా' యనెను.

యశో:—ఆమె గదిలోనికి వచ్చినను మీరట్లే కూర్చుండి యుంటిరా?

డాక్టరు:—నేనిక్కడ లేనే లేను. వసారాలో నాకన్నులజోడు వెదకికొనుచుంటిని బయట దొరకకపోఁగా గదియం

దున్న దేమో యని తలంచితిని. వచ్చి చూడఁగా నామె గదియుందే కూర్చుండి యుండెను. నేను బయటికేగదలంచుచుండ నింతలో మీకేమైన కావలెనా యని యామెయే యడిగెను. ఇచట నాకన్నులజోడు లేదుగదా యంటిని. జోడు తలవైపుఁ గూటియుండుం డెను. ఆమె దానిని తీసియిచ్చెను. అంతే యింక నేమియు జరుగలేదు.

యశో:—కన్నుల జోడిచ్చి యామె చీదరించుకొనుచు వెడలి పోయెనా? ఎందుకట్లు చేసినదో!

డాక్టరు:—ఆమె చీదరించుకొనుచు వెడలిపోలేదే. వెళ్ళు చుండఁగా కూర్చుండుఁ డామె వచ్చుచునే యుండునని అంటిని. ఆమె ఆగలేదు. నేనేమి చేయఁగలను?

యశోదర ఆలోచించుచు—నాకేమియు నర్థ మగుటలేదు. పోయి ఆమెనే అడిగి తెలిసికొనవలెను. అసలేమి జరిగినదో!

డాక్టరు:—అట్లయిన పోవచ్చును. కాని యిప్పుడే యేమి తొందర వచ్చిపడినది? రోజంతయు నేమి చేయుదువు?

యశోధర పోవ సిద్ధ మగుచు—'నా మన మంతయు గందరగోళముగ నున్నది. పోవచ్చును తొందర యేమని మీ రందురు.'

యశోధర చరచర శ్యామల యింటివైపు నడచుచు నై దునిముషములలో వారింటికి చేరెను. శ్యామల గదిలో మంచముపై పరుండి వెక్కి వెక్కి యేడ్చుచుండెను. చెంత జ్యోతి నిలిచి యెందుకే ఏడ్చుచుంటివని ప్రశ్నించుచుండెను.

యశోధర జ్యోతి నొడిలోనికి దీసికొని శ్యామలతో—
నిజము చెప్పు మశ్యా! మాయింట నెన్నెవ్వరైన నేమైననని రా?
నేనందతి నడిగితిని. ఎవ్వరును చెప్పరనెను.

శ్యామల కన్నీరు తుడుచుకొనుచు నన్నెవ్వరును నేమి
యు ననలేదు. నన్నెవరేమందురు రనెను.

యశో:—అయిన నన్నా పలుకరింపకయే శీఘ్రముగ వెడలి
వచ్చుటయే తిరుపుగ నేద్చుచుంటివేమి?

శ్యామల:—నాదురదృష్టమున కేడ్చుచుంటి నంతియేగాని
నాకేమియు లేదు.

యశో:—నీవు నిజము చెప్పకున్న పెద్దయొట్టు.

శ్యామల:—ఒట్టులు పెట్టకుము నన్నెవ్వరు నేమియు నన లేదు
అబద్ధముగ నెవ్వరి నేమనగలను?

యశో:— నాతోడి యొట్టుపెట్టుము.

శ్యామల:—నీవూరక మొండిపట్టు పట్టుచుంటివి.

యశో:—నీవు నిజము చెప్పకున్న నామీద నీకు ప్రేమ
యేమాత్రము లేదనుకొందును. అంతే మన స్నేహ
మంతయు ముఖప్రీతిమాటలని నిశ్చయమగును. నేను
నీయొద్ద నేమియు దాచను. నీవు మాత్రము నన్నన్య
రాలనుకొంచువు. నీవన్న నాదానవని యెంతో విశ్వ
సించి యుంటిని. కాని యెవ్వరును నెవ్వరికిని గారని
యిపుడు తెలిసినది.

యశోధర కన్నులు చెమ్మగిల్లెను. పిల్లను దింపివేసి
యామె ద్వారమువైపునకు నడచెను. శ్యామల ఆమె చేయి

పట్టుకొని యామె యేడ్చుచు 'యశోధరా! నీకాళ్ళపైఁ బడెదను. నన్నొకమాట మాత్ర మడుగకుము. వినిన నీకెంతో దుఃఖము గలుగును. నీకు నా మొగము సైతము తిరిగి చూపింపఁజాల నేమో! నాకర్మము కాకున్న దినము లిట్లువచ్చునా? దైవమునకు నాపైదయయున్న నేల నన్నెత్తికొనిపోఁడు! ఇప్పుడే యీ దుర్గతి పట్టినపిదప ముందింకేమగునో!'

ఈమాటలలో నిమిడియున్న గూఢార్థము బుద్ధిమంతురాలగు యశోధరకు తెలియకపోలేదు. డాక్టరేదో వెకిలిపని యొనరించియుండునని యామె నిశ్చయించుకొనెను. అతని మాటల తడఁబాటు, ప్రశ్నలకు సూటిగ జవాబీయకుండుట, కళదప్పిన తెల్లమొగము మొదలగునవన్నియు నామె కన్నులకుఁ గట్టినట్లుండెను. ఆమె యాపాద మస్తకము కంపించిపోయెను. నోటపల్లెత్తుమాటని అనక యామె క్రుద్ధసింహివలె ద్వారమువైపున కురికెను. శ్యామల యామె నాపఁదలంచెను గాని అందుకొనఁజాలక పోయెను. క్షణములో నామె యింటికి చేరుకొనెను. శ్యామల అచటనే కూలఁబడి యేడ్వసాగెను.

---

## షడ్వింశతి ప్రకరణము

శ్యామల రోజంతయు మంచముపై పడియుండెను. ఆమె దేహమునందు ప్రాణమే లేనట్లుండెను. స్నానముచేయలేదు. భోజన మాచరింపలేదు. సాయంకాలమున కామెకు

తీవ్రముగ జ్వరమువచ్చెను. రాత్రిఅంతయు దేహము వేడి పెనమువలె కాలుచుండెను. మఱునాడుకూడ జ్వరముపశమింపలేదు. కొంచెముమాత్రము తగ్గెను. ఆమె మంచముపై పడుండి నిశ్చలదృష్టితో ద్వారముపైపు చూచుచుండెను. నలుదిక్కుల శూన్యముగనుండెను. లోన శూన్యతయే; వెలుపలను శూన్యతయే. విచారము లేదు దుఃఖము లేదు. స్మృతి లేదు. బుద్ధియందు కదలికయే లేకుండెను.

ఇంతలో విద్యమ్మ పిల్లనెత్తుకొనివచ్చి నిలిచెను. శ్యామల పిల్లయేడ్చుచుండెనా అని అడిగెను.

విద్యమ్మ:—లేదు. నోరైననెత్తలేదు. రాత్రిఅంతయు మొదలకుండ పడియుండెను. యశోధర కొంచెముపాలు పంపెను. త్రాగినది.

శ్యా:—గొల్లది పాలిచ్చిపో లేదా?

విద్య:—వెనుకటి పైకమీయనిది యివ్వననెను. నీశరీరమందెట్లున్నది?

శ్యా:—నాకేమి? నిన్నమాత్రము దేహమున జ్వరతాపముండెను.

విద్య:—పాపము డాక్టరుగారి పరిస్థితి అన్యాయమైనది.

శ్యామల గాబరాపడి—'ఏమైనది? కుశలముగ నున్నారా' అనెను.

విద్య:—కుశలముగ నుండుటేమి? పాడెకట్టుచున్నారు. విషము తిని చచ్చెనని కొందఱనుచున్నారు, కొందఱు హృద

యమాగిపోయి చచ్చెననుచున్నారు. నిజము దైవ మెఱుంగును.

శ్యామల కంఠము నగద్గదిక మయ్యెను తడఁబడుచు-పాపమింక యశోధర గతియేమగును. ఆమె యెట్లు జీవింపఁ గలుగునని యేడ్వసాగెను. ఎంతో నేవళ్లేడ్చి తుద కామె యశోధర కడకేగ సిద్ధపడెను కాళ్ళు గడగడ వణఁకుచుండెను. ఆమె గోడను పట్టుకొని నిలువఁబడఁగలిగెను. కాని మనస్సు మాత్ర మాగ లేదు. ఇటనుండి యరిగి యశోధర భర్త నేమన్నదో యేమో, నేనామెతో నేమియుఁ జెప్పలేదే. నామాటల నామె యెట్లర్థము చేసికొనెనో! అయ్యో అంతటి రూపవంతుఁడు దయాశీలుఁడు, గుణవంతుఁడు మృత్యువు కెఱయయ్యెనా? తన క్రోధమునకింతటి భీషణ పరిణామ మొదవునని యామెఁ యెఱింగి యుండిన శివుఁడు హాలాహలమట్లు తన యావమానమును మ్రింగి యూరకుండెడిది

తన నిష్ఠురత వలన డాక్టరు కీగతి పట్టెనని తలఁచుకొని నవ్వాను శ్యామల గుండెలు బ్రద్దలగుచుండెను. హృదయమున శూలముతో పొడిచినట్లు వేదన యగుచుండెను. వెంటనే యామె చలపతియింటికేగెను.

అప్పటికే శవము నెత్తిరి. బయట నిశ్శబ్దముగ నుండెను ఇంటినిండ స్త్రీలు మూగియుండిరి. యశోధర నేలపై చతికిలఁబడి యేడ్చుచుండెను శ్యామలను జూడఁగనే యామె గగ్గోలుగ నేడ్చుచు వచ్చి యామెను కౌఁగిలించుకొనెను. ఇద్దరు నెంత తడవో యేడ్చుచుండిరి.

స్త్రీల గుంపు తగ్గిపోవఁగానే యేకాంతమున శ్యామల యశోధరతో 'అక్కా! ఇదేమి? నీవాయనతో నేమి చెప్పితి' వనెను.

యశోధర యీ ప్రశ్న కెన్నోమార్లు తన మనమున సమాధాన మిచ్చుకొని యుండెను. ఆమె మనమే సమాధానమునఁ దృప్తిఁ జెందెనో యద్దానినే శ్యామలకు సైత మొసంగెను. 'నేనెట్లు మెదలకుండ నుండఁగలనో చెప్పుము. కోపపు మాట మీఁద కోపము రాదా మరి!' యనెను.

శ్యా:—నేను నీతో నేమంత చెప్పియుండలేదే.

యశో:—నీవెట్లు చెప్పకుము. చెప్పనే లేవు. కాని వారు మాత్రము జరిగినది జరిగినట్లు చెప్పిరి. నేనపుడు నోటికి వచ్చినట్లెల్ల నంటిని. మనమునందొక తలంపు కలిగినపుడు క్రియ జరిగినట్లే భావింపవలెను. తగిన యవకాశము వీలు లభించుచో ఆతలంపు నెఱవేరినట్లే. నేను నవ్వులాట కట్లు చేసితినని యెవరును తప్పించుకొనఁ జాలరు. ఏకాంతమున నట్టిమాటలు పలుకుటయే లోనఁగల దుర్భావమునకు నిదర్శనము. నేను నీతో చెప్పలేదుగాని యాయన నీవంక నదొక దృష్టితో చూచుచుండుట నెన్నిసార్లో గమనించి యుంటిని. నాకే మోసము కలుగుచున్నదేమో యని యపుడపుడు భావించుచుంటిని. ఆ చూపుల భావమేమో నేఁడవగతమైనది. నేను ప్రపంచ మెఱింగిన దాననగుచో నీవిషయమింతవఱకు వచ్చెడిది కాదు.

కసీనము స్త్రీపై వారి దృష్టిపడకుండనైన చూచెడిదానను. కాని పురుషుల మాటలకు చేతలకు నింత భేదముండునని యేమెఱుంగుదును. భగవదిచ్ఛ యిట్లుండఁగ నన్యథా యెట్లు జరుగును! అట్టి ముత్తైదువు తనముకంటె వైధవ్యము తక్కువదని నేను భావింపను. తనధనము పామైకలచు ధనవంతునికంటె దరిద్రుడెంతో మేలు. విషాన్నము భుజించుటకంటె నుపవసించుట మిక్కిలి సులభము.

ఇంతలో డాక్టరుతమ్ముఁడు విమల లోనికివచ్చిరి. ఇల్లంతయు నొక్కసారి గగ్గోలయ్యెను.

---

## సప్తవింశతి ప్రకరణము

మఱొకమాసము గతించెను. యశోధర తన మఱఁది వెంట మరునాఁడు వెడలిపోయెను. శ్యామల రెయింటరిగ నుండ వలసివచ్చెను. ఏవ్రొనవ్వులతో, సంభాషణలతో పూర్వము రోజులు గడచుచుండెను. ఇపుడేమ్పుట యొక్కటేవని, ఆమె యారోగ్యము నానాఁటికి క్షీణించుచుండెను. పూర్వముండిన యింటిఅద్దె యెక్కుడగుటచే తక్కువఅద్దెకు మఱొకయిల్లు తీసికొనెను. ఇదియొక యిఱుకుసందున నుండెను. లోననొకగది, చిన్నదొడ్డి మాత్రముండెను. గాలి, వెలుతురులవురూపమే. దుర్వాసనతో ముక్కులు పగిలిపోవుచుండెను డబ్బుండియు

కొనిన్నినా భృవవాసమే అగుచుండెను. బజారునుంచి వస్తువు లెవరు తెత్తురు? ఇంట మగవారు లేరు. మగపిల్లలును లేరు. ప్రతి దినము వంటయెవ్వరికై చేయవలెను? అసలు వారు ప్రతి దినము భుజింపవలసిన అవసరమేమున్నది? ఒకనాఁడొకసారి భుజించి నచో రెండుమూఁడు రోజులవఱకు నక్కఱలేదు పిల్లకు బజారునుండి మిఠాయివచ్చును. ఈపరిస్థితులలో నారోగ్యము చెడకుండ నెట్లుండును? చింత, శోకము, దురవస్థ వీనిలో నేయొక్కటోయైన భరింపవచ్చును. ఆమెకు మూఁడును ముప్పిరియై బాధించుచుండెను. శ్యామల తాను మంచముతిననని యొట్టు పెట్టుకొనెను. పాపమేమిచేయఁగలదు! తనయొద్దనున్న స్వల్ప ధనములతో వైద్యమెట్లగును? తిండికిగడవనపుడు మందుల మాట యేమనవలెను? శ్యామల నానాఁటికి దిక్కఱి శల్యమై పోవుచుండెను.

ఒకరోజున వియ్యమ్మ—'శ్యామలా! యెంతకాల మిట్లు కుమిలియుండఁగారెదవు. బ్రతుకుతోఁగదా ప్రపంచ మున్నది. వదవైద్యునికైన చూపించివత్తు'ననెను

శ్యామల విరక్తి భావముతో 'బ్రతుకుట యేప్పట కొఱకే యైనపుడు చచ్చుటయే మేల'నెను.

వియ్యమ్మ:—పిలిచినంతమాత్రమున మృత్యువు రాదుగదా.

శ్యా:—మృత్యువు పిలువకుండఁగనే వచ్చును. పిలిచిన నేల రాదు! ఇఁక నది వచ్చుటకెన్ని దినములో పట్టదు. వదినే! నాకు దినమొక సంవత్సరముగ నున్నదను కొనుము.

విద్యు:—నీవంత విరక్తిఁ జెందుట మంచిదికాదు. ప్రపంచ సుఖ మెప్పుడే యనుభవించితివి?

శ్యా:—నేనిన్నాళ్ళనుండి యనుభవించుచున్నదే ప్రపంచ సుఖమునకుచో దాసికొక నమస్కారము. నిజముగ వదినే నన్నీపిల్ల మోహము బంధించి యుంచుచున్నది గాని లేకున్న నేనాఁడో ప్రాణముల విసర్జించి యుండెడి దానను. పాపము దీని యదృష్ట మెట్లున్నదో.

ఇద్దరును నేడ్వసాగిరి శ్యామల మంచము పట్టినప్పటి నుండి విద్యుమ్మ హృదయమున దయాప్రవాహము జనించెను. ద్వేషము లేశమైన మిగులలేదు. ఏపని చేయుచుండినను శ్యామల మాటవినినంతనే యామెకడకు పరువెత్తును. గంటల తరబడి పురాణ గాథలను వినిపించు చుండును. శ్యామల కిష్టమగు పదార్థముల వండ నిశ్చయించును శ్యామల యెన్నఁడైన నవ్విన తన కపరిమితానందము. పిల్లయిఁక నామె కంఠహారమైనది. ఆమె నిద్రలో నామెయే, మెలఁకువలో నామెయే. ఆ బాలికయే యిప్పుడిక వారి ప్రాణాధారము విద్యున్మ గొంతుతడవైనపిమ్మట—నీవింత నిరాశఁ జెంద దవేమే. భగవంతుని దయవలన నీకు నాలుగైదు రోజులలో నెమ్మదింపఁగలదు. ఏవైద్యునికడకైన పోవుదము లెమ్మనెను.

శ్యా:—వదినే! నాకిఁక నేవైద్యులవలనను ప్రయోజనము లేదు. నన్నుగూర్చి మీరుచింతింపకుఁడు. పిల్లను మీకొప్పగించి పోవుచున్నాను. దైవకృపవలన నిది బ్రతికి బట్టగట్టిన నేదైన మంచివానికిచ్చి పెండ్లి

చేయుదు. నేను బ్రతికియుండగ నీకొఱకేమియు చేయజాలనైతిని కేవలము కనిసయపరాధముమాత్ర మొనరించితిని. దీనిని క్షమించినను సరే విషము పెట్టిచంపినను సరేగాని యీపాత్రునికిచ్చి వివాహము మాత్రమాచరింపవలదని నా ప్రార్థన. నేను మీకేమియు సేవచేయజాలకపోయినందుకు దుఃఖించుచున్నాను. దురదృష్టవంతురాలనగు నావలన నెవ్వరికిని సుఖము లేక పోయినది. నానీడపడినచో పిల్ల సర్వనాశనమైపోయినది. ఆయనగారింటికేనాడైన తిరిగివచ్చుచో నీనిర్భాగ్యురాలు తనతప్పులను క్షమింప వేడినదని చెప్పుడు.

వియ్యమ్మ యేడ్చుచు:—అమ్మా! నీ అపరాధ మేమియును లేదు. దైవసాక్షిగ నీపట్ల నాకేమియు దురభిప్రాయము లేదు. కాని నేను మాత్రము నీయెడల నిరంతరము కపటముగనే ప్రవర్తించితిని. అందుకు కారణము నేను దుఃఖపడకతప్పదు.

శ్యామల కాతరనేత్రయై—'వదినే! అని' గూడదుగాని అనకుండ నుండజాలకున్నాను. ఆయన నన్నెప్పుడు నవిశ్వాస దృష్టితోనే చూచిరి. నేను మనసునందైన నెన్నడు వారి నుపేక్షింపలేదు. జరుగవలసిన దేదో జరిగినది. ఇహము లేకున్నను సద్ధర్మమాచరించి పరమునుగూడ చెడగొట్టుకొందునా! పూర్వజన్మయందేపాప మొనర్చితినో యీప్రాయశ్చిత్తము జరిగినది. తిరిగి యీజన్మయందు నైతము పాపమే యొన రించిన నాముందుగతి ఏమగును!

శ్యామల యూపిరి వేగముగ కొట్టుకొనసాగుచుండెను. మంచముపై కూలఁబడి పిల్లవంక దైన్యముగఁ జూచెను. ఆ చూపామె జీవితవిపత్కథ కొక మహావ్యాఖ్యానముగనుండెను. దానిని వర్ణింప వాణికి శక్తి చాలదు.

మూఁడు దినములలో నీ విధముగ శ్యామల కన్నుల వెంట నంతతధారగ నశ్రువులు ప్రవహించుచుండెను. ఆమె యెవ్వరితోడను పలుకదు. ఎవ్వరివంకను జూడదు. ఎవ్వరే మన్నను వినదు. ఒకటే ఏడ్పు. అమె వేదన యూహాతీతముగ నుండెను.

నాల్గవ రోజు సాయంకాల మావిపత్కథ సమాప్తమాయెను. పశుపక్ష్యాదులు తమతమ నెలవుల కరుగుతరి శ్యామల ప్రాణవిహంగము సైత మెగిరిపోయెను. దినమెల్ల వేటఁగాండ్ర వాతఁబడి క్రూరమృగముల బారి జిక్కి ప్రచండ ఝంఝామారుతాహతమై వ్యథితమైన విహంగము కడకు తన యావాసమున కెగిరిపోయెను.

వీధి జనులందఱు నచట మూగిరి. శవమును బయట పెట్టిరి. ఎవరు దహింతురను ప్రశ్న యుదయించెను. అందఱు నావిషయ మాలోచించుచుండ నింతలో నొక ముదుసలి బాటసారి తన మూసిన మూటతో వచ్చి యట నిలువఁబడెను. అతఁడే వకీలు శివరావు.

సంపూర్ణము.

